# ఎమెస్కో వచన రామాయణం

(దశమ సంపుటం)

రచన:

శతావధాని కోట వీరాంజనేయ శర్మ



యం. శేషాచలం అండ్ కంపెనీ

మచిలీపట్నం _ సికింద్రాబాదు

EMESCO VACHANA RAMAYANAM - Vol. 10 -

*as retold by* :

SATAVADHANI KOTA VEERANJANEYA SARMA

*first edition* :

SEPTEMBER 1981

*publishers* :

M. SESHACHALAM & Co.,

Machilipatnam, Secunderabad.

*cover design* :

BAPU

*printers* :

MADHU PRINTERS,

Secunderabad

Price Rs 5-00



*distributors* :

M/s. ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,

3237, Rashtrapathi Road, Secunderabad - 500 003.



1 9 8

# ద్వాదశాదిత్య మండలంవలె ప్రకాశించే

# 13సంపుటాల ఎమెస్కో వచన రామాయణ ప్రాశస్త్యం.

ఏనాడు వాల్మీకి మహర్షి అపార తపశ్శక్తితో వేదాన్ని రామాయణాత్మకంగా ఆవిష్కరించాడో ఆ నాటినుండి అవిచ్ఛిన్నంగా శాఖోపశాఖలతో బహు నామాలతో ఆ కల్పవృక్షం భారతాన్ని పుణ్యభూమిగా, కర్మభూమిగా చేసి దిగ్దిగంతాలకు ప్రాకింది. ఇంకా ప్రాకుతుంది. అందుకే ఒక కవి "రాఘవేశ్వర చారిత్రము నెందరెన్ని గతులన్ వర్ణించినన్ క్రొత్తదే" అని అన్నాడు. మేం కూడా ఆ పవిత్ర భావంతోనే ఈ మహాకార్యానికి పూనుకున్నాం. ఈ నూత్న ప్రయత్నంలో ఒక విలక్షణమైన మార్గం త్రొక్కడం జరిగింది. వేదానికి వేదం ప్రమాణంలాగా వాల్మీకి రామాయణానికి వాల్మీకియే ప్రమాణంగా అనువాదంలోనే అపవాదులు పరాస్తం చేయబడినై. యథాతథంగా అనువదించినా స్వతంత్ర కావ్యంవలే చదువరులకు ఆనందం కలిగిస్తుంది. ఎన్నో గ్రంథ గ్రంథులు వున్నై. ఎన్నో పూర్వాపర విరుద్ధాలున్నట్లు పైకి కనుపిస్తాయి. వచ్చిన కథలే వస్తై. ఒకచోట శంకకు ఎక్కడో పరిహారం వుంటుంది. ఈ చిక్కులన్నీ ఇందులో విడదీయబడినై. తైలధారవలె అవ్యాహతంగా రచనా స్రోతస్సు ప్రవహిస్తుంటే చవిటినేలలు, కేదారఖండాలు నల్లని, ఎర్రని, రేగడ భూములు, నిస్సార నిరుపయోగ ప్రదేశాలు సస్యశ్యామలంగా మారి ఫలానుభవంతో ఇహపర సుఖాలు తమంతతామే కోరి వరించి వస్తై. ఈ రచనా విన్యాసం సరికొత్తది. పండిత పామర భేదం లేకుండా స్త్రీ శిశు వివక్షణ లేకుండా అందరికీ రామాయణ కల్పవృక్ష ఫలాలను అందిస్తుంది. ఏ అనుమానం వచ్చినా ఈ రామాయణం ఆ ఘట్టంలో చూసుకుంటే తెలుస్తుంది. ఇంతకు పూర్వం తెలియని ఎన్నో రహస్యాలు వెలికి తీయబడినై. ఉదాహరణకు దశరథుడు ముగ్గురు భార్యలకు పాయసం నాల్గుభాగాలెందుకు చేశాడు? వాలి వధ ఎందుకు ధర్మబద్ధమైంది? తార పతివ్రతగా ఎందుకు ఆరాధ్యురాలయింది? సీతా పరిత్యాగంలో రాముడు అన్యాయం చేశాడా? ఇంకా ఎన్నో ఎన్నో - ఈ బృహత్కార్యం ఎందుకు సంకల్పించామో చదివి చదువరులు సాక్షులు కండి.

—:o:—

స్వామి! భవత్కృపన్, నవమసంపుటమున్ రచియించి భక్తితో
భూమి భవాత్మదేవు పదముల్ స్పృశియింపఁగనుంచినాను శో
భామయసూనపట్టులుగఁ, బావని! ఈదశమాఖ్య సంపుటం
బాపుర పండితా! భవబంధహరంబుగ వ్రాయఁబూనుమా.

# రాక్షస వానరుల రాత్రివేళ యుద్ధం

పరస్పరానుకూల్యం, పరస్పర వైవిధ్యం, పరస్పర విరుద్ధం ప్రకృతికి సహజమైన గుణం. ఆ ఏకైక గుణం ప్రాణికోటి గతికి ప్రాతికూల్యాను కూల్యాలను ప్రసాదిస్తూంటుంది. అందువల్ల స్వభావానుసారంగా ఆ రాత్రి రాక్షసులకు ఫలరాత్రిగానూ, కపులకు కాళరాత్రిగానూ పరిణమించింది. అదను వేచివున్న క్షుద్రవిద్యా కుశలులు, వంచనాజీవులు ఆ వేళను స్వవిజయానికి అవకాశంగా అసురులు గ్రహించారు. స్యందనారూఢులై, శస్త్రాస్త్రపాణులై, త్వరాహంకారులై ఉత్తర దిశను కాస్తున్న రాముని ఉగ్రరూపులై తాకారు. అహంకారాగ్రహాలతో బ్రహ్మాండ కటాహం బ్రద్దలయ్యేటట్లు ఆర్భాటాలు చేస్తూ, ఆపవానగురుస్తూ, ప్రతిరోధిస్తున్న వానర వ్యూహాన్ని ఛేదిస్తూ, అతిక్రమించిరావటం రాముడు చూశాడు. కోదండం సజ్యం చేశాడు. అక్షయతూణీరాన్ని స్పృశించాడు. తమపై పడుతున్నవి బాణాలో, పిడుగులో రాక్షసులకు తెలియటంలేదు. అనుకూల ప్రతికూలంగా వచ్చిన ఆ చీకటి రాత్రి బద్ధవైరులైన రాక్షస వానరులకు యుద్ధ వ్యాపారంలో జయాపజయాలు క్షణ క్షణం సంధిస్తూ, మారుస్తూంది. "ఓరోరి రాక్షసాధమా! పోకుపోకు. ఓరీ కోతిగాడా. రారా. ఈ క్రూరుణ్ణి చంపు. ఆ కూళను విగ్రమింగు. ఓరి పారిపోతూ నిలునిలు. ఓహో! పోపోతే పోనిస్తానా? ఆగు" అన్న వచన ప్రతివచనాలు నమిద్ధాత్రిలో విడువకుండా వినిపిస్తున్నై. నీల శరీర కాంతులతో, మేలిమి పసిడికత్తళాల మెరుపులతో వనౌషధులతో శైలేంద్రం ప్రకాశించినట్లు రాక్షసులు ఆ రాత్రివేళ ప్రకాశించారు. ఆ సాంద్రతమః పటలంలో పలలాశనులు పెచ్చురేగి వానరులను యుద్ధంలో జయించలేక మ్రింగటం సాగించుతుంటే వానరులు శత్రువుల తురంగదంతి సంతానాన్ని

పతాకలనూ, ధ్వజాలను నేలపట్టం చేశారు. శత్రువుల కోలాహలం, మిత్ర సైన్యాల భీతి సంచలనం రామలక్ష్మణులు గుర్తించారు "నిశా సమయం రాత్రించరులకు అనుకూల కాలం. తెల్లవారేలోపల రక్కసులు వానర సైన్యాన్ని మిగులకుండా ఒలిగొంటారు. ఉదాసీనత వహిస్తే చేసిన ప్రయత్నం వ్యర్థమవుతుంది. దశరథ రక్షిత సైన్యం ఓడితే అపకీర్తి వచ్చేది మనకు. సేనాపతులూ, సైన్యం భయంకరమైన పోరాటంలో నిమగ్నం కావటంచేత, విశ్రాంతి పొందిన మనం విశ్రాంతి కల్పించాలి" అని సోదరులు భావించారు. కోదండ గుణటంకారం లంకా నగరంలో ప్రతిధ్వనిస్తూంది. అర్ధరాత్రి వేళకు అసురుల ఆట కట్టబడింది. ధనువునుంచి వచ్చే మార్గణం ఒక్కటే. అది అభిమంత్రితమై ప్రయోగింపబడటంతో పదులు, వందలు, వేలుగా రూపాలు ధరించి ఎటునుంచి వస్తున్నాయో, ఎవరు ప్రయోగిస్తున్నారో తెలుసుకునే వ్యవధి లేకుండా రావణ సైన్యం ముప్పాతిక భాగం హతమైంది. తరిగిన రక్ష సైన్యం క్షణాలమీద చంద్ర దర్శనానికి సాగరంవలె పెరిగి పొంగి రామలక్ష్మణ దిశగా ముంచుకుని వస్తూంది. అరథనేమిధ్వానాలకు, ఆహయఖుర ఘట్టనాలకు, పదాతిసైన్య పదఘాతాలకు రేగిన ధూళి ఇరువాగుల వారిని బధిరులనూ, అంధులనూ చేసింది. పణవ శంఖ భేరీ కాహళనాదాలు అధికం కాసాగినై. "ఆ రాత్రి ఆహవానికి అంతం కల్పిస్తుందా?" అన్నట్టుగా రెండువర్గాలు తమ ప్రభువులకు విజయం కల్పించాలని తెగించి పోరాడినై. ఆయోధుల శరీరంనుంచీ, హయగజ మకర గార్దభాది వాహనాల నుంచీ వస్తున్న రక్తం వరదలుకట్టి ప్రవహిస్తూంది. పరస్పర ముష్టి ఘాతాలకు, బాణవృష్టి పర్వత పాతాలకు ప్రాణాలువిడిచే వానర రాక్షసుల ఆక్రందనం దెసలాక్రమించి, కర్ణ కఠోరం కావిస్తూంది. ఆ సమిద్రాత్రి కాళరాత్రి సమర్పించిన శరసూనోత్కరంతోను, శోణిత మాంస పంకంతోను, చొరరాక, తెలియరాక మరుగు పడింది.

## శ్రీరాముడు రాక్షసవీరుల చంపుట

రామలక్ష్మణులు తెరిపిలేని అంపవానతో అసురులను హతం చేస్తున్నారు. రాత్రికి రాత్రే రామలక్ష్మణులను చంపకపోతే వేగునంతకు

ఆశర సైన్యం ముచ్చుకైనా కనుపించదని పేరు వాడిగల మహాసేనానులు భావించారు. అన్ని దిక్కులలో ఉన్నవారంతా ఏకమై రాముని తాకారు. ఆ రాక్షసవీరులు కారుచిచ్చు కాననాన్ని ఆవరించినట్లు రాముడున్న దిక్కును క్రమ్ముకున్నారు. ఆ ఉరవడి, ఆ ఆర్భాటాలు, ఆ అట్టహాసాలు ప్రళయవేళ పారావారాలు ఘూర్ణిల్లుతూ తీరాతిక్రమణం చేస్తున్న చందంగా పొల్చినై. ఆ రాక్షసుల రాకచూచి, లలిత సుందర మనోహరాలైన నేత్రాలు అగ్నిగోళాలైనై. సుప్రసన్న మందహాస ముఖారవిందం మధ్యందిన మార్తాండబింబం అయింది కోదండం కాలదండం అయింది. చాపం చంద్రమండలాకృతిగా పరిభ్రమిస్తుంటే, జ్యాటంకారం కర్ణపుటీ ప్రవిదారణం కావిస్తుంది. శరసంతానం ఆశరసంతాన ప్రాణానిల భుజంగ సంతానంగా రూపు దిద్దుకుంది. రాముని శరలక్ష్యం శత్రు వక్షస్థలం. శరలక్ష్యం ఆతని వెన్నంటి వరుస క్రమంగావున్న రాక్షసుల గుండెల్లో దూరి దండ గ్రుచ్చటం. త్రుటికాలంలో కొండలవలె వచ్చిన రక్కసులదండు మంచుఖండాలవలె మాయమైంది. ఎన్నివిధాల ఎదిరించినా, ఎన్ని వ్యూహాలు పన్నినా, ఆ సమయం పగలుకాక రాత్రియైనా, రాముడు దుష్టదైత్య విరాముడూ, అజేయ భుజవిక్రమధాముడూ, దానవ ద్వైరి భీముడూ కావటం సేనాపతులకు తల నరికినట్లై సిగ్గు కలిగింది. చివరి ఎత్తుగా రామునిపై సకలసేనా నాయక సమాహార సంకుల సమర వ్యూహం ప్రయోగించారు. స్తంభాల అడవలె రాముణ్ణి మధ్యలో సోదర యుక్తంగా నిల్పారు. చుట్టూ తమతమ వరూధినితో ముట్టారు. జగత్ప్రళయ వేగా పరస్పర ముహుర్ముహుస్సంఘట్టిత పయోదాలు పిడుగుల వర్షించినట్లు రక్షోవీర సేనానులు శరపాతం చేశారు. మానవద్వయం దానవ సముద్రంలో బిందువులుగా కనుపించినై. ఆ సమయంలో దేవతలు రాముడు చేసే ప్రతిక్రియ దర్శింపవచ్చి విమానాల్లో ఆకాశంలో నిల్చారు. "ఆశ్చర్యం! ఆశ్చర్యం! అహో! ఓహో! రామా! నీకు నీవే సాటి" అని కొందరంటూంటే, "సురపతీ! చూడు. సహస్రాక్షనామం సార్థకం చేసుకో! ఇదివరకు రాముడికి రెండు కళ్ళే అనుకున్నాం. ఇప్పుడు ఎన్ని కళ్ళున్నవో తెలియటంలేదు. చేతికి, శరానికి, చాపానికి, తలచుట్టూ వున్నట్లున్నై.

కాకపోతే ముందున్న వాళ్ళపై బాణాలు వేస్తుంటే వెనుకవాళ్ళూ పక్క-
వాళ్ళూ చస్తున్నారెందుకు? దుర్ధర్షులూ, అమితబలులూ అయిన మహోదర,
మహాపార్శ్వ, మహాకాయ, వజ్రదంష్ట్ర శుకసారణులు పలాయనం చిత్త-
గిస్తున్నారెందుకు? పాపం! చావు కబురు చల్లగా రావణునికి మనవి
చేసుకోబోతున్నారేమో? ఆ చీకటి రాత్రిలో రామవిశిఖాలు స్వనామాంకి-
తాలై అమావాస్యనాడు తారకల్లాగా అసురపక్షాన్ని లక్షిస్తున్నై" అంటూ
మరికొందరు ప్రస్తుతించారు. "మీరు చెప్పింది ముమ్మాటికి నిజమే.
అయినా, మీరిది గుర్తించలేదు. రామధనుర్ముక్త మార్గణం ఎదురునిలిస్తే
చంపుతూంది. వాడే వెన్నిస్తే వదులుతూంది. ఈ లాఘవం ఇంతవరకు
ఎక్కడా, ఎవరివద్దా చూడలేదు. మనకూ తెలియదు. మరి ఎక్కడ
నేర్చాడో?" అని శ్లాఘించినవారు శేషప్రశ్న వేశారు. దాశరథులు ధను-
ర్విద్యా శరధులై, కాంచన పుంఖవిరాజితకాండ సహస్రాలు ప్రయోగిస్తే
ఏ ఒకటీ వ్యర్థం కాలేదు. పైగా గుండెలదిరే ఆ ఘోరయామినిలో మిణు-
గురులై కపులకు తమవారెవరో, పెరవారెవరో గుర్తించే అవకాశం
కూర్చినై. చీకటితో సరితూగే శరీరకాంతులతో ఒప్పారుతున్న
కొండముచ్చులు రొదతో త్రికూటం పేరుగల కొండ నింపిస్తూ, రక్క-
సుల పిండును వంచకుండా కడుపు నింపించుకుంటున్నై. ముఖాముఖి
యుద్ధంలో శాఖాచరుల ధాటికి నిశాచరులు నిలువలేకపోతున్నారు. ప్రగ-
ల్భాలుపలికిన సేనాపతుల జాడ తెలియటంలేదు.

## ఇంద్రజిత్తు అంగదునిచే ఓడి మాయా యుద్ధం చేయుట

సమరగతి సకల ధనుర్విద్యాపారజ్ఞుడైన ఇంద్రజిత్తు వీక్షించాడు.
తానిక సమరంలోకి దిగకపోతే సర్వ రాక్షస సంహారం జరిగితీరుతుందని
భావించాడు. పడమర దిశపై కన్నువేసి ఉభయ సైన్యాల పోరాటం
చూస్తున్నవాడల్లా ఉత్తర దిక్కునకు హుటాహుటి రథంతోలిస్తున్నాడు.
అంగదుడు అది చూచాడు. రావణి మనోగతం రాముని పరిమార్చటం
అనే భావాన్ని గుర్తించాడు. చేరకుండా చేయటం తన ధర్మమని
తలచాడు. తన సైన్యంతో ఎదురు దాడి చేశాడు. ఆ దాడిలో ప్లవగుల

ఏటు, రాక్షసుల పాటు, రామ లక్ష్మణుల పోటు రావణికి బ్రహ్మరంధ్రం
పగిలినంత పనైంది. వెంటనే చాపం సజ్యంచేసి వానరానీకాన్ని ముందుకు
రాకుండా వారించి ఘోర మారణాస్త్రాలను కురిశాడు. ఆ శస్త్రాహతికి
అంగదుని సైన్యం అల్లాడిపోయింది. అంగదుడు తన సైన్యం పడుతున్న
బాధ చూచి భరించలేక ప్రళయకాల రుద్రుడై ఇంద్రజిత్ రథంపైకి దూకి
గుర్రాలను కూల్చి సారథిని చంపాడు. చెంపపై ఛెళ్ళున చరిచాడు.
మెడబట్టి నేలపడ నెట్టాడు. ఆ పాటుకు రావణి అవనిపై పడినట్లయితే
అంగదుడు వాడి జీవిత కావ్యానికి చరమ శ్లోకం రచించేవాడే. ఆ సంగతి
గ్రహించిన అసుర వంశ భూషణుడు మధ్యలోనే అదృశ్యుడైనాడు.
అంతరిక్షచరులై వీక్షిస్తున్న దేవతలు అంగదుణ్ణి అనేక విధాల స్తుతిం
చారు. "మేఘనాదుడు చాపం పట్టినది మొదలు ఇంతవరకు రథహీనుణ్ణిచేసి
నేలకు నెట్టిన వీరుడు అంగదుడు ఒకడే"యని అభినందించారు. "ధీరుడూ,
మాయా యుద్ధ విశారదుడూ, ప్రధన కర్కశుడూ, అజేయుడూ" అని పేరు
గాంచిన రావణిని "ఎక్కటి యుద్ధంలో జయించిన తారేయుడు ధన్యు"
డని లోకం పొగడింది. రామలక్ష్మణులు మెచ్చారు. రవిపుత్రుడు
మేలన్నాడు విభీషణుడు పలువిధాల ప్రతిభను వింగడించాడు. అదృశ్యు
డైన అసురేశ్వర సూతి ప్రతిపక్షమెంతటి బలవంతులో తెలుసుకున్నాడు.
దివ్య శక్తులుకల దేవతలనే పరాభూతులను చేసిన తన్ను వానరుడు రథ్య
సారథుల చంపి, చెంపను చపేటంతో నొప్పించినందుకు సిగ్గుపడ్డాడు.
వైరుల నిగ్రహించాలంటే మాయ తప్ప మరొక మార్గంలేదని దృఢ నిర్ణ
యానికి వచ్చాడు. వెంటనే శాంబరిని ఆహ్వానించాడు. అవిచ్ఛిన్నంగా
శరాసారం అంగదుని సైన్యాన్ని ముంచివేసింది. మాయ తెలియని
మర్కట వీరులు గుట్టలు గుట్టలుగా కూలసాగారు. ప్రతిరోధించటానికి
ప్రతిపక్షి అనంతపథంలో ఎక్కడ వున్నాడో తెలియక అన్ని వైపుల
నించి అస్త్రాలు వచ్చి తాకుతుంటే వానరులు నిశ్చేష్టులై నిలిచారు.
అప్పుడు తన వారు పడుతున్న దైన్యావస్థ చూచి రాముడు విచారపడ్డాడు.
"ఓ కపిశ్రేష్ఠులారా! ఇది మనకు వేళకాదు. సుగ్రీవుని చుట్టి సురక్షితులై
జాగ్రద్దశలో వుండండి. వీడు నను యుద్ధంలో మనచే పరాభవంపాలై
మాయను ఆశ్రయించాడు. వీడు మాయా విద్యలో త్రిభువనాలను సైతం

దిక్కులేకుండా చేస్తాడు. నేనాతని అకర్షించి నిరించగలను. కాని, బ్రహ్మ ఇచ్చిన వరాన్ని పాటించవలసి వచ్చింది. ఆ మాయకు కూడా కొంత సమయం వుంది. ఆపైన అతడేమి చేయలేడు. అంతవరకు అస్త్ర పంజరం నిర్మిస్తాను. అది కొంతకాలం మనను కాపాడుతుంది" అని ఊరట పల్కి రాముడు బాణాలతో అంతరిక్షంలో పంజరం నిర్మించాడు. అసురపతి పుత్రుడు అవిచ్ఛిన్నంగా సాగిపోతున్న శరాలు శరపంజరాన్ని తాకి తుత్తునియలై పోవటం చూచాడు. "రాముడు దివ్యజాతికి చెందిన వాడైతే ఇంతకాలం అసుర శక్తిని ఆగలేడు. మానవుడైతే ఈపాటికి మడిసివుండేవాడు. నా మాయా యుద్ధానికి ప్రతిఘటనలేదని బ్రహ్మ వరం ప్రసాదించాడు. అందుకు ప్రతిహతంగా అస్త్ర పంజరం నిర్మించి నిరోధించాడు. ఇక రామలక్ష్మణులను బ్రదుకనీయరాదు. బ్రహ్మ వర బలం ముందు నిలుస్తుందో నిల్వదో పరీక్షిస్తాను" అని బ్రహ్మను స్తుతించి ప్రకంపన బాణాన్ని ప్రయోగించాడు. ఆ శరం ప్రచండవాతాన్ని సృష్టి చేసింది. ఆ వేగానికి బాణ పంజరం నామరూపాలు లేకుండా పోయింది. బాణాలకు బదులు పిడుగులుపడ్డై అవరోధంలేని అంబు వానకు అగచరకోటి వణికిచెడి తూలి వ్రాలి సోలిపోయింది. తన జాడగానీ, రూపుగానీ తెలియబడకుండా రామలక్ష్మణుల నాగాస్త్రంతో శరీరాలను విద్ధం చేశాడు. శక్తి సంపన్నులై కూడా వానర దాశరథులు చేకాలాడక నిల్చిన చోటనే నిల్చారు.

## రావణి రామలక్ష్మణుల నాగపాశ బద్ధుల చేయుట

ఉన్నచోటు తెలియకుండా, కంటికి కనపించకుండా, సర్వంతాసగా ప్రవర్తిస్తున్న ఇంద్రజిని వెదికే నిమిత్తం రాముడు నీలుణ్ణి, సుషేణ పుత్రుల్ని, శరభఋష సానుప్రస్థ వినత ఋషభస్కంధుల్ని పంపాడు. వారు వృక్ష శైలాలు ధరించి అంబరానికి ఎగిరి అంతటా పరిశోధించ సాగారు. వాళ్ళు తన్ను చూస్తే చంపుతారనే భయంతో రావణి పక్షులన్న పాపటంబులను పరపి ఆర్చాడు ఆ కొండాలు రివ్వుమనే మ్రోతే బన రూపంగా భ్రమ కల్పిస్తూ వానరవీరుల గమనాన్ని నిరోధించినై. కాని, దట్టంగా అలముకున్న ఆ గదపలు భాస్కర బింబాన్ని కనుపడకుండా

చేసినట్లు మాయ ఇంద్రజిని పదును పరిచింది. "ఇంత తీవ్రంగా శాతశర
పన్నగాలతో బాధించినా రామలక్ష్మణులు నిశ్చలులైనారే కాని నిగ్గలేదు.
తెప్పరిల్లితే దైత్య వంశం దగ్ధం కాకుండా నేను కాని, నా తండ్రి కాని
కాపాడలేం. ఈ స్థితిలోనే వీళ్ళను యమపురికంపాలి" అని తలచి
సర్వాంగీణంగా శరవిద్ధుల చేశాడు. ఆ చటుల శరఘాత జనితాస్ర రస
సిక్త దేహులైన సోదరులు పూచిన కింశుక వృక్షాలను పోలి వున్నారు.
కదలిక లేక నిల్చివున్న భ్రాతలగని విజయ మదం కన్నులు కప్పగా
"ఓ అల్ప మానవులారా! మీరా నన్ను మార్కొనేవారులు? యుద్ధ
రంగంలో నేను మాయను ఆశ్రయిస్తే, ఇంద్రాదులకే సమీ
పింప దిక్కులేదు అంటే నన్ను చూడటం అసాధ్యమని వేరే
చెప్పాలా? ఇక మరణకాలం మీకు దూరంలో లేదు. ఇప్పుడే మీ ఇద్ద
రినీ అస్త్రాలకు బలి ఇస్తాను" అంటూ రోషభీషణ భాషణాలను పల్కి
జ్యాభీషణ ఘోషణంగా శత్రువులు బెగ్గడిల్లగా, వైరివిస్మయ ప్రేషణ
శోషణాహిశరబృందాన్ని ఎడతెరిపి లేకుండా ఏసి, ఖరదూషణ ద్వేషణ
భూషణులైన రామలక్ష్మణుల బద్ధుల చేశాడు. ఆ బాణాలు వారి శరీరాల్లో
వ్రేలెడు ఎడం కూడా లేకుండా నాటటంతో ఆ బాధకు చలించిపోయారు.
బిగించిన ముడి సడలి కూలే ఇంద్ర ధ్వజంలాగా కంపిస్తూ, ధృతితూలి,
కన్నులు తెరిపిన్ను పడక, విడవకుండా వచ్చి పైన పడుతున్న శరాలకు
తాళలేక కర్శితులై, గాయాల్లోనుంచి బుదబుదమంటూ స్రవిస్తున్న
రక్త పంకంలో బ్రుంగి, కలంగి, నలంగి శిలలో మల్చిన విగ్రహాలవలె
సోదరులు చేష్టా రహితులై నిల్చారు. ఆ అనుజన్ములు ఆపాద శిరః
పర్యంతం, అంగుళాలు సహితం, అబాధితం, అప్రదారితం, అనిలాశన
శరనికరాబద్ధం కాకుండా వుండక పోవటంతో ఆకారమాత్ర విభవులై
గోచరించారు. అప్పటికీ తృప్తిపడని ఆ శరనాయక రత్నం వత్సదంత
భల్లాంజలిక్షుర సింహదంష్ట్రికాది శిలీముఖాలను పరపి చిత్రహింసచేశాడు.
అంతకంతకు అధికం అవుతున్న వ్రణ బాధకు సింహబలుడైన రాముడు
త్రిణతమై (మూడుగా వంగి) విజ్యమై (నారిసడలి) రత్నాలంకృతమై,
శత్రు పీడనకరమైన చాపం, కేలు జారుచుండగా నేల శయనించాడు.
అన్న వీరశయనం అలంకరించగానే తమ్ముడు జీవితాశ వదలి శర

శయనం చేశాడు సూర్యచంద్రులులేని ఆకసంలాగా ఆహవ రంగం కళావిహీనమైంది. కపిముఖ్యుల గుండెల్లో బండలు పరుగులెత్తినై.

## సుగ్రీవాదులు నాగపాశబద్ధులై పడివున్న సోదరుల చూడవచ్చుట

వీరమూర్తులైన కపిలోకం వింజమాకిటినట్లయింది. ఈ వార్త విన్న సుగ్రీవాదులు ఇంద్రజి బాణవర్షం వెలిసిపోతున్నట్లు తోచటంచేత రణరంగం వీడి రాముని దర్శనార్థం భీతితో పరుగుతీశారు. దశరథుల చుట్టూ కపులు దీనాననులై, అశ్రుపూరిత నేత్రులై, అవనత శిరస్కులై మహార్థం కోల్పోయిన మందభాగ్యులవలె రోదనంచేస్తూ, ఆ మహా మూర్తుల శరీరాలవంక చూస్తూ నిలుచున్నారు రవిపుత్ర విభీషణులు వచ్చి రావటంతోనే, క్రిందికి మీదికి చూస్తూ, పరిక్షతగాత్రులై నేలపయి పండియున్న నరకేసరుల కాంచి దుఃఖిస్తున్నారు కాని శబ్దం వెలికిరాలేదు. కన్నులు ఎరుపెక్కుతున్నై కాని నీటి బిందువులు రాలటంలేదు మైంద ద్వివిదాంగద కుముద హనుమజ్జాంబవంతాదులు పటరాని శోకంలోనే పగవాడైన రావణికోసం అంతరిక్షమంతా అవలోకించారు. కాని, వాడి అడ పొడ ఎక్కడా గోచరించలేదు. రక్తం జాలువారి ఎర్రగా జాజు కట్టిన మేనులతో, గాజువారిన మోములతో, కరచరణాలు కదలించే శక్తి లేని స్థితితో, ఆగి ఆగి వచ్చే నిట్టూర్పులతో, సందులేని శరఘాతాలతో, సర్పాలవంటి పూత్కారాలతో, బాణాలు పరచిన పడకలతో, హేమ ధ్వజాల వంటి దేహాలతో, మందవిక్రములై, వీరశయన శయానులై పండియున్న వీరద్వయాన్ని చూచి విశ్వం విస్తుపోయింది. ధర్మధేనువు ఎత్తు పడింది. సత్యం సంచలించింది. ప్లవగుల అన్వేషణ వ్యర్థమైంది. ఆ అనంత వానరానీకంలో అదృశ్యుడై యుద్ధం చేస్తున్న అసురపతి సుతుణ్ణి మాయా వేదియైన విభీషణుడు ఒక్కడు మాత్రమే చూచాడు.

## రామలక్ష్మణులు మరణించారని రావణి రాక్షసులకు చెప్పుట

జనకుని ఆనందం కోసం శక్రజిత్తు పౌరుషాభిమానాలు వదలి మాయ తెలియని నరనాథులను నాగపాశబద్ధుల చేసి, శరతల్పగులై పడి

యున్న స్థితిచూచి పొంగి, తనవారికి ఉబ్బు కల్పించటంకోసం దర్పంతో కంఠశ్రుతి హెచ్చించి, "రక్షోవీరులారా! ఎవరు ఖరుని నామైక శేషుణ్ణిగా చేశారో, ఎవరు దూషణుని క్రొవ్వు కరగించారో, ఎవరి చింతతో నా తండ్రికి పాన్పుపై పవళించికూడ నిద్రపట్టక మూడుజాములు గడచినవో, ఎవరు ఋక్ష వానర సైన్యంతో కదలి బంధించి లంకను ఉగ్గపట్టారో, ఎవరి దోశ్శక్తికి లంకంతా వానకాలంలో వాహినులలాగా కలగుండు పడిందో, అట్టి పేరు ప్రఖ్యాతులుగల రామలక్ష్మణులు నాచేత నాగపాశ బద్ధులై మరణించారు. నా ప్రయుక్త నాగబంధాలను విప్పనాకవాసులకైన సాధ్యంకాదు. తక్కినవాళ్ళ మాట తలచటం అనవసరం. ఇంతవరకు ఈ రాముడు, ఈ లక్ష్మణుడు, ఈ వానరసేన చూపించిన మగతనం, చేసిన అద్భుత కృత్యం శారద దినాల్లో మేఘజాలంవలె ఈ రాత్రే నిష్ఫలం అయిపోయింది. ఇక నన్నెదుర్కొనే వాడికోతుల్లో లేడు. ఒక వేళ ఉన్నా నా ఉనికి వాళ్ళకు తెలియదు విజయం మనదే" అని మేఘ నాదంవలె ఘోషించాడు. ఆ వాక్యాలకు అసురులు పోతున్న ప్రాణాలు పుంజుకున్నారు.

## ఇంద్రజిత్తు వానరవీరుల బాధించుట

"చమూపతులారా! విశ్రాంతి పొందండి. ఇంతవరకు మనల బాధించిన మర్కటాధముల మదం దించుతాను. ఇప్పుడు నా ప్రతాపం చూడండి నా వరబలమేమిటో, నాకదన పాండిత్యం ఎట్టిదో తెలిసిన పిరికివాడైన పినతండ్రి నన్నెదుర్కొడు. సుగ్రీవాంగద హనుమ జాంబ వంతులు ఎక్కటి యుద్ధంలో బలవంతులుకాని, మాయా యుద్ధంలో నా దరికి రాలేరు. ధనుర్విద్యలో నన్ను మించిన దశరథులు మాయానాగాస్త్ర బంధితులై పడియున్నారు. ఈ ఇంద్రజికి ఇక ఎదురు లేదు. చూడండి" అంటూ శక్రజిత్తు నీలుణ్ణి నాల్గు నారసాలతో, మైందద్వివిదుల మార్గణ త్రయంతో, జాంబవంతుని దారుణాస్త్రంతో వక్షాలు పగిలేట్లు కొట్టి, హనుమపై పేరుకు ఒక బాణం వేసి దాటి, శరభ గవాక్షాంగదుల వెంట, మూట, అయిదింట పరాఘాతులచేసి సింహనాదం చేశాడు. అగ్నిశిఖలవంటి అంపకోలల్తో అగచరుల దేహాలను తూట్లు కొట్టాడు విజయశంఖం

పూరించాడు. రాక్షసులందర్నీ, నిద్రా ముద్రిత ప్రాణిలోకంవలె నిశ్చేత నంగా పడివున్న వానర సేనలను, వాళ్ళ మధ్య స్మృతి హీనులుగా పడివున్న రామలక్ష్మణులనూ చూపించాడు. "ఇప్పుడైనా మీకు విశ్వాసం కల్గిందా ?" అని ప్రశ్నించాడు. రాత్రించరులు ఆ భీకర దృశ్యం వీక్షించి దాశరథులు నిజంగా మరణించారని నమ్మి మేఘనాదుని అనేక విధాల స్తుతించారు. పూజించారు.

## విభీషణుడు సుగ్రీవునకు ధైర్యం చెప్పుట

శాత్రవలోక సంతాప ప్రసాదకుడైన శక్ర వైరి పరివారం బలసి కొలువగా లంకాపురికి వెళ్ళాడు. సింహ పరాక్రములైన దాశరథులు చేష్ట లుడిగి శరశయనగతులై, ముకుళితనేత్రులై పండియుండటం చూస్తున్న ప్లవగులకు గుండెలు నీరైనై. సుగ్రీవుడు రాముని ప్రక్క నిల్చి సుహృత్తులకు సంభవించిన ప్రమాదానికి శోక సాగరంలో మునిగిపో తున్నాడు. ఓదార్చేవారే లేరు. అంతా అయోమయావస్థలో పడివున్నారు. మరీ సుగ్రీవుడు మనోవ్యథతో, విన్నదనంతో నిలువరించుకోలేక కూల బడ్డాడు. విభీషణుడు మిత్రుని పాటు చూచి, బెంబేలుపడి, అంతలో ధైర్యం తెచ్చుకుని "మిత్రుడా ! మహాబలవంతుడవైన నీవు ప్రాకృతుని చందంగా శోకించటం తగదు. అపార వానర వరూధినిని నడిపించే నాథు డెవ్వడు ? నీవే అధైర్యపడితే మాకేది దిక్కు ? యుద్ధాలంటే ఇలాగే వుంటై. ఎంతవారైనా ఎవరికి వారు తమకే విజయం తథ్యమని తలచటం తప్పు. నీవు తేరి గతిమాలిన మమ్మల్ని తేర్చు. మనకు భాగ్యశేషం మిగిలివుంటే, మానవోత్తములు, మహాత్ములైన దాశరథులు మూర్ఛ నుంచి తేరుకుంటారు. సత్య ధర్మ స్వరూపులకెప్పుడు అపమృత్యు భయంలేదు. తప్పక స్పృహ వస్తుంది. దాశరథులచే దానవ సంహారం జరిగి తీరుతుంది" అని మంత్రాంగనిదుడైన విభీషణుడు మంత్రితాంబు వులతో మర్కటపతి నేత్రాలను మార్జనంచేసి తుడిచాడు. పిమ్మట కాల గత వాక్య సంతానంతో తొట్రుపాటు తొలగిస్తూ, "ఈ సమయం మనకు భీతి చెందవలసింది కాదు. అంచులో నీకు అనలేకాదు. అతి స్నేహం అపాయాన్ని శంకించటం జరుగుతుంది. కష్టకాలంలోనే మానవుని మాన

వత్వం బయట పడుతుంది. అధైర్యం సర్వానర్థాలకు సోపానం. దాశరథులే దిక్కని నమ్ముకొన్న వానరుల సంగతి విచారించు. వదలి పోలేకపోతే స్పృహ వచ్చేవరకు కాచుకుని వుండు. భ్రాతలు లబ్ధసంజ్ఞులైతే మన కష్టాలన్నీ గట్టెక్కుతై. నాగపాశ బంధాలు సోదరులకు ఎట్టి ప్రాణోపద్రవం కలిగించలేవు. ఇది సత్యం. మరణభీతి మాత్రం వద్దు. మరణించేవారి వదనాల్లో ఇంత మహాద్భుత తేజం సచైతన్యంగా వుండదు. ఇప్పుడు జరుగవలసిన పనులన్నీ నేను ముగించేదాకా కీశ సైన్యాన్ని ప్రోత్సహించు వారంతా నావంక కళ్ళు పెద్ద చేసుకుని చూస్తూ ఒకరి చెవిలో ఒకరు గుసగుసలుపోతున్నారు. వాళ్ళ వైఖరిచూస్తే పారిపోయేట్లున్నారు. భుక్త పూర్వ స్రజం (ధరించేముందున్న పూమాల) మరె సహజ శోభావంతంగా చేయి. భయాన్ని పోగొట్టు" అని మిత్రుణ్ణి ఊరడించి, కపులకు ఊటవు కలిగే పలుకులు విభీషణుడు పలికి కార్యాంతర విమగ్నమానసుడైనాడు.

## దాశరథుల నాగపాశబద్ధులచేసి చంపానని తండ్రితో ఇంద్రజిత్తు చెప్పుట

ఇక్కడ రామస్కంధావారం ఉత్సాహ శూన్యంగా వుంటే రాక్షస స్కంధావారం అక్కడ విజయధ్వానాలు చేస్తూ ఇంద్రజిత్తును లంకకు కొనిపోయింది. నగర ప్రవేశం కాగానే పరివారాన్ని బయటనిల్పి రావణి తండ్రి దర్శనార్థం వెళ్ళాడు. అంతవరకు యుద్ధవార్తలలో వానరులదే పై చేయిగా వుంటున్నదని విని విచారిస్తున్న అసురేశ్వరుడు విజయ నాదాలతో పురికి రావటం, వచ్చిన వెంటనే తన దర్శనం కోరి తనయుడు రావటం దప్పిగొన్నవానికి అమృతం లభించినంత ఆనందం పొందాడు. పీఠం పైనుంచి క్రిందికి దూకి ఎదురుగాపోయి బిగ్గ కౌగిలించుకున్నాడు. "తండ్రీ! నీవిక నిర్భయంగా వాంఛాపూర్తికయి ప్రయత్నించవచ్చు. నీ శత్రువులైన రామలక్ష్మణులు మాయా యుద్ధంలో నాచేత నాగపాశ బంధితులై చచ్చి వీరశయనం అలంకరించారు" అని చెప్పిన ఆత్మజుని

తనివార ముద్దుగొన్నాడు. మూర్ధాఘ్రాణం చేశాడు. మాటిమాటికి "మేలు మేలు, బళిబళి" అని మెచ్చుకున్నాడు. సరసన కూచోబెట్టుకున్నాడు. సమరంలో రామలక్ష్మణుల జయించిన విధం సమగ్రంగా చెప్పమన్నాడు. తండ్రి కోరిన ప్రకారం, తమ పక్షం ప్రత్యక్ష యుద్ధంలో పరాజయం పొందటం, అంగదునిచేతా నవమానపడటం తెలిపి, "మాయారణంలో మర్కటుల మర్మాంగాలు ఛేదించి, రామలక్ష్మణుల సర్వాంగాలను నాగ పాశాలతో బంధించి స్మృతి తూలించాననీ, వారిప్పుడు శరతల్పగతులై పడివున్నారనీ, ఆ బంధాలు విప్పటం దేవతలకు కూడ సాధ్యంకాదనీ, ఇప్పటి మూర్ఛ తీర్ఘ మూర్ఛగా మారి మరణించారనీ" ముగించాడు. రావణుడు కొడుకు మాటలనమ్మి రాఘవ జనిత భయం వీడి, ఆత్మజుని అభినందించి పంపాడు. ఆ సంఘటన ఆత్మవాంఛా సిద్ధికి అనుకూలించే మార్గం ఆలోచించసాగాడు.

## ఆంజనేయాదులు రామలక్ష్మణుల కాచి వుండుట

నిశా యుద్ధంలో విజయం గ్రహించి ఇంద్రజి పోగానే వానర వీరులు క్రమ క్రమంగా తేరుకొన్నారు. హనుమదంగద నీలగవాక్ష గవయగజ సుషేణ కుముదనల వృధురంభ శతవలి శరభగంధ మాదనులు, ఋషభ స్కంధుడు రామలక్ష్మణులచేరి నిర్నిమేషులై చుట్టూ గస్తీ తిరుగు తున్నారు. వానరులు వృక్ష పర్వతాలు ధరించి గడ్డిపోచ కదలినా రావణి మళ్ళీ వస్తున్నాడేమోయని ఉలుకుతూ, క్రిందా, మీదా, అన్నివైపులా చూస్తూ కావలి కాస్తున్నారు. రాత్రిలో ఎటువంటి మార్పూ రాలేదు.

## సీతకు రామలక్ష్మణుల చూపించుడని రావణుడు రాక్షసాంగనలతో చెప్పుట

పుత్రుడు పోగానే రావణుడు మనోరథసిద్ధికి మార్గం ఆలోచించాడు. తన కొడుకుల్లో ఒకనిని పంపి సీతను కాపాడుతున్న రక్ష స్త్రీలను రప్పించాడు. వారు రాగానే సంతోషంతో "ఓ చారికలారా! మీరు వెంటనే పుష్పక విమానం కొనిపోయి, సీతతో రామలక్ష్మణులు చచ్చి సమర స్థలిలో పడి వున్నారని చెప్పి, ఎక్కించుకుని యుద్ధ ప్రదేశానికి

కొనిపోయి చూపించండి. ఆ తర్వాత ఆమె స్థితి నాకు తెలపండి. ఎవని ప్రాపు చూసుకుని కావరంతో నన్ను గవ్వకు లెక్క కట్టలేదో, కారు కూతలు కూసిందో, ఆ రాముడిప్పుడు రణాంగణంలో ప్రాణాలు వదలి పడి వున్నాడని సీతకు చెప్పండి. పుష్పకం కోసం కొనిపోయి చూపించండి. కళ్ళార భర్త చావు చూస్తుంది. బుద్ధి మార్చుకుంటుంది. నా అంకాన్ని అనుగ్రహిస్తుంది. ఇప్పుడుకదా నా కోరిక తీరే సమయం వచ్చింది. తాను నమ్ముకున్న పతిగతించిన తర్వాత తన గతి ఏమిటో ఆలోచించుకొనక తప్పదు. దానికి అన్య శరణ్యం లేదు. తనంత తానే నన్ను గ్రహిస్తుంది. ఎంతకాలానికి కాలం కలిసి వచ్చింది. ఆలస్యం కాకుండా చెప్పిన కార్యం చేయండి" అని వారిని పంపివేశాడు. వాళ్ళు ప్రభువు ఆజ్ఞ 'తు' 'చ' తప్పకుండా పాలించారు. సీతను విమానం ఎక్కించి చుట్టూ కూర్చుండి పోరికలనికి కొనిపోయారు. అంతరిక్షం నుంచి రామలక్ష్మణులు పడివున్న ప్రదేశం చూపించారు. సీత త్రిజటతో కలిసి బలిముఖ సైన్యం విలయం పొందివుండటం వీక్షించింది. ఇటు సీతను మరణశయ్యపై వున్న మనోహరుని, మరదిని చూడపంపి, అటు లంకలో రణరంగంలో శత్రువులైన రామలక్ష్మణులు మరణించారని, ఇంద్రజి విజయార్థం ఉత్సవం చేయాలని, హర్మ్యాలపై ధ్వజాలు ఎత్తి పతాకలు ఎగురవేయాలని, రావణుడు కార్యకారణ సంబంధాలు పరస్పర పరిపోషకంగా వుండేలాగున చాటింపు వేయించాడు.

## సీత విమానంనుంచి రామలక్ష్మణులను చూచుట

లంకలో అంతకంతకు చరమస్థాయిని అందుకుంటున్న రక్కసుల పొంగూ, క్షణం క్షణం క్షీణిస్తున్న కాకుత్స్థ పార్శ్వగుల క్రుంగూ, శర తల్పగులై పడివున్న రామలక్ష్మణుల ఒదిరంగూ సీతను చేష్టారహితను చేసినై. వ్రాలినవదనం, రుచులు వాడిన రూపం, చీలిన వర్మం, తెగిన జీవిత మర్మం, తూలుతున్న ఊర్పులు, తేలిపోయిన నేర్పులు, వదనంలో వచ్చే మార్పులు, హితులు కూర్చే కూర్పులు, ధూళి గ్రుంగిన కాయం, గమ్యంచేరని ధ్యేయం, అంతా అయోమయం, అంధకార

బంధురంగా వున్న భ్రాతల స్థితి చూసి సీత బావురుమన్నది. ఎంతటివారు ఎంతైనారని ఏడ్చింది. "ఇది నిజమా? స్వప్నమా? ఈ పడివున్నది నా నాథుడూ, నా మరదేనా? నన్ను వెరిపించటానికి రావణుడు పూర్వంవలె పన్నిన పన్నాగమా? కాదు. ఇది యథార్థమే. ఇతమిత్థంగా నిర్ణయించ లేని స్థితిలో వున్నవారు, నా పతే. నా మరదే. పంశయంలేదు" అని తర్కిస్తూ, నిర్ణయించలేక తెలివి కోల్పోయింది.

## నాగపాశబద్ధులై పడియున్న రామలక్ష్మణుల కని సీత శోకించుట

అంతలో కొంత తెలివిరాగా, గతాన్ని తలుచుకుని శోకించ సాగింది. "అయ్యో! విధి ఎంత బలీయమైంది? అది అనుసరించినంత వరకే, అనుగ్రహించినంతవరకే అన్నిధర్మాలు, అన్నిశాస్త్రాలు సక్రమ ఫలితాలనిస్తై. ఆగ్రహిస్తే జగత్తే తారుమారవుతుంది. కాకపోతే నా బాల్యంలో నన్ను చూచి నా తండ్రితో "నీ బిడ్డ అదృష్టవంతురాలు. ప్రతీకారభావం ఈమెకు కలదు. కలిగితే దేవతలు వారించలేరు. ప్రతి వీరుడు లేనివాడు పతి అవుతాడు. సుస్థిర కీర్తి కారకులైన సుతులు కల్గు తారు. క్రతు శతనిరతుడూ, సువ్రతీ, సత్రయాగపరుడూ అయిన ప్రభువు నకు పట్టమహిషియై ప్రఖ్యాతి కాంచుతుంది. ఈమె దీర్ఘసుమంగలియై, సతిలోకానికి ఆదర్శ గృహిణి అవుతుంది" అని మతిమంతులు, క్షితి సురులు, దైవజ్ఞులు వినేలాగా జ్యోతిశ్శాస్త్ర విదులు సభలో చెప్పారే, మరి పతి హతుడైనాడే? వారి వాక్కులు అనృతాలెందుకు అవుతై? ఏ కన్యకు పాదాల్లో పద్మశంఖాది శుభచిహ్నాలుంటవో ఆ కన్య సార్వభౌము నికి పత్నియై, పతితోపాటు పట్టాభిషేక మహోత్సవ గౌరవం పొందు తుందని సాముద్రిక శాస్త్రం చెపుతుంది. అవి నాకున్నవే. అవి కూడ నిరర్థకాలెందుకు అవుతై? ఏ అవలక్షణాలుంచే తరుణులు భాగ్యహీనలై విధవాత్వం పొందుతారో అవి ఏవీ నాకు లేవే? మరి నాకీగతి ఎందుకు కలిగింది? చిత్రలేఖనా ప్రవీణులు, శిల్పులు, నన్ను చూచి "నలుపూ, పసం, సన్నం చికురాలు. కనుబొమలు రెండు, కేశాలతో కలిసి లేవు.

రోమహీనం, వర్తుల అయిన జంఘలు. ఎడంలేని పలువరుస. కణతలు, నేత్రాలు, కరచరణాలు, ఊరువు, గుల్ఫాలు, ఉబ్బులు. గుంద్రం, స్నిగ్ధం, సమం నఖాలు. పయోధరాలు పరస్పర క ర్శి తా లు. నాసిక సమోన్నతం. నాభిప్రదేశం మిద్రు. పక్కాలులోతు. పద్మినీ జాతి సర్వలక్షణాలు ఈ బాలికలో భాసిస్తున్నై. ఈమె యోనిజ కాకూడదు. ఈ బాలికలో కళ్యాణ లక్షణాలు కొట్టవచ్చినట్లు కనుపిస్తున్నై. పాణి గ్రహించినవాడు పరమేశ్వరాంశ కలవాడవుతాడు. ప్రాకృత మానవుడు కావటానికి వీలులేదు. రోమాలు అతి మృదువులు. వ్రేళ్ళతో కలసి పాదాలు సమంగా నేలపై ఆనటం భద్రప్రద చిహ్నం. కరపదాలు లలితా రుణాలు. అధరం హాసరేఖా మధురం" అని వారిలో వారు చెప్పు కుంటుంటే విన్నానే? ఈ పెద్దల శాస్త్ర జ్ఞానం ఏమైంది? వాక్శుద్ధి ఏమైంది? నిజంగా పెద్దల వాక్కు పొల్లెప్పుడుకాదు. ఇదంతా విధి వైపరీత్యం. నా అపహరణం జరగటంతో జనస్థానం శోధించి, నా యునికిని సాధించి,అపార జలనిధి రోధించి వచ్చిన నా భర్త, నా మరది అల్పాసురులచే బాధింపబడటం విధి వైపరీత్యం కాక ఏమవుతుంది? వారుణ వాయవ్య పావక బ్రహ్మశిరైంద్రాస్త్రాది దివ్య శర మండలి స్మరణ మాత్ర ప్రసన్నమే. ఎంత మనోజవంగల మగవాడైనా, రణరంగంలో ప్రతిఘటించినా పతి కంటబడి ప్రాణాలతో పారిపోలేదే? ఇప్పటి ఈ దుర్గతి ఏమి? ఇది విధి వైపరీత్యం కాక ఏమవుతుంది? ఈ ఘటన ప్రత్యంగాకాక పరోక్షంగా జరిగి వుంటుంది. రావణునికన్న రావణి మాయా సమరంలో తిరుగులేని వరాలు పొందినవాడట. వాడే మాయ కల్పించి నాకు దిక్కు కల్పించ వచ్చిన భ్రాతల వంచనతో సంహరించి వుంటాడు. నా పతికాని, నా మరదికాని సంగరంలో తెగుట విధి కంత భారం ఏమీకాదు. దైవమే మేలుకూ, కీడుకూ కారణం. ఆ విధిగర్భంలో ఎన్నో యుగాలు, ఎన్నో ప్రళయాలు, ఎన్నో విలయాలు, ఎన్నోకోటాను కోట్ల భూతాలు కలసి పోలేదు? నా భర్తకోసంకాని, మరదికోసంకాని, తలిదండ్రులకోసంకాని, నాకోసంకాని నేనంతగా వగవను. నా అత్త మూడుకాళ్ళ ముదుసలి, భర్తృహీన, సపత్ని సంరక్షిత, ఇప్పుడు పుత్ర హీన, ఆమెకోసం ఏడుస్తున్నాను. "ఎప్పుడు నియమపాలనం పూర్తి

అవుతుంది? ఎప్పుడు సీతారామలక్ష్మణుల చూచి జీవితశేషం ముగిస్తాను"
అని ఎదురు చూచే ఆ మహాసాధ్వి, ఆ మహా తపస్విని కౌసల్యాదేవి గతి
ఏమవుతుంది?" అని జానకి కంటికిమంటికి ఏకధారగా ఏడ్చి విమానంలో
మూర్ఛ పోయింది.

## త్రిజట రామలక్ష్మణులు సజీవులేయని సీతతో చెప్పి ఓదార్చుట

మనో నిగ్రహం కోల్పోయి మైమరచి పడిపోయిన మైథిలికి ఉప
చారంచేసి, త్రిజట "అమ్మా! జానకీ! ఎందుకమ్మా విషయం తెలుసుకో
కుండా ఏడుస్తావు? నీ పతి, నీ మరది సజీవులై వున్నారు. ఇప్పటి స్థితి
మూర్ఛ వంటిది. మాయతో బంధించిన నాగపాశాలు ప్రాణాలు తీయవు.
తీసినంత బాధ కలిగిస్తై. రాత్రి మూడు జాములు గతించి నాల్గవ జాము
సగం నడిచింది. తెల్లవారేలోపల వీరికి స్మృతి వస్తుంది. విన్నా ఓదార్చే
మాటలు కావు. నా మాటలకు నమ్మకమైన కారణాలు నేను కన్నవీ,
పూర్వం విన్నవీ వినిపిస్తాను విను. ముందు బాహ్య లక్షణాలు నీవు
గుర్తించకలవి చెపుతా. దాశరథులు హతులైతే, క్రోధం, ప్రతిహింసా
భావం గోచరించేలాగా వానరవీరులు గోచరించరు. సరంగు మరణిస్తే
ఓడలోని ప్రయాణికులు నిశ్చలంగా వుండగలరా? నీవే చూడు. నీ పతి
సైన్యం క్రమశిక్షణతో, భయరహితమై నీవారిని రక్షిస్తుంది. విభీషణుడు
గదా ధారియై దూరంగాచని అవాంఛనీయ పరిస్థితి రాకుండా ఏకపాదుడై
మాయాదేవిని శాంతి స్తవంతో ఉపాసిస్తున్నాడు. ఇక అభ్యంతర
హేతువు కూడా ఒకటి చూపిస్తాను. మనం వచ్చింది పుష్పక విమానం.
ఇది దివ్యం. అశుభ స్థానానికి పోదు. నిన్ని రణభూమికి ఆతంక రహి
తంగా కొనివచ్చిందంటే నీ వారు శుభులై యున్నారన్నమాట. నీవు
ఇందాక పేర్కొన్న శుభ లక్షణాలన్నీ నీలో వున్న మాట నిజం. ఆ
ఫలితాలను పొందటం అంతకన్నా నిజం. అందుకే ఈ విమానాన్ని
అధిరోహించావు. ఈ దివ్య విమానం నిన్ను భరించికొనివచ్చి నీ మనో
హరునిపై, మరదిపై నీ సతీత్వ వీక్షణాలను ప్రసరింపజేసి అపమృత్యు

వును అపకర్షించే అవకాశం కల్పించింది. ఇది నీ భర్త విజయానికి చిహ్నం. ఇన్ని హేతువులు నా మాటలను మన్నించుతున్నై. ఇక నా మాట విశ్వసించు. సోదరులు జీవించియున్నారు. ఇంతవరకు నేను అబద్ధం ఆడలేదు. ఇక ముందాడను. నీమీద, నీ సాధ్వీత్వం మీద, నీ ఆదర్శ స్త్రీత్వం మీద కలిగిన అభిమానంకొద్దీ చెప్పరాని రహస్యాలు రాజుకు విరుద్ధంగా చెప్పాను. స్నేహితురాలా! బెంగ పెట్టుకోకు. దాశరథులను గెల్వటానికి సురా సురులకైన సాధ్యంకాదు. విగతాసుతవుల నైజద్యుతి నిల్వదు. మూర్ఛలోనున్నా, శరీరం శరపీడనం చేత నలిగినా, దేహకాంతి, ముఖకాంతి, పాదరసంవలె జీవంతో ప్రసరిస్తూంది" అని దేవతా స్త్రీవంటి సీతను ఓదార్చింది. అందుకు సంతసించి సీత, త్రిజటకు అంజలించి "అమ్మా! సూనృతభాషిణివైన నీ వాక్కులు యథాతథంగా జరుగుగాక. మా పునస్సమాగమనానంతరం విన్న నా హృదయంతో పూజిస్తాను. నీ మేలు జన్మజన్మాంతరాల్లో మరచిపోను" అని ప్రీతిపూర్వకంగా పలికింది. వెంటనే విమానం వారిని అశోకవనంలో దించి స్వస్థానానికి వెళ్ళిపోయింది. జానకి భ్రాతల రక్షణానికి గౌరిని ధ్యానిస్తూంది.

## రాముడు మూర్ఛతేరి లక్ష్మణునికై శోకించుట

ఎట్టకేలకు శరతల్పగతుడైన రామునకు స్పృహ వచ్చింది. కీశనాథులందరు తన చుట్టు దీనముఖులై చూస్తూ కాపలా కాయటంచూచాడు. నాగపాశ శక్తివల్ల కదలలేకపోయినా, తన ప్రక్క పడివున్న తమ్ముణ్ణి చూచాడు. తీవ్ర శిత శరాలతో శరీరం తూట్లుపడి నెత్తురు చారికలు కట్టి, పూచిన కింశుక వృక్షాలతో ఒప్పిన మందరనగంలాగా పడివున్న జననుత సౌశీల్యవంతుడైన సౌమిత్రిని తిలకించి, శర వేదనకు మనోవేదన తోడు కాగా, దుస్సహార్తిని నలుగుడుపడి "నాయనా! సౌమిత్రీ! ఆలింగనాలతో, ఆదరణతో, మధుర వాక్కులతో, ప్రియం కూర్చవలసిన నేను నీకు కలిగిన దురవస్థను చూచే దుర్భాగ్యాన్ని పొంది ఇంకా జీవించి వున్నాను. ఎంత పాపిని. అనితరలభ్యమైన నిన్ను వంటి అనుజన్ముని కోల్పోయిన నాకు ఇంకా సీత ఎందుకు? [illegible]గత. ఎందుకు? జీవితం



ఎందుకు ? జీవితం ఎందుకు ? పోరెందుకు? జీరెందుకు? ప్రయత్నిస్తే సీత వంటి స్త్రీ దొరకవచ్చు. కాని క్షమాగుణ సంపన్నుడూ, సచివుడూ, సమరకళావిదుడూ అయిన నీ వంటి తమ్ముడెక్కడ నాకు దొరుకుతాడు? బాణహతిచే నా తమ్ముడే నిర్యాణం పొందితే మిత్రులందరు చూడంగా నా మేను విడుస్తాను. ఇంకా బ్రదికి ఏం ప్రామికోను? నా తల్లి కౌసల్యకు, నీ తల్లి సుమిత్రకు, మన తల్లి కైకేయికి, భరతశత్రుఘ్నులకు నిన్ను వీడిపోయిన నేను ఏం చెప్పి సమాధానపరచగలను? ఎప్పుడు బిడ్డడు అన్నావదినలతో కలసి వస్తాడో అని మొగం కన్నులు చేసుకుని ఎదురు తెన్నులు చూచే నీ తల్లికి, నా వెంట నిన్ను పంపేటప్పుడు మారు మాట చెప్పక నాకప్పగించిన మహాయోగిని అయిన నీ తల్లికి నీ మరణవార్త నా నోటితో ఎలా చెప్పేది? ఆ వార్త విన్న ఆమె లేగను బాసిన ధేనువు లాగా రోదిస్తుంటే చూచి ఎలా భరించేది? అసూర్యంపశ్య, అవతారం కొన్న పుణ్య సంపద, సర్వసౌందర్య పరమావధి, భర్తృప్రణయదూర, మా సుఖానికై తన సుఖమేకాక తన్నే త్యాగం చేసుకున్న మరదలు ఊర్మిళను చూడగలనా? ఓదార్పుమాటలు చెప్పగలనా? వారిద్దరినీ వీక్షిస్తూ, నేను గృహస్థుగా జీవించగలనా? చేయలేను. ఈ మహా పాపకార్యాలు చేయలేను. నిన్ను వదలి బ్రదుకలేను. నాకోసం అన్ని సుఖాలు పరిత్యజించి అడవికి వచ్చిందేకాక అసువులుకూడ కోల్పోయిన నీకు చూపే కృతజ్ఞత నాకింకేం మిగిలింది? నీ శయ్య పరుండి నీ ఆత్మలో నా ఆత్మ లీనం చేసి దేహత్యాగం చేయటమొక్కటే. అది ఇప్పుడే చేస్తాను. తమ్ముని కాపాడుకోలేని నేను కూడ ఒక వీరుడనేనా? ఛీ. నా బ్రదుకెంత వ్యర్థమైంది? జానకికై విలపిస్తుంటే ఎన్నో విధాల నన్నూరడించావే? ఇప్పుడు నీకై కుందుతుంటే ఎందుకు ఓదార్చవు? ఏ రాక్షసులు నీ బాణాగ్నికి శలభాలైనారో ఆ రక్కసులే నీ మరణానికి కారణాలైనారా తండ్రీ? శరతల్పగతుడవై, శరవిద్ధ శోణితసిక్త శరీరుడవై వున్న నీవు ఉదయ భాస్కరుని తలపిస్తున్నావు. మార్గణదారిత మర్మస్థలుడవై, పల్కలేక ప్రణయార్ద్ర దృష్టులతో నన్ను చూస్తున్నావా? నా ఒంటరితనం సహించలేక వనానికి నీవెలా వెంటవచ్చావో, అలాగే నన్ను వీడి ఒంటరిగా నీవు చేస్తున్న మహా ప్రస్థాన యాత్రకు నేను నీ వెంట రావటం

ధర్మమేకదా? నా ఆధిక్యం కోసమో, ధర్మంకోసమో, ఎన్నో సార్లు కోపించాను. ఎన్నడైనా పరుషవచనంకాని, వదన వికృతికాని, భ్రుకుటి బంధంకాని ఎరుగవే. యుద్ధంలో సహస్రబాహుడైన కార్తవీర్యుడు పంచశతాస్త్రాలు ప్రయోగించే కాలంలో నీవు రెండు చేతులతో సహస్ర సంఖ్యలో అస్త్రాలు ప్రయోగించగల నేర్పరివే. వాసవాస్త్రాలనుసైతం అస్త్రపాతతో ఖండించగల ధనుఃపాటవం గలవాడివే. నాగశరబంధన బాధితుడవై పడియున్నావా? విధికి సృజించిన విధి కూడ లోపడవలసిందే. విభీషణునకు లంక సమర్పిస్తానని బాస చేశాను. ఆ ప్రతిన నెరవేర్చ కుండా ప్రాణాలు వదలుతున్నాను. అనృతదోషం నా అంగాలను దహి స్తుంది.

## రాముడు కపులతో కిష్కింధకు పొమ్మని సుగ్రీవునితో చెప్పుట

"మిత్రుడా! సుగ్రీవా! వెంటనే అంగద జాంబవంతాదులతో కిష్కింధకుపో. ఒక్క క్షణం ఇక్కడ నిలువవద్దు. వానర సైన్యంతో వారధి దాటు. ఆ రాక్షసరాజు మేం మరణించామని తెలుసుకుని సర్వ సైన్యంతో నీపైకి ఎత్తి వస్తాడు. ఇంత సేనతో సురక్షితంగా ఆవలి తీరం చేరటం సాధ్యంకాని పని. ఇతరు లెవ్వరైనా చేసేవేనా పావని కావించినట్టి పనులు? ఈ వృద్ధు జాంబవంతుడు, ఈ గవాక్షుడు చూపించిన సాహసం వర్ణన కందుతుందా? అంగదుడు నాకై చేసిన త్యాగం, చూపించిన శౌర్యం ఇట్టిదని చెప్పటం నాతరమా? మైంద ద్వివిద కేసరి సంపాతి గజ శరభ గవయ గంధమాదనాది మహావీరులు నా నిమిత్తం ప్రాణాలు ధారపోశారు. వీరిని ఎంత మెచ్చినా ఇంకా నాకు ఋణమే మిగిలింది. నీవు, మిత్రుడైనవారు చేయవలసిన దానికంటే అధికంగా ధర్మప్రీతితో చేసి మిత్ర శబ్దానికే ఆదర్శమైనావు. నేను అన్నివిధాలా దైవోపహతుణ్ణి. నా వ్రాత తప్పించటం ఎవరితరం? ఓ వానరశ్రేష్ఠులారా! ఎంతో భయభక్తులతో, ప్రీతితో నా విజయం కోసం ప్రాణాలు అర్పించటానికి సిద్ధమై పోరారు. విధి వ్యతిరేకించింది. పాలెపురుగు

ఈగపులిని మ్రింగింది. మీకు సెలవిస్తున్నాను. మీరైనా కొంతకాలం సంసారసుఖం అనుభవిస్తూ, జాతిధర్మాన్ని రక్షిస్తూ భద్రంగా వుండండి. నా దౌర్భాగ్య జాతకానికి మీ అమూల్య ప్రాణాలు ఇక బలి పెట్టించుకో లేను" అని చెప్పగానే ఒక్కసారి క్రోతిరేడులు గొల్లుమని గోల పెట్టారు. కన్నులు వాచేలాగా, అశ్రువులు వరదలు కట్టేలాగా ఏడ్చారు. ఆ సమయానికి కపి వ్యూహాన్ని కట్టుదిట్టంచేసి విభీషణుడు రామునివద్దకు వచ్చాడు. అంజనాద్రి ఆకారం దాల్చినట్లు గద ధరించి వస్తున్న విభీష ణుని చూచి భయపడి ఇంద్రజిత్తని తలచి పారిపోసాగారు. విభీషణుడు ఆ వింత చేష్టకు విస్మయం పొందాడు.

## కపులు విభీషణుని ఇంద్రజిత్తని ఎంచి పారిపోవుట

వాతాహతికి చెల్లాచెదురయ్యే మబ్బుల్లాగా మర్కట సైన్యం పారి పోతూండటం చూచి "కడలి నడుమ తుపానులో చిక్కిన నావ తిరుగుడు పడ్డట్లు సైన్యం సంక్షోభంతో ఉక్కిరి బిక్కిరి అవుతూంది. కారణం ఏమిటి?" అని అడిగిన సుగ్రీవునకు అంగదుడు "మన నాయకులు మర ణించారని దిగులుతో పారిపోతున్నా" రని చెప్పాడు. "అది కాదు. ఇంకేదో కారణం అయివుండాలె. రామలక్ష్మణులకింతవరకూ ఏ అపాయం రాలేదు. అటు దూరంగా వున్న మనవాళ్ళు ఆయుధాలు పారేసి, అదరి బెదరి, నిలువు చూపూ, వెల్లనైన మోమూ, వణకుతున్న దేహంతో సిగ్గు విడిచి పారిపోతున్నారు. పడిపోయిన వారిని దాటుకుంటూ, ప్రక్క వారిని లాగుకుంటూపోయే పరిస్థితి ఇప్పుడేం వచ్చింది?" అని సుగ్రీవుడు అడుగుతున్న సమయంలో విభీషణుడు గదాహస్తుడై చేరవచ్చి, ఆశీర్వ దించి సుగ్రీవునితో కూడి దాశరథులను పరీక్షిస్తూ దుఃఖంలో మునిగాడు. చేరవచ్చిన రావణానుజుని చూచి, వానరులు పొందిన భయం చూచి, అర్థం చేసుకుని, జాంబవంతునితో "మనవాళ్ళు ఇంద్రజిత్తు పెట్టిన హింసలో నుంచి ఇంకా తేరుకొనక, మన విభీషణుని రావణి అనే భావించి పారిపో తున్నారు. నీవు పోయి వారిని వారించి స్వస్థులను చేయి" అనిచెప్పాడు. ఆ వార్త విన్న భల్లూకపతి ప్లవగులు పారిపోయే దారికడ్డంగా నిల్చి చేతు లెత్తి "కపులారా! భయంవీడండి. వచ్చినవాడు విభీషణుడు. ఇంద్రజిత్తు

కాదు. వాడు దేహంతో కనపడితే బ్రదికి బట్టకడతాడా? మీరంతా ధైర్యంగా వుండండి. రామలక్ష్మణులలో ఇంతవరకు చెడు లక్షణాలేవీ లేవు. ఈ పిరికితనం ఏ అంగడిలో కొన్నారు? తిరిగి వెనుకకు రండి" అని ఉచ్చైర్నాదంతో హెచ్చరించాడు. వానరులంతా భయం వదలి విభీషణుని పోల్చుకుని యథాస్థానాల్లో అప్రమత్తులై నిలిచారు. దుర్వార బలులైన దాశరథుల పాటుకు విభీషణుడు చింతాదంతురితాత్ముడైనాడు.

## శోకించే విభీషణుని సుగ్రీవుడు తేర్చుట

తెలివి వచ్చిన రాముడూ, తెలివి రాని లక్ష్మణుడూ ఒకే విధంగానే కనులుమూసి పడివున్నారు. మంత్ర జలంతో భ్రాతల నయనాలను తుడిచి, "ఇంకా తెల్లవారలేదే" అని విచారించి, సృష్టికి హేతువైన అఖండతేజం ఆకృతులు పొందినట్లుండే రాఘవులు చలనరహితులై శయనించటం చూస్తున్న విభీషణుడు శోకం ఆపుకోలేక, "నా అన్న కొడుకు ఎంత దుర్మార్గుడు? ఎదిరించిపోరలేక మాయతో మహాత్ముల బంధించాడు. ఈ ఫణిపాశాలు ప్రాణాపాయం కల్గించకపోయినా కదలకుండా బంధించి స్మృతిరాకుండా చేస్తుంటై. మహాగారుడ మంత్రం దీనికి విరుగుడు. దానికింకా సమయం కాలేదు. ఈటె పోటుతిన్న ఏదు పంది (ముండ్లున్న పంది) పడివున్నట్లు, నాగాస్త్రాలు నాటిపడివున్న రాఘవుల చూస్తే కడుపు తరుగుకొని పోతూంది. ప్రతిష్ఠకోసం వీరులలో ఏరికోరి వీరి నాశ్రయించి వచ్చాను. ఈ పుణ్యమూర్తులు ఈ తీరున మృత్యువుతో పోరుతున్నారు. నేను బ్రదికినా చచ్చినవాడిక్రింద జమ అయినాను. భగ్న రాజ్యమనోరథుడనై, పరమాప్తుల కోల్పోయి జీవచ్ఛవంగా వుండే కంటే మిత్రులతో నా మేనుగూడా చేరుస్తాను. ఇహం నాకు లేకపోయినా, పరమైనా లభిస్తుంది. దుర్మార్గుడైన దశాస్యుని ప్రతిజ్ఞ నెరవేరుతుంది" అని వాపోతున్న విభీషణుని వానరపతి కౌగిటిలోచేర్చి "మిత్రుడా! నాకు ధైర్యం చెప్పిన నీవేనా ఈ విధంగా వాపోతున్నది? నాకు ఇతర శాస్త్ర విషయాలు ఏమీ తెలియకపోయినా అంతరాత్మ ప్రసన్నంగా వుంది. శుభం చింతిస్తున్నది. మన మిత్రులు తప్పకుండా కోలుకుంటారు. లంకానగరానికి నీవే రాజువు. ఈ దివ్యమంగళ విగ్రహాలు ఎన్నడూ అప

మృత్యువు వాత పడరు. లోకోత్తర శీలవతి సీత మంగళ సూత్రబంధం తిరుగులేనిది. హనుమంతుడు ఆమె సాక్షాత్తు ఆదిలక్ష్మి అపరావతారమని చెప్పాడు. మహానుభావుడైన మారుతి వచనం పొల్లుపోదు. రావణుడు మాత్రం తనయులతో కూడి లంక ఏలటం ఇక జరుగదు. మిత్రులు మూర్ఛ తేరిన వెంటనే ససైన్యంగా రావణుని మనవారు చంపుతారు" అని విభీషణుని ఓదార్చి, "సుషేణా! నీవు దాశరథులు తేరుకొనగానే సురక్షితంగా కిష్కింధకు చేర్చు. నీతో మన సైన్యాన్ని కూడా కొనిపో. లంకేశుణ్ణి సబాంధవంగా సమయించి సీతామాతను కొనివస్తాను. నన్ను జయించేవాడు నా అన్న తప్ప త్రిభువనాల్లో ఇంకెవ్వరు లేరు. ఇప్పుడు నా అన్న లేడు. అతడు ధరించిన కాంచనహారం నా మెడలోనే వున్నది. అమరేంద్రుడు నష్టశ్రీని కొనివచ్చినట్లుగా, రావణుని వధించి విజయశ్రీతోనూ, జానకీ జననితోనూ కిష్కింధకు వస్తాను" అని మేఘ గర్జన ధిక్కారంగా గళమెత్తి పలికాడు.

## సంజీవకరణి తెప్పించుమని సుషేణుడు సుగ్రీవునితో చెప్పుట

ఆ పలుకులు ఆలించి "ప్రభూ! నేనొక మంచి మాట చెపుతావినుమ. మన సైన్యం ఇంద్రజిత్తు చేతిలో అపారంగా మరణించింది. మహావీరు లెందరో మడిశారు. మన నాయకులు మూర్ఛితులై శరతల్పంలో పండి వున్నారు. పూర్వం దేవదానవ యుద్ధం ఈవిధంగానే జరిగింది. దేవతలు రాక్షసులచే అసంఖ్యాకంగా మరణించారు. దిక్షతులు మూర్ఛితులైనారు. అప్పుడు దేవగురుడు బృహస్పతి మణి మంత్రౌషధులతో వారిని పునర్జీవితుల చేశాడు. అవి ఇప్పుడు పాల సముద్ర ప్రాంతంలో వున్నై. మన సంపాతి పనసాది మర్కట శ్రేష్ఠుల పంపి తెప్పించు. మన వాళ్ళల్లో చాలా మందికి ఆ చోటు తెలుసు. అంతకంటే మన హనుమంతునిపంపితే కార్యసిద్ధి త్వరగా కలుగుతుంది. అమృతాన్ని పొందటానికి సురాసురలు ఎక్కడ క్షీర సాగరం మథించారో అక్కడ ద్రోణ పర్వతం, చంద్ర పర్వతం అనేవి వున్నై. ఆ పర్వతాల్లో విశల్యకరణీ, దివ్య సంజీవకరణీ

వున్నై. ఆ దివ్యమైన ఓషధులుతెస్తే మన వారంతా మళ్ళీ బ్రదుకుతారు" అని సుషేణుడు సుగ్రీవునితో పలుకుతుండగా శ్రవణ దుర్భరంగా పెద్ద ఘోష వినవచ్చింది.

## గరుత్మంతుడు శ్రీరాముని చూడవచ్చుట

పక్షవిలాహతికి పయోదాలు దూదిపింజలై తూలిపోగా, కడలి కరళ్ళు లేచి అల్లకల్లోలమై గడగడలాడగా, సద్వీప ద్రుమశైలంగా లవణాంభోధి సంచలనం పొందగా, భూప్రదేశం మూలంతో పెల్లగిలి పడిన వృక్షలతో గమన విరోధంకాగా గరుత్మంతుడు మింటతోచాడు. సంచలద్దహనుని చందంగా ఆకాశాన ఖగపతి గోచరించినంతనే రామ లక్ష్మణుల చుట్టివున్న పాములు యథాయథలై, ప్రాణభయంతో పరుగు లెత్తి లవణాంబుధిలో దూకి మునిగిపోయినై. ఆ పాప పురుగులు అదృశ్యం కాగానే గ్రహణముక్త రవిచంద్రులవలె రామలక్ష్మణులు వెలిగారు. వైనతేయుడు పక్షలు కుంచించి భ్రాతల మ్రోలవాలాడు. ఇరువురి ముఖ పద్మాలను ముక్కుతో పుణికాడు. అంతవరకు విస్తేజుల, వైర్వీర్యుల చేసిన నాగపాశబంధాలు విడిపోవటమేకాక వ్రణజాలంతో దుస్సహంగా వున్న శరీరాలు స్వాభావిక సౌష్ఠవాన్ని పొందటమేమి వింత? ఎన్నడు ఎరుగని ధిషణా బలవీర్య తేజస్సులతో, ఓజం, ఉత్తమ గుణం, ఉత్సాహం, స్మృతీ, సత్త్వదర్శనం ఆజిపుత్రులకు శతసహస్రాధిక గుణంగా కలిగినై. శరీరకాంతులు బంగారువలె మిలమిల మెరసి పోయినై. అప్పుడు ఖగ రాట్టు ఆ ఇద్దరినీ పక్షలతో ఆలింగనంచేసి ఆనందబాష్పాలు కార్చాడు. సోదరులు కృతజ్ఞతతో వినమ్రులైనారు.

## రామలక్ష్మణులు బంధముక్తులై వైనతేయుని ప్రశంసించుట

"ఓ అవ్యాజ కరుణా సముద్రా! ఆపద్బాంధవా! నీ చేతకు మారు చేత లేదు. పోనున్న మా ప్రాణాలు నిలిపావు. నీ రాకచేతనే మాయావి రావణి ప్రయోగించిన మంత్ర ఫణిబంధాలు మాయమైనై. నీ స్పర్శ చేతనే మా శరీరాలు వజ్రకల్పాలై, అనంత శక్తి సంపన్నమైనై. నీవు మా

తండ్రివలె విందుముదం కల్పిస్తున్నావు. మా పితామహ ప్రపితామహులే నీ ఆకారంతో వచ్చినట్లనిపిస్తూంది. నీవు పుణ్యమూర్తివి. దివ్య శక్తి సముపేతుడవు. నీవు ధరించిన భూషణ మాల్యాను లేపనములు, వస్త్రాలు చూస్తే అగోచర దివ్యతేజం మా రక్షణకై అవతరించినట్లు అనుభూతి కల్గిస్తూంది. నీవెవ్వరవు? మహాత్మా! నీ నామం ఏ పవిత్రాక్షర సంయోజితమైంది? మాకు శ్రవణానందం కల్పించు" మంటూ సోదరులు పితృసన్నిధి పుత్రులవలె వైనతేయుని ప్రార్థించారు.

## గరుడుడు రామలక్ష్మణుల జాగ్రత్తగ సమరం చేయుడని హెచ్చరించుట

ఆ భ్రాతల ప్రార్థనకు ఖగపతి అవధిలేని ఆనందం పొందాడు. "పూజ్యులారా! మీరు గుర్తింపలేరుకాని నేను మీకు ఆత్మసఖుడను. నన్ను గరుత్మంతుడంటారు. నేను మీకు ఎప్పుడు బహిశ్చర ప్రాణాన్ని ఈ బంధానికి కారణం వుంది. నీవు మాయను ఆరాధించటం మాను కున్నావు. సత్యధర్మ స్థిరాలైన శ్రుతిమార్గ శ్రేణిలోనే పయనించ. కంకణం కట్టుకున్నావు. అందుచే మహాశక్తిగల మాయను నీ శత్రువు మాటి మాటికి నిన్ను నిర్జించటానికి ఆశ్రయిస్తాడు. ఆ మాయకు దేహధారణం చేసిన జీవ కోటి లోబడక తప్పదు. నీ తమ్ముడు కేవలం నిప్పు వంటివాడు. అతని ఏ శక్తీ అరి కట్టలేదు. కాని, నీవే అతని అరికట్టి ముప్పు తెచ్చుకుంటున్నావు. ఇకముందు మిక్కిలి హెచ్చరికతో సమరం సాగించాలి. ఇంతవరకు నీ ప్రతిపక్షులు అసలు శక్తులు చూపక లౌకిక శక్తులే చూపారు. దశవద నుని స్కంధావారంలో ఇద్దరే ముఖ్యులు. పంక్తికంఠుడూ, అతని పుత్రుడు ఇంద్రజిత్తు. ఈ ఇద్దరు అంతంలేని యుద్ధంచేయగల సమర్థులు. ఇంద్రజి తన మాయా విద్యతో ఆవాహన చేస్తే కాద్రవేయులు బాణ రూపాల్లో వచ్చి మిమ్మల్ని బంధించారు. ఈ కట్లు ఇంద్రాది దివ్యులు వచ్చినా విప్పలేరు. నాకీ వార్త తెలిసి మీకు సాయపడవచ్చాను. అందుకు మీపైగల మిత్రభావమే కారణం. వచ్చిన పని అయిపోయింది. కూట

యోధులు రాక్షసులు. ఇకముందు సాగే సమరం భ్రమ ప్రమాదాలతో సాగుతుంది. నీవు కృపామూర్తివి. అది నీకు నైజగుణం. రాక్షసులు క్రూరులు. వాళ్ళకు నీతి నియమ నిర్బంధాలులేవు. కనుక కనువిప్పు కలిగి యుద్ధం నడిపించు. మీ వదనాల్లో "నేను మీకు మిత్రుణ్ణి ఎలా అయినాను అని ప్రశ్న కనుపిస్తూంది. ఆ వివరం యుద్ధానంతరం చెపుతా. ఇది సమయం కాదు. స్త్రీ బాల వృద్ధులు తప్ప నీ శరాగ్నికి లంకంతా సమూలంగా దగ్ధమైపోతుంది. నీ ప్రతిజ్ఞ నెరవేరుతుంది. నీ అర్ధాంగిని స్వీకరించి జన మనోరంజనకరంగా బహూహాయనాలు విశ్వ విఖ్యాత కీర్తితో రాజ్యపాలనం చేస్తావు. నాకిక సెలవు" అని రామునితో చెప్పి సోదరుల ప్రేమతో స్పర్శించి ప్రదక్షిణించి పవనజవంతో తార్క్ష్యుడు పవన పథానికి ఎగిరిపోయాడు.

## స్వస్థులైన రామలక్ష్మణులను చూచి కపులు సింహనాదాలు చేయుట

ఆగంతుకంగా వచ్చిన ఆ పుణ్యమూర్తి దర్శన స్పర్శన సల్లాపాలతో ద్వాదశాదిత్యమండలోదయంవలె రామలక్ష్మణులు పునః ప్రకాశ భాసుర రూపులై లేచి, మిత్రుల ఆదరించి, కోదండాలు సారించి, గుణం కూర్చి ఒక్కసారి లాగి వదలారు. ఆ గుణ టంకృతికి స్వర్గమర్త్య పాతాళాలు సముద్ర భంగ మధ్యంలో ఓడవలె క్రిందు మీదైనై. అహో! ఆ సమయం ఎంత విలువైంది? అది ఇక ఎన్నడు రానిది. సర్వ భూత సంతోషప్రదమైంది. దుష్ట రాక్షస నాశంకరం, శిష్టజన శుభంకరం, భక్త జనాభయంకరం అయింది. ఘ్రాణతర్పణం చేస్తున్న ఆ సువాసన లెక్కడివి? తెలిసింది. త్రింశత్కోటి దేవతలు సంతాన పారిజాత కల్ప ప్రసూనాలను వర్షిస్తున్నారు. ఆ మధుర ధ్వానాలెక్కడివి? అవీ వారివే. సత్య ధర్మాలు పునఃప్రతిష్ఠితమైనట్లుగా రామలక్ష్మణులు ధనుర్ధరులైనందున అప్సరోంగనలు విజయగీతికలు ఆలాపిస్తుంటే వేణుమృదంగ వీణావాదనాలు విద్వాంసులు మొరయిస్తున్నారు. అబ్బా! చెవులు సుడిబడుతున్నై. తనువు కంపిస్తూంది. ఈ దుస్సహ సింహనాదాలు, భయంకి

రార్భటులు, శంఖారావాలు ఎక్కడివి? అవి రవిపుత్రుని స్కంధావారం నుంచి వస్తున్నై. మర్కటేశ్వరులు మళ్ళీ పునఃపూరిత ప్రాణులై ఆహవానికి ఆయత్తం అవుతున్నారు. వానరులవైపు నుంచి వస్తున్న ఘోష లంకలోని రాక్షసులు చేసే ఘోష అణగించి గుండెల్లో ఘోష సృష్టిస్తూంది. అది తొలకరి మేఘపంక్తి కల్పించే గర్జలకు అనురూపంగానే కాక అన్నగా కూడా వుంది.

## రావణుడు కపుల సంతోషానికి కారణం విచారించుట

లంకలో కుమార విజయంతో, కోల్పోయిన ధృతికూడగట్టుకున్న కుటిల కర్ముడు రావణుడు మందిరంలో "జానకి తనకెట్లు స్వాధీన అవుతుంది?" అనే ఆలోచనలోపడి ఊహా సుందర మందిర బృందాల నిర్మాణంలో ఉక్కిరిబిక్కిరి అవుతున్నాడు. చెంపపై చరిచినట్లు శాఖా మృగ ప్రళయ భీషణ ఘోషణాలు ఎడతెరిపిలేకుండా మ్రోగి వింశతి శ్రవణాలను విస్ఫోటితం కావిస్తుంటే మది కుదురుచెదరి "ఇంత ఉత్సాహం కల్గటానికి ఇంతలో అంత సంతోష హేతువు ఏమి వచ్చిందీ క్రోతులకు? పుత్రుడు రామలక్ష్మణులు చచ్చారని ఇంతకు పూర్వమేకదా చెప్పి వెళ్ళాడు? సాగర ఘోషను సమయింపచేస్తూ వస్తున్న ఘోషకు ఏదో కారణం వుండి వుంటుంది. అది భ్రాతలు తేరుకోవటం కాదుకదా? ఆ విధంగా జరగటం సాధ్యమా? ఏమో. ఇంతవరకు సృష్టిలో అసాధ్యాలనుకున్నవన్నీ వీళ్ళకు సాధ్యాలవుతున్నై. అందుకు వేరే సాక్ష్యాలెందుకు? లంకిణిని జయించటం, లంకలో ప్రవేశించటం, మాయతో నిండిన నగరంలో కోతి వెతకటం, సీతతో మాటలాడటం, అశోకవనం పాడుచేయటం, అక్షయకుమారాదులు అడ్డగిస్తే అంతం చేయటం, లంకను కాల్చటం, సముద్రంపై సేతువు కట్టటం, ఒక్క కోతి శతయోజన విస్తీర్ణ సాగరాన్ని కాలిబాట వలె చేయటం, నీళ్ళల్లో రాళ్ళూ, చెట్లూ, చేమలూ తేలటం సాధ్యమైనప్పుడు పుత్రుని నాగపాశ బంధాలు విడివడటం సాధ్యంకాకపోతుందా?" అని పూర్వాపరాలు చింతించి, వార్తాహరుల పిలిచి "అగచర సేనలో రేగుతున్న ఆనందానికి కారణం అరసిరం"డని వారిని పంపివేసి, వినరాని క్రొత్త కారణం వినవలసి వస్తుందేమోయన్న శంకతో నిట్టూరుస్తూ ఎదురు

చూస్తున్నాడు. ఇంతలో చారులుపోయి ప్రాకారాలెక్కి వృత్తాంతం గ్రహించి వచ్చి "ప్రభూ! రామలక్ష్మణులు పాశముక్తులై రణానికిసిద్ధంగా వున్నారు. రవి పుత్రుని ఆజ్ఞతో వనచర సైన్యం ప్రహరణ సాధనాలు ధరించి వారే మనపైకి వస్తున్నా"రని చెప్పి తప్పుకున్నారు. పంక్తి ముఖుని గుండెలో పది కోట్ల అగ్ని పర్వతాలు బ్రద్దలైనై. మనఃకల్పిత సుందర మందిరాలు మాయమైనై. ఆస్థానంలో అపమృత్యువు కఠోర దంష్ట్రి కరాళవక్త్రం విచ్చి, నాలుక సారించి, రక్తం గ్రోలుతూ సాక్షాత్కరించింది.

## రామలక్ష్మణులు పాశముక్తులగుటకు రావణుడు వ్యసనపడుట

తనలో కనుపించిన మరణ దేవతనుచూచి అసురపతి అవాక్కయి నాడు. అనుకున్నంత అయింది. విధాతృవరప్రతిపన్నాలు, అప్రతీకాలు, వికర్తనాలు, విషధరాస్త్రాలు నా కొడుకుచే ప్రయుక్తమై వ్యర్థం కావ టమా? అయినై. అందుకు నా అహంకారమే కారణం. నరవానరులను అలక్ష్యంచేసి అమృతత్వాన్ని పొందాను. అఖిల విశ్వవిజయం చేశాను. వేద విదుడనై, వేదవిహిత కర్మాతిక్రమణంచేశాను. మానవతుల శీలం మాయించి అవ్యాజంగా, మానినిని, అనిష్టను, మానవిని అపహరించి తెచ్చాను. హితవు పల్కినవారిని వెలి వేశాను. ఈ స్థితిలో నా విజయం శూన్యం. నా మరణం తథ్యం. నా వాళ్ళిక నన్ను కాపాడలేరు. ఇంత జరిగిన మీదట వెనుతగ్గటం పౌరుషవంతుని పనిగాదు. కడగిన కార్యం కడ ముట్టవలసిందే" అని స్థిరపరచుకున్నాడు. అంతలోనే కపుల తోకలు చర్నకోలవలె మ్రోగిస్తూ, శంఖాలు పూరిస్తూ, భూమి బరలుపడ అడు గులువేస్తూ, అర్పటులు చేస్తూ ముందుకు రావటం గుర్తించాడు. ధూమ్రా క్షుని రప్పించాడు.

## ధూమ్రాక్షుడు యుద్ధానికి పోవుట

"కుమారా! నీవు మహావీరుడవు. నీవు సైన్యసమేతుడవై పశ్చిమ ద్వారం రాముని పైకి పో. జాగుసేయవద్దు. శత్రువులు ద్వారాలను ఛేదించివేశారు.

అల్పరక్షణ స్థానాలుగా అన్ని ప్రదేశాలు బలహీనపడ్డై. ఈ జనక హంత కుణ్ణి జముని వీటికి పంపు" అని ఆజ్ఞ చేశాడు. వాడు తనకు అవకాశం కల్పించిన ప్రభువును ప్రస్తుతించాడు. వేరు వేరుగా తన శక్తులు తెల్పి వెంటనే పని గొన్నాడు. ఘంటాఘణంఘణక్వాణం దిక్కులు నిండగా, శూలప్రాసభల్లాది మారణాస్త్రాలు ధగద్ధగిత కాంతులతో మింటిని కళా మయం చేయగా, భేరీపణవఢక్కారావాలు ఢమఢమ ధ్వనులతో పర్వత కుహరాలను ప్రతిధ్వనితం కావించగా ధూమ్రాక్షుడు, కాలాయసదండ పరిఘకరవాల శూలముసలముద్గర పట్టిస పరశ్వధభిండి వాలాది సమర సాధన సంపత్తితో కూడిన సేనతో ఇంద్రజిత్తు రక్షించే పశ్చిమద్వారం వైపు పయనించాడు. కవచులై, ఖడ్గులై, ధ్వజులై, స్వర్ణభూషణాలంకృ తులై, వివిధాస్యాలుగల ఖరవాహనాలు కట్టిన రథాలపై కొందరు రాక్ష సులు నడువగా, కొందరు జవంగల గుర్రాలపై, మదించిన ఏనుగులపై, భీకరవ్యాఘ్రాలపై నెక్కి అనుసరించారు. తోడేళ్ళ ముఖాలూ, సింహాల ముఖాలూగల గాడిదలు గట్టిన రథం ఎక్కి, చకచక తోతాలించి పశ్చిమ దిశాభిముఖంగా పోతే అక్కడ సర్వరాక్షస సంహారుడైన హనుమ ఎదు రయ్యాడు.

## ధూమ్రాక్షునకు దుశ్శకునాలు కానవచ్చుట

ఘోరాకారుడైన వీర హనుమ దర్శనం కాగానే ధూమ్రాక్షుని తల తిరిగి పోయింది.దానికి బలంగా గ్రద్దలు పైన రొదచేస్తూ తిరుగుతున్నై. అందులో ఒక గ్రద్ద దభాలున తేరి మీద పడింది. ధ్వజం పైన విడువ కుండా గ్రద్దలువాలి లేచిపోతున్నై. నెత్తురు వాన రెండు క్షణాలు కురి సింది. కొండలు కొట్టుకని పోయేలాగా గాలి వీచింది. తెల్లని కబంధం ఆతని సమీపంగా రక్తంతో తడిసి వికార స్వరంతో ఆతన్నే చూస్తూ పెద్దగా అరిచి పడిపోయింది. తృటికాలం భూమి అదిరింది. దూరంగా చీకట్లు క్రమ్మి దిశలు కాంతిహీనాలైనై. ఉత్సాహంగా వచ్చిన రాక్షసులు ఊరకయే మూర్ఛాగతులై, సాధ్వసాక్రాంతులై ధరిణిపై పడిపోయారు. అప్పటి కాలస్థితీ, తిరుగులేని రాజాజ్ఞా అనుసంధించి విజయాశలేదు సరి కదా ప్రాణాశకూడ లేదని ధూమ్రాక్షుడు తనలో తాను దుఃఖించాడు.

అంతలో విజృంభించి వానరసేనా వాహినికి సేతువుగా వ్యూహాన్ని నిర్మించి రణాంగణంలో ప్రవేశించాడు.

## ధూమ్రాక్షుని సైన్యం కపులతో పోరాడుట

సమర సన్నాహంతో ద్వారం తరించి వస్తున్న ధూమ్రాక్షుణ్ణి చూసి వానరులు ఇంద్రజిచే పొందిన అవమానానికి ప్రతీకార సమయం వచ్చిందని ఒక్క ఉదుటున, నేలపై నింగిపై నిండి అంటదకి నిలువరించారు. అస్త్రాలపై, శస్త్రాలపై, రథాలపై, ధ్వజాలపై, కొమ్ములపై, వీపులపై అంతా అగచరులే. తన్నేవారు, కొరికేవారు, పీకేవారు, చీల్చేవారు, లాగేవారు, గుద్దేవారు, తోకతో చుట్టేవారు, శిలలతో కొట్టేవారు, చెట్లతో మోదేవారు, అరచేతులతో బాదేవారుగా కపులు రాక్షసులకు విశ్వరూప ప్రదర్శనం చేశారు. ఆ దాడి లక్షణం పూర్వం అనుభవం లేని అసురులు ఎక్కడివారక్కడ కుప్పకూలిపోయారు. కొంతసేపటికి యుద్ధగతి అర్థం చేసుకుని రథారూఢులు వెనుతగ్గి, పరిఘ గదా త్రిశూల శరపట్టిశ భల్లక భిండివాల ముద్గరాది సాధనాలను చాపాల్లో కూర్చి, యంత్రాల్లో కూర్చి ప్రయోగించారు. సూదిమోప ఎడం లేకుండా శత్రువులు ప్రయోగించే దారుణ మారణాస్త్ర పాళికి మరణించేవారు మరణిస్తుంటే, పర్వతాలూ, వృక్షాలూ, కరకు గండశిలలూ ధారావాహికంగా ప్రయోగిస్తూ మర్కటులు మాంసాశనుల మర్మస్థానాలు ఛేదించారు. తలలు బ్రద్దలుకొట్టారు. చేతులు కాళ్ళు విరిచారు. పొట్టలు చీల్చారు. నడుములు విరుగపొడిచారు. రథాలు కూలినై. ధ్వజాలు వ్రాలినై. శరీరాలు రక్తవాహినుల్లో తేలినై. ఎంత యత్నించినా కపులదే పైచేయి కావటం రాక్షసులకు తల కొట్టేసినట్లయింది. తమకున్న శక్తి అంతా కూడదీసుకొని భయంకరాస్త్రాలు పరగించి శాఖాచరుల ఉత్సాహాన్ని పొంగే పాలపై నీళ్ళు చల్లినట్లు భంగించారు. ముందున్న సైన్యం మందగించటంతో వెనుక రక్షణగా నిల్చిన సైన్యం వచ్చి చేరింది. ఆ వచ్చిన వానరులు అజేయులు. మృత్యుదేవత కోరలు లాగేవారు. వాళ్ళు రంగం దిగడం ఏమిటి? రాక్షసులు పలాయన పాఠం వల్లించటమేమిటి? యుగపత్క్రియగా జరిగిపోయింది. దేవ దైత్య

దానవులకు తేరిచూడరాని తన సైన్యం నిర్వీర్యమై, నీళ్ళుగారిపోవటం చూసి ధూమ్రాక్షుని కళ్ళల్లో ధూమం సుళ్ళు తిరిగింది.

## ధూమ్రాక్షుడు కపుల వధించుట

ఆరే దీపం ఒక్కసారి భగ్గున మండినట్లు అవమానకశాఘాతంతో ధూమ్రాక్షుడు మండి, కోదండమండితకరుండై, చండ శరాగ్ని జ్వాలల పరపి వానర కాననాన్ని దహించసాగాడు. పిరికితనంలేని కపి వీరులు రామ సేవలో లెక్కకు మిక్కిలి ప్రాణార్పణంచేశారు. సమరస్థలి అంతా తానే ఆక్రమించి, కొందరి ప్రక్కల వ్రక్కలించి, తలల దూలించి కొందరి, స్రుక్కించి మరికొందరి ఉక్కు మిగిలి చెక్కు చెదరక వీర విహారంచేసి విజయ శంఖం పూరించాడు. జ్యాతంత్రీమధురం, హిక్కా లాళ సమన్వితం, గజఘీంకార సంగీతంగా రణగాంధర్వం ప్రవర్తింప చేశాడు ధనుస్సముద్ర నిర్గత శరజాలోర్మిపంక్తులతో తరు చరవ్యూహ ధరణీ భాగం ముంచుతూ ముందుకు సాగుతున్న ధూమ్రాక్షుణ్ణి హనుమ చూచాడు.

## ధూమ్రాక్షుడు హనుమంతునిచే హతుడగుట

నిశ్శంకతో బింకం చూపుతూ లంకేశుని ప్రముఖ సేనాపతులలో ఒకడైన ధూమ్రాక్షుడు స్వీయ సైన్యాన్ని గడచివస్తూ తాను దర్శించిన అపశకునాలన్నీ హనుమంతుని ఆకృతిలో చూచాడు. రథగమనం తనంత తానై మందగించింది తన రక్షణలోని కపుల బలిగొన్న దైత్యుడు తన కభిముఖుడు కావటం హనుమ ఆగ్రహాన్ని శత గుణితం చేసింది. ఇంద్రుడు వృత్రాసుర వధ సమయంలో, కేల ధరించిన వజ్రాయుధం లాగా, లతావృక్ష పుష్ప వ్యాఘ్రమృగాదులచే నిండిన మహా శైలాన్ని దక్షిణ హస్తంలో ధరించి గిరగిర త్రిప్పి గుండె లక్ష్యంగా విసరివేశాడు. ఆ పర్వతాగమనంలో ప్రభవించిన ప్రభంజనానికి రాక్షసులు నిలవరించు కోలేక నేలపడ్డారు. ధూమ్రాక్షుడు తెలివిగా అరదం మీది నుంచి అవనికి దాటాడు. ఆ గిరి తాకి రథం రథ్యసారథులతో నుగ్గు నూచమైపోయింది. రక్షస్సేనాని గదతో హనుమపైకి దాడిచేశాడు. సేనలు విజృంభించి

వానరులను బాణాలతో బాధించినై. కపులు శరపీడిత శరీరాలతోనే రక్కసి మూకల చెక్కు చెండాడారు. హనుమ లాంగూలం ఝళిపించి ఎదమైన స్థానంనుంచి లోపలికి చొప్పించి దశ శత సంఖ్యల్లో రాక్షసుల చుట్టి వారణం నీరు పూరించి తొండం పైకెత్తి పూత్కరించినట్లు పైకెత్తి త్రిప్పి దూరంగా పారేస్తూ, శైల వృక్షాలతో ఫటఫటారవస్ఫుతంగా తలలు బ్రద్దలుకొడుతూంటే రక్తం ఏరులై పారింది. రాక్షసులు త్రస్త విషణ్ణచిత్తులై తూలి నేల వ్రాలి పారిపోయారు. సేనాపతి ఎంత మొర పెట్టినా వినేదిక్కు లేకుండా పోయింది. రాక్షసుల పారిపోక, కపి వీరుల ధాటి సహించలేక చేతి గద త్రిప్పి మారుతి వక్షం పగిలేట్లు వేశాడు. హనుమంతుడు ఆ బాధ అలక్ష్యంచేసి నగాన్ని శిరానికి గురిపెట్టి పైనుంచి పడవేశాడు. పిడుగు పడిన పర్వతం బ్రద్దలైనట్లు ధూమ్రాక్షుడు తలపగిలి దారుణంగా చచ్చి మృతవీరులు పొందిన గతి పొందాడు. తాటి పాకలకు అంటుకున్న దహనునివలె ధూమ్రాక్షుని మరణవార్త లంకలో తత్క్షణం వ్యాపించింది. రావణుని వింశతి భుజాల్లో ఇప్పటికి రెండు భుజాలు విరిగినై.

## రావణుడు వజ్రదంష్ట్రుని యుద్ధానికి పంపుట

ధూమ్రాక్షుని మరణవార్త రావణుని చెవుల్లో సీసం కాచిపోసినట్లైంది. వజ్రదంష్ట్రుని కపులతో కయ్యానికి కదనరంగానికి పంపాడు. వాడు ధూమ్రాక్షుని చావు తెలిసికూడ మృత్యు ప్రేరితుడై అలంకరించి తెచ్చిన అరదానికి వలగొని మ్రొక్కి సర్వాయుధాలు ధరించిన సైన్యం తన్నంటిరాగా, అంగదుడు నిరోధించిన దక్షిణ ద్వారం దిశగా తరలి వెళ్ళాడు. దక్షిణ ద్వారం దాటగానే మేఘరహిత గగనంనుంచి ఉల్కలూ, అగ్ని శకలాలూ వాళ్ళపై పడ్డై. నక్కలు అశుభం సూచిస్తూ భయంకరంగా ఊళపెట్టినై. లంకానగర దహనం సూచిస్తూ పక్షులు ప్రేత భూమిలో గ్రద్దలు సంచారం చేసినట్లు తిరిగినై. ఆ దుశ్శకునాలను గణించక తారేయ రక్షితమైన తరుచర వ్యూహాన్ని సమీపించాడు. వాడి రాక వానరులకు కాకపుట్టించింది. అంగదుడు వింత సంజ్ఞచేశాడు. అగచరులు

హ్రస్వ రూపులై ప్రాకుతున్న పాముల్లాగా నేలపాటుగా వచ్చి నిశాచర సేనకు అధోభాగం చేరారు. ఒక్కసారి "జయ రామచంద్ర! జయ రవి పుత్ర! జయ తారేయ!" అన్న నాదం మిన్నుముట్టింది. చతురంగ బలం భూమిపై లేదు. అవ్వాయిచువ్వలవలె అంతరిక్షానికిపోయి ఆధారం లేక శరవేగంతో అధోముఖంగా ప్రయాణించి పర్వతం తాకిన ఓడవలె అవనిని తాకి పొడిపొడిగా మారిపోయింది. వజ్రదంష్ట్రుని పండ్లు వజ్రంతో కాకుండానే పాపం చూర్ణమైనై. పృతనాధిపతులలో ప్రథమ శ్రేణికి చెందిన సేనాని మతిచెడి గతితప్పాడు. "ఇదేమి వ్యూహం? యుద్ధశాస్త్రంలో ఎక్కడా ఇటువంటిది ఒకటి వుంటుందని చెప్పలేదే? అయినా, వాళ్ళెందుకు చెప్తారు? మానవులకూ, దానవులకూ, దేవతలకూ చెప్పారు కాని, కోతులకూ, కొండముచ్చులకూ, ఎలుగుబంట్లకూ, మాంసాశనులకూ సమరం జరుగుతుందని కలగన్నారా? ప్రకృతిధర్మాన్ని బట్టి ప్రాణికోటి ప్రవర్తనలు నిర్ణయించారు. ఈ యుద్ధం ప్రకృతి విరుద్ధం. అందుకే నాకు అపశకునాలు కనిపించినై" అని క్షణం ఆలోచించి, హతశేష సైన్యాన్ని వ్యూహంగా పన్ని ఆహవం నడిపాడు.

## అంగద వజ్రదంష్ట్రుల ద్వంద్వ యుద్ధం

వానరుల వైపునుంచి విసురుతుంటూ రాళ్ళు వస్తుంటే, రాక్షసుల వంక నుంచి, చువ్వలవలె శరాలు దూసుకుంటూ పోయి తాకి రెండూ భగ్నమైపోతున్నై. రథ చక్రాల చప్పుళ్ళు, గజ తురగ ఖర పద ఘట్టన స్వనాలు, పరస్పర దూషణ భాషణారావాలు, రణవాద్య విశేషాల ఘోషలు, బొబ్బరింతలు, భుజాస్ఫాలనాలు, తొడ చరుపులు, శింజినీధ్వనులు హోరెత్తగా ఉభయ పక్షాలకు సంకుల సమరం జరిగింది. వజ్రదంష్ట్రుడు కపిసేనా వ్యూహానికి గండికొట్టి, శత్రుమధ్యంలో రథాన్ని పరుగెత్తించి ప్లవంగ బలాన్ని పలచపరిచాడు. అసురులు విజృంభించి అగచరుల బలి గొనటం అంగదుడు దూరం నించి చూచాడు. అంబరానికి లంఘించాడు. శాల వృక్షాన్ని ధరించి, దనుజ శిరాలు తాటిపండ్లు రాల్చినట్లు, కొబ్బరి బొండాలు దుల్చినట్లు నేల కూల్చాడు. తారేయుని ధాటికి దానవ సైన్యం రక్తం కక్కింది. ఖండఖండాలైంది. పొదవడగింది. హారాలతో,

కేయూరాలతో, చిత్ర వర్ణ వస్త్ర హారంతో రణావని శారదరాత్రి వలె ఒప్పింది. అంగదుని పోటూ, అసురుల వేటూ చూచి అగచావులు విజృంభించి, మానిసలినట్లు, కొరవిసూడినట్లు రక్షస్సైన్యాన్ని తుడిచిపెట్టారు. అంగదవానరులు వీరవిహారంచేసి, ఆత్మసైన్యాన్ని హతమార్చటంతో వజ్రదంష్ట్రుడు వజ్రసన్నిభ శిలీముఖాలను చిమ్మి బలిముఖయూథాన్ని దరి దాటకుండ నిరోధించి వెనుకకు నెట్టాడు. అదనురావటంతో మాంసభక్షకులు శైలాటులపైబడి అందినంతవరకూ మ్రింగారు. నరికారు. పొడిచారు. చంపారు.

## అంగదునితో పోరి వజ్రదంష్ట్రుడు చచ్చుట

ఏకమీకతుముల సమరం సాగింది. గుట్టలుగాపడ్డ శవాలపై తోడేళ్ళు ఆటలాడినై. ఘాత వేతాళగ్రహాలు రక్తం త్రాగుతూ పలలం నంజుకున్నై. ఈ యుద్ధంలో ఇరువాగుల సైన్య నష్టం అపారంగా జరిగింది. వానర రాక్షస యుద్ధం ఆటుపోటుతో సముద్రాన్ని తలపించింది. అటు వజ్రదంష్ట్రుడు తన వాహిని క్షీణించటం, ఇటు తారేయుడు తనవారు మరణించటం వీక్షించి మొన మిగిలి ఎదురై ద్వంద్వసమరానికి ఆయత్తపడ్డారు. అసురుడు వేసే అస్త్రాలను అంగదుడు వృక్షాలతో విదళించాడు. అంగదుడు వేసే శైలశ్మసహాలను అసురుడు శరాలతో నురుమాడాడు. పోరు ఘోరంగా సాగింది. ఆతని మార్గణాలకు ఈతడు వెనుదగ్గితే, ఈతని శైలవృక్షపాతానికి ఆతడు వెనుతగ్గాడు. సమ సమరం కొంతసేపు సాగి పరస్పర విజిగీషకు దించింది. రాక్షసుడు వాడి ములుకుల అంగదుని వక్షం నాటి సోలించాడు. యువరాజు పెనుసాలంతో తలపై బాది తేరిపై తూలించాడు. నిశాటుడు వెంటవెంటనే ముసల ముద్గర శూల ఖడ్గాది సాధనాలు వైచి తారేయుణ్ణి బాధించి అర్చాడు. వనాట ముఖ్యుడు లక్ష్యం తప్పకుండా గండశిలా వర్షం కురిసి హయసారథి రథికులచేత విరహితంగా చేశాడు. రాత్రించరుడు కాంచనపుంఖ మండిత శాతశరాళి గుప్పించి కీశేశుని మర్మాలను భేదించాడు. అంగదుడు ఆ బాధకు ఆగలేక అవనీధరాన్ని వాలంతో గిర్రున త్రిప్పి రివ్వున గుండెను లక్ష్యంచేసి రువ్వాడు. ఆ వేగాన్ని భంగించటాని బాణాలు ప్రయోగించి ఫలితం

శూన్యంకాగా దభాలున గద గొని నేలకు దాటాడు. ఆ గిరి రథసారథి హయాలను పొడిపొడి చేసింది. నేలకు దూకిన నిశాటుడు నిలువరించుకుని పైకి దూకి గదతో రొమ్ములో క్రుమ్మాడు. వాలి పుత్రుడు ఒడిసి గదలాగి విరిచి పైబడి పడద్రోసి ముష్టులతో పొడిచాడు. ఆ ఎత్తు తప్పించుకొని లేచి ముష్టి పెనగి పద హస్త ఘాతాలతో తలపడ్డాడు. మహా బలసంపన్నుడైన వాలి సుతుని తాడన పీడనానికి తట్టుకోలేక తచ్చాడి తప్పుకుని ఖడ్గం చే ధరించి తారసిల్లాడు. ఒండొరులు కత్తుల వ్రేటులతో రక్తం కారి పూచిన మోదుగుచెట్లవలె తోచారు. దప్పి విడివడి సేదతీర్చుకొన నిల్చారు. సమయం దాటకుండ అలసినిల్చిన అసురునిపై లంఘించి బంగరు పిడిగల ఖడ్గంతో కంఠాన్ని నరికాడు. ఆ ఖడ్గ ధారాహతి తెగిన వజ్రదంష్ట్రుని శిరం వంద బాహాల దూరంపోయి నేలపడి ఫట్‌మని శబ్దంచేస్తూ పగిలి బ్రద్దలైపోయింది. సేనాపతి తెగిపోవటంతో ప్రాణభీతితో రాక్షసులు లంకలోకి పారిపోయారు. అగచరసైన్యం ఆనందంతో చుట్టుమూగి అంగదుని చేతులతో పైకెత్తి వూరేగిస్తూ స్వస్థానం చేరి నిలుచుంది.

## అకంపనుడు యుద్ధానికి పోవుట

వార్తాహరులచే యుద్ధ వార్తలు వింటున్న దశగ్రీవుడు "వజ్రదంష్ట్రుడు అంగదునిచేతా, రాక్షస సైన్యం వానరులచేతా మరణించా"రని విన్న పిదప పట్టరాని ఆందోళనా, పరిమితిలేని ఆగ్రహం పొందాడు. కాలచోదితమైన కర్మఫలం ప్రేరేపించగా బుద్ధి విరుత్తరయై అనుసరించింది. స్వస్థానంలో, తనచే నిర్లక్ష్యంచేయబడ్డ నరవానరులు త్రిలోక భీకరులైన సేనాపతులనూ, సైన్యాన్నీ తుడిచిపెడుతుండటం చూచి కూడా సమరం సాగించాలని నిర్ణయించటం, ఎంతవాడైనా మానవుడుకానీ, దానవుడేకానీ, దేవతయేకానీ విధి ముందు ఎంత అల్పులో వివేకి మాత్రమే గుర్తించకలడు. అజ్ఞానాంధకారం ఆవరించి, అహంకారం విజృంభించి, భౌతిక సుఖ వాంఛ పరాంకోటిని చేరిన జీవి ప్రకృతి సహజ ధర్మాన్ని బహువిధాల భ్రష్టంచేసి స్వీయ వాంఛాసిద్ధికి దోహదకారిగాచేయ యత్నించటం, తాత్కాలిక ప్రయోజనం పొందగానే తానే సర్వ సృష్టికి మూలమనీ, తన

శాసనమే తిరుగులేనిదనీ భావించి కాలగర్భంలో కలిసిపోతుండటం యుగ యుగాలుగా పరిపాటియై పాతబడిపోయింది. రావణుడు దాన్ని శక్తిమంతంగా పునఃప్రతిష్ఠచేయ పూనుకున్నాడు కాబోలు. సర్వ దేవ దానవ యక్ష గంధర్వాదులకు గుండెల్లో గాలం, రావణుని దుర్మార్గాలకు మూలం అయిన ప్రహస్తుని వంక పంక్తిముఖుడు పారచూచాడు. "మహాసేనానీ! దుర్దమ శౌర్యధనులైన సేనను సమకూర్చి, అకంపనుణ్ణి ఆహవరంగానికి పంపు. సర్వ శస్త్రాస్త్రవేది. సమరోత్సాహుడు. శాస్త. గోప్త నేత. నా శుభచింతనుడు. బలవంతులలో మిక్కిలి బలవంతుడు. ఈతడు అవలీలగా దానవారులను నాశనంచేస్తాడు. వెంటనే కార్యం నెరవేర్చు" అని ఆనతి చేశాడు ఆవిధంగానే ప్రహస్తుడు అసురపతి ఆజ్ఞను పాలించాడు. త్రయస్త్రింశత్కోటి దేవానీకం ఎత్తివచ్చి సర్వాయుధాలతో, సర్వ శక్తులతో సమరం చేసినా కంపనం పొందక "అకంపనుడు" అన్న పౌరుష నామం పొందిన ఆ అసుర సేనాని, కారుమబ్బుల కాంతిని పరిహసించే దేహంతో, బంగరు చెవిపోగులు గండస్థలాలను వెలిగించగా మేరువు లాంటి మహారథంపై ఆరోహించి ఉదయాద్రిపైన తోచిన భానుబింబంలాగా ప్రకాశించాడు. ప్రయాణ సంకేత ధ్వనులు ప్రసరించబడినై. ఆప్తుల ఇంట జరిగే వివాహానికి అరుదెంచే బంధువుల్లాగా అసురసైన్యం ముందుకు సాగింది. అకంపనుని సారథి తోత్రంతో హయాలను అదలించాడు. గుర్రాలు రథాన్ని ముందుకులాగుతూ నిర్నిమిత్తంగా నేలపైకి మ్రొగ్గినై. సారథి చేతిలోని చర్నకోల జారిపడిపోయింది. అకంపనుడికి ఎడమ కన్ను దదదదలాడి ఆగింది. గొంతులో గురగురలాడి హీనధ్వనిగా దగ్గు వచ్చింది. అంతవరకు అపహసిత భాస్కర మండలంగా వెలుగుతున్న వదనం సున్నపుకాంతిగా సురిగిపోయింది. అభిముఖంగా అనిలుడు బలంగా వీస్తూ ఆతని వక్షాన్ని తాకి రథాన్ని స్తంభించాడు. ఆ సమయం నిర్మలంగా వుండికూడ క్షణకాలం దుర్దినంగా (మబ్బులో సూర్యుడు మరుగుపడిన వేళ) తోచింది. పక్షులూ, జంతువులూ సహజ రుతాలు వీడి కర్కశరుతం చేసినై. అనిర్వాచ్య తేజం సత్య సంకేతంతో సర్వాంతర్యామిగా నిండి ప్రకృతి బాహ్యాభ్యంతరాలను స్వధర్మంగా ప్రవర్తింపచేస్తూంటుంది. అందుకే, అకంపనుడు కూడ తన పరమాణు రూపమే

కనుక తన అనిష్టాన్ని ప్రకృతి దుర్నిమిత్తాలతో (అస్వాభావిక ధర్మంతో) ఆగమనం అవధారించింది. ఆ స్వీయబల మదోన్మత్తుడు నిర్లక్ష్యంగా సమర క్షేత్రానికే సాగిపోయాడు. మెరికెల వంటి అసుర వీరుల మాంస భోజులుగానే ఇంతకాలం గడిపారు. ఇప్పుడు సమరభోజనం సంప్రాప్తం కావటంతో అంబుధులు కలగుండుపడేలాగా అర్బటించారు. వజ్రదంష్ట్రుడు చావగానే రక్షస్సేన వికావికలై లంకకు పారిపోవటంచేత విశ్రాంతిపొందుతున్న కీశ సైన్యం ఆ గర్జలకు ఒక్కసారి ఉలికి పడింది. తమ సహజ ప్రహరణ సాధనాలైన కొండలూ, చెట్లూ, గుట్టలూ, చిన్న చిన్న రాళ్లూ సిద్ధం చేసుకుని ప్రతిపక్షం రాకకు వేచివున్నారు.

రాక్షసులు వీర శంఖాలు పూరించారు. కపిశ్రేష్ఠులు సింహనాదాలు చేశారు. ఉభయపక్షాలు తమ తమ ప్రభువులకు జయాన్ని ఘోషిస్తూ తలపడ్డవి. సంకుల సమరం సాగింది. రామ రావణుల విజయార్థం వీరులైన శరీరాలను తృణప్రాయంగా త్యాగం చేస్తున్నారు. ద్వంద్వ యుద్ధం కొంతసేపూ, అసమ సమరం కొంతసేపూ జరిగింది. అసురులు అస్త్ర శస్త్రాలతో పోరుతుంటే, రాళ్ళు రప్పలూ, చెట్లు చేమలతో పోరుతున్నారు కపివీరులు. అయినా అసురులే చస్తున్నారు. ఆ రాత్రి అపరయామం నిశాచరాటులకు యమలోక యానంగా మారిపోయింది. ఒకవైపు అప్పుడు ఇంకొకవైపు వారికి జయిత్వం ప్రసాదిస్తున్నై. అయిణమర్దంతో రేగిన ధరాధూళి దశదిశాక్రాంతం అయింది. అశ్వ పదాతి రథఖుర పద చక్ర ఘట్టనాలతో ఇంకోవైపు రేగిన నల్లనిదుమారం కన్నులున్న చీకుల చేసింది. "ఇది తేరు, ఇది గుర్రం, ఇది ఏన్గు, వీడు రథి, వీడు సారథి, ఇది రాయి, ఇది శరం, వీడు పదాతి, వీడు తనవాడు, వీడు శత్రువు" అనే వివక్షత గోచరింపక పరస్పరాక్షేపణార్థం పలికే గావుకేకలు, పిశాచ ఘోర గణం గొణుగుడు తప్ప ఆహవరంగంలో అన్యం కనుపించటం, వినుపించటం లేకుండా అంతర్భూతం అయిపోయింది. ఆ ఘోరాంధతమిస్రంలో రాత్రించరులు తమవారినీ, శాఖాచరులు తమవారినీ చంపుకున్నారు. ఆ తుముల సమరంలో తనువుల నుంచి కారుతున్న నెత్తురుధారల్లో నేల తడిసిపోయింది. రేగుతున్న ధూళి అణిగిపోయింది. కొంత తెరిపిరాగా,

గుట్టలై పడిన గుర్రాల, ఏనుగుల, రథ సారథి భటాళి, అస్త్రశస్త్రాళి గోచరించింది. మళ్ళీ మారణహోమం ప్రారంభమైంది. నభాయుధాలతో నగచరులు నొంచితే, బహు శస్త్రాస్త్రాల రక్కసులు ద్రుంచారు. రెండవ సారి సాగిన ఖండనంలో కపులు గుక్క త్రిప్పకుండా రాక్షసులపై బడి సగానికి పైగా సైన్యాన్ని బలితీశారు. ఇంతలో వాయురహిత క్షేత్రలో వాయువు ప్రవేశించి పూరించినట్లు సర్వ సన్నద్ధంగా రాక్షస సైన్యం వచ్చి లోటు పూరించింది. ఆ వచ్చిన వారు హతశేష దళాన్ని అదుత్రొంపేసి తగవుకు తారసిల్లారు. నలుడు, కుముదుడు, మైందద్వివిదులు మర్కట యూథంతో వచ్చి సమశక్తితో సమరంలో దూకారు. పోరు ఘోరంగా మళ్ళీ జరిగింది అసుర శక్తిని మర్కటులు మన్ను తినిపించి జయ సూచకంగా సింహనాదాలు చేశారు. ఆ భయంకర ఘోషకు అకంపనుడు కంపితుడయ్యాడు.

## అకంపనుడు హనుమంతునిచే హతుడగుట

రథం తోలించాడు రౌద్రాన్నే అస్త్రశస్త్రాలకు పదును పెట్టాడు. కపి సముద్రాన్ని మందరంలాగా కల్లోలపరిచాడు. హనుమంతుడు రంగంలో దిగగానే అగచరులు ద్విగుణీకృతోత్సాహంతో ఎదుటాపోలు అసుర బలాన్ని హతంచేశారు. అకంపనుడు మారుతి నడుస్తున్నవైపు మాంసాశనులు మరణించటం చూచి ఏకాఏకి అక్కడికే తేరు తోలించి పరికించాడు. ఆంజనేయుడు మృత్యుదేవతగా మేరువు ఆకారం దాల్చినట్లు తాను ముందుండి సమరం సాగించటం చూచి జనితామర్షుడై, క్షణంలో ధైర్యం తెచ్చుకుని మేఘాలు జలాన్ని వర్షించినట్లు శరాసారం వర్షించాడు. వర్షంలో ఆబోతు కొమ్ములు వంచినట్లు మారుతి శిరం ప్రక్కకు త్రిప్పి మదగజం నడచినట్లు నడచి రాక్షసుని సమీపిస్తుంటే, వాడు, శరాలు శరీరంలో నాటుతున్నా పీకి పారవేస్తూ తనపై పడ్డానికి వచ్చే వాయుపుత్రుణ్ణి తప్పుకోలేక నివ్వెరపడి ప్రయత్నంతో ప్రక్కకు దాటాడు. వాడు పారిపోవటం వాయు సుతునకు అంగీకారం కాలేదు. "పారిపోతా! నిలు నిలు" మంటూ వెంటబడ్డాడు. తన్ను తరుముతూ వస్తున్న మహాకపిపై మారణ సాధనాలు మహోద్ధృతంగా ప్రయోగించాడు. హనుమ తనచేతిలో

ఏమీ లేదని గుర్తువచ్చి పాతుతో ఒక శైలాన్ని పీకి చేతితో తాల్చి దిక్కులదర గర్జించి గిరగిర త్రిప్పుతూ, నముచి వెంట హస్తంలో కులిశంకొని వెన్నంటిన ఇంద్రునివలె తరుముకుని వస్తుంటే, పాపపై పెక్కు బాణాలు వేశాడు. అర్ధచంద్ర శరంతో పర్వతాన్ని తుత్తునియలు చేసి అకంపనుడు అర్భటించాడు. తనచేత విసరబడ్డ ధరణీధరం ధ్వంసం కావటంతో కపివీరుడు అశ్వకర్ణ వృక్షాన్ని విసిరాడు దన్నీ కూడ దైత్యుడు భంగించాడు. హనుమ ఇది పనికాదనుకున్నాడు. అశర ప్రయుక్త శర భిన్న శరీరం నుంచి రక్తం కారుతూ పూచిన కింశుకం లాగా భ్రమకూర్చగా, వేరొక సాలాన్ని పీకి రెండు చేతులతో బలంగా పట్టి దానవుని శిరంపై పెట్టుపెట్టాడు. ఆ దెబ్బకు సురవరిపంథి నెత్తురు క్రక్కి, తలబ్రద్దలై రథం నుంచి నేలపై పడ్డాడు. వాడు చావగానే వాడి సేనను నేలబెట్టి కపులు కాలరాచారు. హతశేషులు ప్రాణాలతో లంకకు పారిపోయారు. తమ నాయకుడు దేవతలకు సాధ్యంకాని అకంపన రాక్షసుణ్ణి హత్య చేయటంతో వానరులంతా వాయు సుతుని ప్రార్థిస్తూ పూజలు సలిపారు.

## రావణుడు రణానికి ప్రహస్తుణ్ణి పంపుట

సంత్రులతో, సేనాపతులతో, యుద్ధ వార్తలు వింటూ, ప్రతిక్రియలు ఆలోచిస్తూ ఏకాంత మందిరంలో వున్న లంకేశ్వరునికి అకంపనుని మరణం కంపం కలిగించింది. నిలువునా నీరైపోయాడు. యుద్ధగతి రానురాను ప్రమాదస్థాయిలో పడుతూంది. కాలు కాలిన కోతిలాగా గంతులు వేస్తున్నాడు. "ధూమ్రాక్షుడు, వజ్రదంష్ట్రుడు, అకంపనుడు రణంలో మరణించటం గత గాథలో తానెరుగని అనుభవం. మాల్యవంతుడు, విభీషణుడు, కుంభకర్ణుడు మొగమాటం లేకుండా కుండ బ్రద్దలు కొట్టినట్లు రాబోయే దుష్పరిణామం ముందే చెప్పారు. తనలోని బలహీనత, తనకున్న వరబలం, తద్విరుద్ధ హేతువులు సమంజసంగా చూపిస్తూ సంధి చేసుకోమని చెప్పారు. తానే వినలేదు. మహారథుల ముగ్గురిని ఇప్పటికే కోల్పోయాను. ఇంకెంత మందిని కోలుపోవాలో ? తనకు విజయం కనుచూపు మేరలో కానరాదు. పైకెంత నిబ్బరంగావున్నా, తన పక్షం

వారు లోలోపల భయపడుతున్నారు. కాలం గడుస్తోంది. శత్రువులు ఇంతవరకు కోటలో ప్రవేశించలేదు. ఇక విజృంభిస్తారు. ఆపటం కష్టం" అని ఆలోచించి ప్రహస్తుని వంక చూచి, "మహా సేనానీ! ఉదయం కావస్తోంది. నేను నగర రక్షణలో నిపుణ్నమైన వారినీ, యుద్ధ సన్నద్ధులైన వారినీ పరీక్షించి వచ్చాను. కాపు గట్టిగానే వుంది. కాని, వెలుపల పోరాడేవారు లేకపోతే ఈ రక్షణ క్షణం నిల్వలేదు. అపారంగా వున్న వానర వరూధిని లంకను ఆక్రమిస్తుంది. రథిక త్రయం మరణించింది. మనవాళ్ళు కోతుల మడియించినా ఉసిళ్ళ పుట్ట పగిలినట్లు వస్తూనేవున్నారు. కోట ముట్టడి అంతకంతకు ఘోరంగా అధికం అవుతూంది. ఈ భారాన్ని తగ్గించాలంటే, నేను కాని, తమ్ముడు కుంభకర్ణుడు కాని, ఇంద్రజిత్తు కాని, నికుంభుడు కాని, సర్వసేనాపతివైన నీవు గాని సమర్థులం. ప్రతిమించకముందే ద్రుతగతి నీవు నీ వలసిన వారితో, సైన్యవాహిని నడిపించు. క్రోతులు నీ పేరు చెపితే గుండెలదరి పారిపోతై. ఆ వానరులు బెదరుగొడ్డులు, అవినీతులూ, అదరుగుండెవాళ్ళు. నీ సింహనాదాలక, నీ కోర్తలకు నిల్వలేరు. రామలక్ష్మణుల కాకున్నా సేననైనా తుడిచిపేస్తే రాముడు రెక్కలు తెగిన పక్షివలె శక్తిహీనుడవుతాడు. మనం సులభంగా జయించవచ్చు. కాక మనం ఉపేక్షించి ఊరకుంటే మందిరాల్లోవున్నా మనకు మరణం తప్పదు. రణంచేస్తే మరణం కొంతకాలమైనా ఆగుతుంది. దైవానుకూల్యంవల్ల జయంకూడ మనకు దక్కవచ్చు. ఇంటిలో నిష్కారణంగా మరణించటం మేలో, సమరంలో చావటం మేలో విక్రమాలంకారుడవైన నీవే నిర్ణయించు" అని పల్కాడు. దానికి శుక్రునివలె ప్రహస్తుడు "ప్రభూ! ఇప్పుడీ చర్చిత చర్వణం ఎందుకు? పూర్వం వాదోపవాదం జరిగిందికదా? సీతనిచ్చి సంధి చేసుకోమని ఒక వర్గం, యుద్ధమే కర్తవ్యమని ఇంకొక వర్గం ఆనాటి సభలో వాదించిందికదా? నా వాదం నీవు విన్నదే. నేను సేనాధ్యక్షుణ్ణి. నాకు రణ మర్మం తెలిపినంత రాజనీతి తెలియదు. పోరాటంలో సంధి ఎప్పుడు చేయాలో నాకు తెలుసు. యుద్ధం ముందు రాయబారంకానీ, సంధికానీ అది మంత్రులూ, ప్రభువూ చేయవలసిన కార్యం. నీ పట్టుదల, మనోభావం తెలిసినవాణ్ణి

కనుక యుద్ధం కర్తవ్యమన్నాను. మంత్రులు కొందరు అది మంచిది కాదన్నారు. మీ నిర్ణయం సమరం సాగించుమని జరిగింది. జానకినిచ్చి సంధి చేసుకుంటే నా అభ్యంతరంలేదు. రణం చేయాలంటే ఇప్పుడే పోరాడు. నన్ను అన్ని విధాల మన్నించి అధికారం ఇచ్చి ఆదుకున్న ప్రభువుకు వ్యతిరేకంగా ప్రవర్తించను. పుత్ర మిత్ర కళత్ర క్షేత్రాదులు నీకంటే ప్రియమైనవి నాకుకావు. ఈ నా గాత్రాన్ని నీవు నీ వాంఛా సిద్ధికి కల్పించిన మహారణ యజ్ఞంలో సమిధగావేస్తాను. నేను విజయుడనై వస్తానన్న నమ్మకంలేదు. నా అనంతరం నీకు విజయం సాధ్యం కాదేమో. కనుక ఆలోచించి ఆహవాన్ని నడిపించు" అని రావణునికి చెప్పాడు.

## ప్రహస్తుడు దుర్నిమిత్తాలను త్రోసి ప్రధన రంగానికి పోవుట

వెంటనే తన బలాధ్యక్షుడికి సైన్యాన్ని ఆయత్తంచేసి రథం కొని రమ్మని ఆజ్ఞ చేశాడు. తిగ్మనానాయుధ దీప్తి తిమిర ధ్వంసం చేయగా సైన్యాన్ని సంపూర్ణంచేసి తేసుకొని వచ్చి మహాధ్యక్షునిముందు నిల్పాడు. సైన్య సంచలనంతో లంకానగరం క్షోభించింది. మహాసేనాని విజయానికి బ్రాహ్మణులు అగ్నిహోత్రుణ్ణి అర్చించి, ఘృతవాసనలతో కూడిన హస్తాలతో పూజాపుష్పాలు, అక్షతలిచ్చి ఆశీర్వదించారు. వృద్ధ సుమంగళులు దృష్టితీసి వీరగంధం (రక్తచందనం) పూసి భ్రుకుటినుంచి ఊర్ధ్వంగా కుంకుమ దిద్ది హారతులు పట్టారు. మేడలపైనుంచి అసుర యువతులు సేసలు, పన్నీరుతో ముంచివేశారు. అంగరక్షకులు, వ్యూహరచనా నిపుణులు, చారులు, సర్వాలంకారశోభితులై వచ్చి స్థానాల్లో నిలుచున్నారు. ప్రహస్తుడు అధికార చిహ్నాలన్నీ ధరించి, అభేద్య కవచం, డాలు, ఖడ్గం, ధనుస్సు, శరం, తూణీరం ఆ భయంకరమూర్తిని అధికాధికంగా చేస్తూండగా రథాన్ని సమీపించాడు. సకలాస్త్ర శస్త్ర సంచయ సంయుతం, పటుతర తురంగవాహితం, రణ కళాకుశల సారథి చోదితం, నిషురాంబుధర నిస్స్వనం, ప్రత్యక్ష రవిచంద్ర భాస్వరం, హాటకజాల సమంచితం,

భయదకాలాహిధ్వజదుర్ధరం, రథగుప్తి రథాంగశోభితం, అవ్యవస్త్వప
హాసి ప్రదాపికం, అయిన అరదానికి ప్రదక్షిణించి, ఆరూఢుడై, శంఖ
దుందుభి విర్ఘోషసంకులంగా సమరక్షోణికి సాగాడు. నిరవహ్యద్వైరకంగా,
పర్వన్యాప్లావన బహుళంగా, భుజశౌర్యావష్టిత పరిపంథులైన రాక్షసులు
గర్జలుచేస్తూ క్రమగతిలో కదలిపోయారు. భీమదేహులైన నరాంతక,
మహానాద, కుంభ, హనులు స్వీయవాహినులతో అనుసరించగా ప్రాగ్దిశా
ముఖంగా పయనం సాగించాడు. ద్వారం చేరాడు. ప్రహస్తుని ప్రయాణ
ఘోష, సైన్యం సలిపే ఘోష లంకలో వున్న దానవులకు గుండెదడ
పెట్టేదంగా కూర్చింది. భూత సంతానం గూపెట్టింది. మేఘంలేని ఆకా
శంలో చంక్రమణంచేస్తూ పక్షులు రథానికి అపసవ్యంగా ప్రదక్షిణంచేసినై.
వరదులు (నక్కలు) అదమలుమినై. భీషణంగా ప్రభంజనుడు హోరు
మంటూ వీచాడు. గగనంలో గ్రహాలు ఒకదానితో ఒకటి తలపడ్డై.
ఉల్కలు రాలినై. దక్షిణముఖంగా ధ్వజాపై గ్రద్ద ముక్కుతో రెక్కలు
పొడుచుకుంటూ నిల్చింది. దివిజ విరోధితేజం అల్పంగా హరించింది.
చేతిలోనేవున్న పెలకోల సారథి హయాన్ని అదలించకుండానే జారి
పడింది. దుశ్శకునాల దాపఫలాన్ని తెలుపుతున్నా, అసురపతి ఆనందం
కోసం ఆజ్ఞానువర్తియై సర్వసేనాని సమరాంగణంలో దూకాడు. ఇంత
వరకు ఉత్తర దక్షిణ పశ్చిమ ద్వారాల్లోనే యుద్ధం సాగింది. ప్రాగ్ద్వారం
విరోధించి నిల్చిన కపిసేన కదనంలోకి రాలేదు. చెక్కుచెదరక, సర్వ
సన్నద్ధంగా వున్న రెండు సమూహాలు రంకెలువేస్తూ పోట్లగిత్తలవలె
పోరుకు సిద్ధమయ్యారు. రాముడు దూరంనుంచి రాక్షస సేనాని చూచి
దరహాసం చేశాడు.

## వనాట నిశాటుల పోరాటం

అంతకంతకు చేరువగా వస్తున్న రథంపై అతిలోక వీరుడైన
అసుర సేనానాయకుని చూచిన దాశరథి విభీషణునితో "ఆ వచ్చిన మహా
బలవంతుడెవ్వ"డని ప్రశ్నించాడు. "ఈతడే మా అన్నకు ఎంతో ప్రేమ
పాత్రుడైన సర్వ సైన్యాధిపతి. శూరులలో ప్రథమంగా పేర్కొనతగిన

వాడు. త్రిభాగ సైన్యాన్ని కలిగిన నిష్ఠురకర్ముడు. ప్రహస్తనాముడు. ప్రఖ్యాత పరాక్రముడు. దేవసేనానితో తుల్యుడు" అని సమాధానం ఇస్తుండగానే, తుముల సమర సంకేతం, ఉభయ సేనలు కలియబడటం ఒక్కసారే జరిగింది. శూలాలు, గదలు, రోకళ్ళు, కత్తులు, గుదియలు, బరిసెలు మొదలైన కైదువులతో నిశాటులు తలపడగా, గోలాంగూలులు కొండలు, గుట్టలు, చెట్లు, గండశిలలు తాల్చి ఎదిరించారు. రాళ్ళవాన, అంపవాన ఏకధాటిగా కురిసింది. ఇరువాగులవారు వ్యథార్తులై, కూకలు పెడుతూ, ఛిన్న శిరశ్శరీరులై నలిగి కూలిపోయారు. ఆ జగడం సమంగా కొంతసేపు సాగింది. శాఖాచరుల వ్రేటులకు నిశాచరులపోటులు పద్దుమణిగినై. ప్రహస్తుని బలం పలచబడింది. రాక్షస సైన్యం పిశాచాలకు బజ్జీలు, ఊరుబిండ్లు, పచ్చళ్ళు, గుజ్జులు, పెనుముద్దలుగా సజ్జనై భోజ్య వస్తువులుగా మారింది. నరాంతకాది మంత్రులు అంతకోపములై, అనంత క్రోధంతో కపిసేనను తుక్కురేగేట్టు కొట్టారు. వానరులు వారి ధాటికి నిల్వలేక వెనుకంజ వేస్తుంటే, ద్వివిదుడు శైల ప్రయోగంతో నరాంతకుణ్ణి అంతకుని చేరువకంపాడు. విధాత సుతుడు మహానాదుని యమ మందిరానికి పంపాడు. దుర్ముఖుడు పెనువృక్షంతో తల మోది సమున్నతహనుని సాగనంపాడు. తారకుడు ధరణీధ్రపాతంతో తల పగిల్చి కుంభహనుని నేలకూల్చాడు. తన నల్వురు మంత్రులు దండధరుని పురం చేరగానే, మండిపడుతూ ప్రహస్తుడు ప్రాణాలకు తెగించి పోరి వానర సైన్యాన్ని బలిగొన్నాడు. ప్రహస్తుడు ప్లవగాంభోధికి మందరమైతే, అగచరులు ఆ శరాటవికి అగ్నిహోత్రులైనారు. కీశ రాక్షస రక్తస్రోతస్వినిచే తడిసి, వసంతవేళ వికసిత కింశుక సుమభరితగా భూదేవి పోల్చింది. కూలిన వీర సైన్యం దరులై, విరిగిన ఆయుధాలు వృక్షాలై, కీలాల జాలం కీలాలజాలం (నెత్తురు, నీరు) అయి, కారిజం, ప్లీహం, బురదై, ప్రేవుల ప్రోవులు శైవాలమై (నాచు) హస్త పాద ఖండాలు చేపలై, గాత్రాంగాలు కడిమిపట్టై, గ్రద్దల గుంపు రాయంచలై, రాబందులు ఉయ్యేల పులుగులై, మెదడు నురుగై, ఏడ్పులు కలిసే,

నదాలై, వైతరణిలాగా కాపురుషదుస్తరంగా మహాహవవాహిని పారింది. శారద రాత్రుల్లో హంస సారసచయం, సరోవరాన్నివలె ధీరులూ,వీరులూ అయిన వానర రాక్షస ప్రముఖులు ఆ నది తరించారు.

## నీలుడు ప్రహస్తుని చంపుట

అడ్డం ఆపులేక, ఎవ్వరూ ఎదిరించేవారులేక అచ్చుపోసి విడిచిన ఆబోతు వలె ఆ స్యందన ధాత్రిలో స్యందనాన్ని తోలిస్తూ సంచరించే సర్వ సైన్యాధిపతియైన ప్రహస్తుణ్ణి సర్వ వానరానీకాధిపతియైన నీలుడు నిలువరించాడు. ఒకడు రథి. ఒకడు పదాతి. ఒకడు సర్వాస్త్ర శస్త్ర సంపన్నుడు. ఒకడు పర్వతవృక్ష ప్రయోగకుశలుడు. ఒకడు రాక్షసుడు. ఒకడు వానరుడు. ఇరువురూ సేనాధ్యక్షులు. ఇరువాగుల ఇద్దరూ ప్రాణ సమానులు. ఇద్దరి ఆశయం పరస్పర వధ. అహంకారంతో హుంకారం చేస్తూ, ధనుష్టంకారం జోడించి, నిశాచరుడు వనేచరుని మేను రక్తసిక్తంగా చించివేశాడు. ఉద్దండ మార్గణ కాండాలతో కపిసేనను దుమ్ము దులిపాడు. అతని పోటుకు నీలుడు కాలుడైనాడు. సాలం ధరించాడు. అసురుని అలక్ష్యం చేస్తూ చేరబోయి తల దిమ్మెక్కేట్లు వెన్నుపాము విరిగేట్లు ఒక దెబ్బతీశాడు. సింహనాద బధిరిత దిగ్గజ సంతానమై, శర ధారా కల్లోలినిలో అసురుడు నీలుణ్ణి ముంచాడు. నీలుడు ముహూర్త కాలం నిశ్చేష్టుడైనాడు. ఆ సారానికి వృషభంవలె కన్నులు అరమోడ్చి, దోస్సారం ఊతగా నిల్చి అవకాశం రాగానే అమాంతం రథంపై దూకి గుర్రాలను చంపాడు. చేతిలో చాపం గుంజుకుని విరిచి ముక్కలు చేశాడు. గుండెమీద బలంగా గుద్దాడు. శరాసన శూన్యుడైన అసుర నాయకుడు గదతో భూమికి దూకాడు. గదా సాధనంతో కయ్యానికి దిగిన శత్రువును కాలు చాచి రొమ్ముపై తన్ని అడుగు ముందుకు రాకుండా ఆకట్టాడు. ఇద్దరు ఇప్పుడు పదాతులే. ఎవరికి ఎవరు తీసిపోకుండా మల్ల యుద్ధం చేశారు. ఇరువురి శరీరాలు పగిలి నెత్తురు కారుతున్నా అలుపు సొలుపు లేకుండా పోరారు. కొమ్ముటేనుగుల్లాగా హుమ్మని ఒకమాటు ఢీ కొన్నారు. గొర్రెపొట్టేళ్ళ వలె వెనుకకుపోయి ఉరవడితో వచ్చి ఠకీమని ఒకమాటు తలలు కొట్టుకున్నారు. పందెపు కోడిపుంజుల్లాగా పట్టుదలతో

చుట్టు తిరుగుతూ ఒకమాటు ఒకరినొకరు తన్నుకున్నారు. అచ్చుబోసిన ఆబోతుల్లాగా, సింహాలవలె, పెద్దపులుల చందంగా పోరి విశ్రాంతికోసం విడివడి నిల్చున్నారు. కనురెప్పకాలం దృష్టి సడలిన నీలుణ్ణి రాక్షసుడు రోకలితో ఫాలం పగిలేట్లు బాదాడు. కన్నులు పైర్లు క్రమ్మగా, బొట బొట శోణితం స్రవించగా నీలుడు ప్రహస్తుణ్ణి సాలంతో చావు దెబ్బ కొట్టాడు. వాడు ముసలం రెండు చేతులతో పట్టి పైకెత్తి నీలుని తల పగులకొట్టటానికి పటు వేగంగా వస్తుంటే పెద్ద గండశిల శిరాన్ని లక్ష్యంగా చేసుకుని చేకొద్ది విసిరాడు. ఆ రాతి దెబ్బకు తల సహస్ర శకలాలుకాగా ప్రహస్తుడు పుడమిపైపడి ప్రాణాలు విడిచాడు. కట్ట తెగిన నీటిలాగా రక్కసులు తమ నాయకుడు మరణించగానే కాలు నేల నిలువలేక లంకకు పారిపోయారు. ధ్యానమూకత్వమున తెలివితప్పినట్లు, శోక సాగరంలో మునిగి, వెర్రిచూపులతో, వెదలే కన్నీటి ధారతో రావణుని సమక్షంలో చావుదప్పినవారు కొందరు వచ్చి నిల్చారు. జగదాశ్చర్యకరంగా నీలునిచే ప్రహస్తుడు నిర్గటం ప్రభువుతో చెప్పలేక కొట్టుమిట్టాడుతున్న భట వర్గాన్ని చూచి రావణుడు కూడ స్తంభీభూతుడైనాడు. నీలుని విజయానికి కపిలోకం ఉత్సాహంతో పొంగిపోయింది. రాముడు అభినందించాడు. సౌమిత్రి ప్రశంసించాడు. కపులు పూల కొమ్మలు విరిచి తెచ్చి నీలుణ్ణి పుష్పాభిషేకం చేశారు.

## రావణుడు మొదటిసారి యుద్ధానికి పోవుట

కింకర్తవ్యతామూఢుడైన పంక్తిగ్రీవుడు వచ్చిన భటులచే ప్రహస్తుని మరణం విని క్రోధంతో ఒడలు కంపిస్తుండగా, దేవసేనతో ఇంద్రుడు పల్కినట్లు, వాళ్ళను చూచి "దేవ సైన్యాన్ని దిక్కులేకుండా చేసిన ప్రధాన కర్కశుడు నా చమూపాలుడు ప్రహస్తుడా కోతి చేతిలో చావటం? వెంటపోయిన రాక్షసానీకం రథ గజ తురగ భట బృందంతో మచ్చుకు కూడా లేకుండ మరణించటం? ఇది వింతలో వింత. కోతులు రాక్షసులను చంపటమా? ఇక ఉపేక్షించటం ఉత్తమ లక్షణం కాదు. చూస్తాను. నేనే యుద్ధానికి పోతాను. వనాటులు నిశాటులను ఎలా చంపుతారో పరిశీలిస్తాను. నా సైన్యం నిర్మూలమైనట్లే రాముని

సైన్యం నిర్మూలం అయితీరాలి. ఎవడురా యుద్ధంలో నన్నెదిరించి బ్రతికేది? దూదిలోపడ్డ వహ్నికణంలాగా కోతి గుంపును రూపుమాపుతాను. ఇంత స్థితికి తెచ్చిన ఆ మానవాధములకు నా శరాల వాడి, వేడి చూపిస్తాను. ఇంక సహిస్తానా?" అని సాలంకృతమైన రథంపై ఆసీనుడై, పణవ శంఖ భేరీ ఝంకారాలు, సింహనాదాలు హోరెత్తగా సమరకుతూహలుడై సంగర భూమికి వెళ్ళాడు. కదన భూమికి అల్లంత దూరంలో రథం నిలిపి పర సైన్యాన్ని పారచూచాడు. భూజ శైల హస్తులూ, ఉన్నత జల ధర ఘోషులూ, దృష్టిభీకరులూ అయిన కపీంద్ర సైన్యం గోచరించింది. ఫణి పతి పోలిన బాహుయుగ్మం కలవాడు, నగచర యూథ పరివృతుడైన రాముడు, ససైన్యంగా యుద్ధాభిలాషతో వచ్చిన మహా మూర్తిని చూచి, రావణానుజునితో "మిత్రుడా! అనేక కేతన జుష్టం, అనేక మారణమార్గణాభీలం, పరిహసిత దిగ్గజ బృంద పరివృతం, అనంత వీర భట వితాన భీమం అయిన ఈ సైన్యం ఎక్కడిది? దీనికి అధిపతి ఎవ్వడు?" అని సాభిప్రాయంగా అడిగాడు.

## విభీషణుడు రాక్షసవీరుల నిరూపించి రామునకు చెప్పుట

రామచంద్రుడు క్రొత్తగా ఆహవానికి అపారంగా వచ్చిన అసుర సైన్యాన్ని, దాని అధిపతులను విభీషణుడు వేరువేరుగా చెప్పసాగాడు. "రామప్రభూ! అమర దంతావళంపై ఆసీనుడై వచ్చినవాడు మా అన్న కుమారుడు అకంపనుడు. చూచావా అతని మూర్తి? పొడుపు కొండపైకి వచ్చిన సూర్యునివలె భాసించే ముఖం, ఆ శౌర్యం, ఆ దోర్దర్పం, ఆ దుర్ధర తేజం, ఆత్మభార సంచలిత వేదండోత్తమాంగం, ఆ ధనుర్విలసిత హస్తం? వజ్రంతో సమానమైన ధనువు ధరించి, సింహపతాకంతో ప్రకాశించే రథంఎక్కి మనలను అలవోకగా చూస్తున్నాడే వాడే ఇంద్రజిత్తు. సర్వ మాయాస్వరూపి, ధాతృవర బలాజయ్యుడు. అతిరథశ్రేష్ఠుడు, ఆత్మ శరాసనటంక్రియోద్యోగుడు, అస్త్ర మహేంద్ర వింధ్యపర్వతాకారుడు, శతాంగగతుడు, ఆహవ రంగంలో అనాహతుడు, అద్భుత

కర్ముడు, వాడే అతికాయుడు. వహ్ని ప్రతిమాననేత్ర యుగళుడు, ఘంటికానిస్వనాభీల స్తంబేర (ఏనుగు) వాహనుడు, కంఠారావవిజిత ఖర సహస్రనాదుడు, రామచంద్రా! లోక భయంకరమైన మహోదరుడు. గాంగేయావిష్కృత (బంగారంతో చేసిన) కుంతాన్ని చేతితోపట్టి, సంధ్యా సమయంలో అరుణరాగ రంజితమైన అభ్రంవంటి గుర్రాలతో కూడిన అరదంపై సమర వ్యాయామం కోసం కోరివచ్చిన వాడే సీతాపతీ! పిశాచుడు. ఈశ్వర వాహనంవంటి ఆబోతుపైనెక్కి, మెరపులాగా మెరిసే శూలాన్ని కేలగిలించి వస్తున్నవాడే త్రిశిరుడు. ఆతడి పరాక్రమం జగత్ప్రసిద్ధం. ఫణిరాజ చిహ్నంతో ప్రకాశించే కేతనంతో, తారసదృశ చాపంతో, ప్రచండ విక్రమంతో వచ్చేవాడే కుంభుడు. అన్ని విధాల అన్ననుబోలిన ఆ భీకరాకారుడు పరిఘపట్టి వస్తున్నాడే వాడు నికుంభుడు. ఆకాశం అంటే రథకేతనంతో, పవనజవంగల తురంగాలతో, సర్వాస్త్ర మండితమైన తేరెక్కివచ్చేవాడు నరాంతకుడు. సర్వశార్దూల హయమృగ సింహోష్ట్ర ఖర ముఖాలుగల భూతాలు శంకరుని భూతగణంలాగా బలిసి కొలువగా, సూక్ష్మశలాకా సుందరం, సోమసంకాశం, శుభ్రాతపత్రం శోభించగా, రత్నస్థగితకిరీటకాంతులు మిరుమిట్లుకొల్పగా, చలత్కుండలాలు తళతళలాడగా, సహస్ర విస్ఫూర్జితా శోభితంగా దృగ్దుస్సహంబైన రథంపై ఆరూఢుడై, అపర తపనమూర్తివలె వెలుగుతున్న వాడే దిక్పాలదర్ప హంత, లంకాధిపతి, రావణుడు" అని వివరం చేశాడు.

## రావణుని చూచి రాముడు ఆశ్చర్యపడుట

విభీషణుడు చెప్పిన పలుకులువిని రాముడు విస్తుపోయాడు. "ఓహో! ఏమి తేజం? ఏమి పరాక్రమం? మధ్యందిన మార్తాండునివలె ఈతడు నిర్నిరీక్ష్యుడుగా ఉన్నాడు. దేవతల్లో కాని, దానవుల్లో కాని ఈ తేజోమయ రూపం ఉన్నట్లు విననుకూడ లేదే? ఈ ప్రకాశం సృష్టిలో ఎవ్వరికీ లేదంటే అతిశయోక్తి కాదు. ఆహా! ఈతని పరివార వైభవం! అందరు శైలశృంగాభులు. అందరు నగయోధులు. అందరు ఆయుధహస్తులు. అందరు ప్రదీప్త తేజులు. ఇంత బలపరాక్రమ సంపన్నులైన వీరులు ఉండటంచేతనే లోకకంటకుడైనాడు. ఇటువంటి సుసంపన్న

మైన సేనాసహాయతకలిగి సుగ్రీవునివలె సుఖంగా తనదేశాన్ని పాలించు
కుంటే ఎంత బాగుండేది? ఈ దుష్టుడు దైవవశంచేత నా దృష్టిగోచరు
డైనాడు. ఇంకెక్కడికి పోతాడు? సీతాపహరణంచేసి నాకు అమిత వ్యధ
కూర్చిన వీడు విజయగర్వంతో లంకలో ప్రవేశిస్తాడా?" అని అవమాన
సంజనిత రోషకషాయిత నేత్రద్వంద్వుడై, ధనువును నారితో కూర్చి
శరం వేసి పట్టి సుమిత్రపట్టి ప్రక్కనివ్వగా ఆహవార్పితచిత్తుడై అసురపతి
రాక నిరీక్షిస్తున్నాడు. దశవదనుడు తన్ను పరివేష్టించి వచ్చిన అతిరథ
మహారథులను ఆలోకించి "శూరులారా! మీరంతా నగరానికి పొండి.
నగర రక్షణలో నిమగ్నులుకండి. ఉన్న వీరులంతా ఇక్కడికి వచ్చా
రని పగవాళ్ళు గ్రహిస్తే పట్టణంలో ప్రవేశించి పాడుచేస్తారు. ఇంత
మంది వీరులు పోరాడవలసిన అవసరం లంకేశ్వరుడు స్వయంగా రణ
భూమిలో నిలిస్తే అవసరమని మీరనుకున్నారా? అక్కరలేదు. అవసరం
వచ్చినప్పుడు రావచ్చు. ఇప్పటికి సుఖంగా పొండి. శత్రువులు చొరబడ
కుండా నగరం కాపాడండి" అని యోధులను పంపివేసి, టీవిలో నుండి
సముద్రంలోకి దిగే తిమింగిలంలాగా కీశసైన్య సాగరాన్ని చీలుస్తూ
రణభూమిలో రాక్షసనేత చొరబడ్డాడు.

## రావణుడు సుగ్రీవాదులతో పోరుట

రావణుడు రణరంగంలో దూకి సరస్సును మదగజం కలచినట్లు
కలచివేస్తుంటే సూర్యసుతుడు జృంభన్మహారోషుడై బాహాటోపంబహిర్గతం
కాగా మార్గనిరోధం చేయటానికి పర్వతాన్ని పంక్తిముఖునిపై విసిరాడు.
వింశతిభుజుడు రుక్మపుంఖామిత వేగవిశిఖావళితో చాపకళా ప్రవీణత వెల్లి
విరియగా మధ్యలోనే శతధావికలం చేశాడు. అంతతో ఆగక వాన
రేంద్రుణ్ణి వధించాలనే సంకల్పంతో, వాసవాయుధతుల్యం, మారు
తుల్యవేగం, పావకతేజం అయిన భాసురమార్గణాన్ని గాఢముష్టి ఆకర్ణాం
తంలాగి హృదయకవాట విపాటనంగా సూటిగా నాటాడు. షణ్ముఖునిచే
విసరపడ్డ శక్తి క్రౌంచాద్రిని ఛేదించి వెలికి వచ్చినట్లు సూర్యసుతునిగాడి
పారింది. ఆ శర తీవ్రాఘాతానికి పెనుబొబ్బపెట్టి భూమిపై పడిపోయాడు.
వానరపతి పుడమి పడిపోగానే రాక్షససైన్యం అట్టహాసం అంతరిక్షం

నిండగా ఘోరంగాచేసింది. ప్రభుపతనం సహించలేక జ్యోతిర్ముఖ గవయ గవాక్ష ఋషభ సుదంష్ట్రులు ఒక్కటిగాచేరి జలధరం వర్షించినట్లు పర్వతవర్షం పంక్తిముఖునిపై కురిపించారు. రావణుడు శరజాలంతో గిరులను చూర్ణంచేసి, వారి తనువుల జల్లెడవిధంగా శిలీముఖాలతో రంధ్రాలు చేశాడు. ఆ తీక్ష్ణశరఘాటికి నిలుపరించలేక మహాబలశాలులు మహిమీద వ్రాలారు. అసురనేతను ఆపేవారులేకపోవటంతో వీరవిహారం చేస్తూ కపిసైన్యాన్ని కాలాంతకుని పురానికి పంపాడు. చచ్చినవారు చావగా, మూర్ఛిల్లినవారు మూర్ఛలో వుండగా, తక్కిన సైన్యం భయంతో పారిపోయి, దీనశరణ్యుడైన రామునిచేరి "పాహి పాహి రామప్రభూ!" అంటూ కేకలు పెట్టారు. రాముడు భక్తరక్షణ దీక్షాప్రశస్తమైన దక్షిణ హస్తంచాచి అగచరులకు అభయం ఇచ్చాడు.

## లక్ష్మణుడు రావణునితో పోర రాముని వేడుట

కోదండాన్ని సజ్యంచేసి శరం తొడగపోతున్న అన్ననుచూచి సౌమిత్రి పరమార్థమైన సూక్తులతో "అన్నా! ఈ క్రూరకర్ముణ్ణి చంపటానికి నీవే అర్హుడవు. అయినా, నాకీ అవకాశం ఇచ్చి నా కోరికతీర్చు. నన్ను మీరితే నీవు ఉండనే ఉన్నావు కదా?" అని ప్రార్థించాడు. ఆ మాటలకు సత్యపరాక్రముడైన రాముడు "సోదరా! నీవు కోరితే ఈయగలదేముంది? ఎన్నడు కోరని నీవు నాకై యుద్ధభిక్ష కోరావు. అదికూడ నీ త్యాగాన్నే సూచిస్తుంది. రాక్షసులు మాయావులు. అందులో ఇంద్రజిత్తు ఆరితేరినవాడు. రావణుడు అంతకంటె ఘనుడు. ఏమరుపాటువద్దు. ఈతని విక్రమం మూడు లోకాలకు విదితమే. ముందు ఆతని లోపాలు గ్రహించు. నీలోపాలు వానికి తెలియనీయకు. చాపానికికన్నులు కల్పించి ఆత్మరక్షణ చేసుకుంటూ యుద్ధంసాగించు. నా ప్రతిరూపమైన నీకు రణమర్మాలు చెప్పనక్కరలేదు. నీవు తీవ్ర కోపంలో లక్ష్యాన్నేకాని లోకాన్ని చూడవు. అందుకు మాత్రమే నా హెచ్చరిక. అప్రమత్తుడవై అతనితో తలపడు. మళ్ళీ హెచ్చరిక చేస్తున్నాను" అని ఆదరపూర్వకంగా అనుజ్ఞ ఇచ్చాడు. రాముని ప్రియమార కౌగిలించుకుని, ప్రదక్షిణపూర్వక పాదాభివందనంచేసి, రణ కుతూహలంతో రావణునకు అభి

ముఖంగా పోయాడు. పోయి, భీమకాండాసనుణ్ణి, ఆశీవిషమార్గణావ్యాదితనిజ సైన్యనివహుణ్ణి, శితశరవ్రాత నిర్భిన్న శరీర రవాక్రాంత దిగ్భాగుణ్ణి, రావణుని రక్తాంత లోచనుడై వీక్షించాడు.

## హనుమద్రావణ సంగ్రామం

సంగరోత్సాహంతో వచ్చిన సౌమిత్రినికాంచి సమీరపుత్రుడు అడ్డంగాపోయి, రావణుడు ప్రయోగించే అస్త్రాలను తోకతో చెల్లాచెదురుగాచేసి, పళ్ళు పటపటలాడిస్తూ, పంక్తిముఖుని తేరిపైకి ఒక్కఉదుటున లంఘించి, దక్షిణహస్తం పైకెత్తి, చూపుల వేడితో శరీరాన్ని మరిగిస్తూ “ఓరీ రావణా! నాగయక్ష దానవ సురరాక్షస ఖగాదులచే చావకుండా వరాలు పొందావుకాని, నరవానరులచే నీకు చావులేకుండా కోరలేదు కనుక మృతి నీకు తప్పదు. ఇదిగో ఎత్తిన నా కుడిచేతిని చూడు. ఇది పంచశాఖాన్వితం. ఇంతకాలం నీ శరీరంలో వుండి లోకపీడాకర కార్యాలు చేయించిన ప్రాణాలు విడిచిపోయేటట్లు చేయటంకోసం ఎత్తాను. స్థిరుడవై నా గుద్దు కాచుకో. ఏమంటావు?” అనగానే, రావణుడు ఆగ్రహించి “ఓరీవానరుడా! నేనూచూస్తాను. నీవెంతబలశాలివో? ఏదీకొట్టరా. అనుమానించక కొట్టి తరుగని యశం పొందు. నీ శక్తి తెలిసిన పిదప నీ మరణాన్ని కూర్చి ఆలోచిస్తా” నన్నాడు. “నాచేత దెబ్బ తిని ఆలోచించే అవకాశం కలగటం కష్టం. లోగడ నాచేత చచ్చిన అక్షయుణ్ణి మనస్సులో ఒక మాటు స్మరించుకుని మరి మాటాడు” మన్నాడు పావని. “అయితే ముందే నా శక్తి రుచి చూడు. నీవు బ్రతికితే నీ బాహుబలాన్ని నేను చూస్తా” నంటూ వింశతిభుజుడు పావని వక్షస్థలాన్ని గాఢతమతాడన పీడితం చేశాడు. ఆఘాతానికి హనుమ నిలువునా కంపించిపోయాడు. నిమిషార్థంలో నిగ్రహించుకుని, స్థైర్యాన్ని సంగ్రహించి, తీవ్ర కోపంతో, చండ్ర నిప్పులు కన్నుల్లో కురుస్తూ, కాండ్రిస్తూ మొగంపై, ఓండ్రపెట్టగా ఒక్క గ్రుద్దు గ్రుద్దాడు. ఆ హనుమ కొట్టిన దెబ్బకు దశశిరస్సులు, వింశతి నేత్రాలు, వింశతి భుజాలు, పర్వతంవంటి కాయం, భూకంపానికి పర్వతాలు ప్రకంపనం పొందినట్లు పొంది వచ్చేపోయే ప్రాణంతో ఒడలు తెలియని స్థితిలో రావణుడు ఉండిపోయాడు. ఆ స్థితిలో వున్న అసురాధి

పతినిచూచి, అమరులు, మహర్షులు హర్షవార్ధి మగ్నులై హనుమ శౌర్యాన్ని కొండాడారు. రావణుడు తన చావు హనుమతో కానందువ కొండొకపడి తెప్పరిల్లాడు. "మేలు మేలు. భళీభళీ. నీవు నాకు శత్రు స్థానీయుడవైనా, నీ బాహుదర్పాన్ని, నీ అమిత దుస్సహ శక్తినీ మెచ్చు కున్నాను. నీవు దంటి మగటివే. సూనృతవాదివే. చెప్పినట్లు చేసే అధి కారివే" అంటూ శ్లాఘించాడు. హనుమ అప్రస్తుతులకు లజ్జపడ్డాడు. "ఓరీ రావణా! ఎందుకురా నన్ను మెచ్చుకుంటున్నావు? ఛీ ఛీ! ఇదేమి దెబ్బ? ఇంకా బ్రదికే వున్నావు. ఎందుకు నా భుజబల శౌర్యాలు? కాల్పనా? పోటుల్లో తారతమ్యం, నూటీ తెలియని మూర్ఖుడవు. నన్ను ఈసారి నీ వారందరినీ తలచుకుని గుద్దు. ఆపై నా పిడికిటి పోటుతో నీ చావు కళ్ళ చూస్తాను. ఎదిరా నీ ఇష్టం వచ్చిన చోట పొడుస్తావో, గుద్దుతావో నీకు తోచిన విధంగా చేయి. మళ్ళీ నేను గుద్దేలోపల మరణ దేవతాస్మరణం చేయి. పారిపోయి అపకీర్తి తెచ్చుకోకు" మని హెచ్చ రించగా, దానవపతి శక్తినంతా కూడదీసుకుని దక్షిణ బాహు ముష్టితో హనుమ ఉరాన్ని తాచాడు. ఆ పోటుకు హనుమ దదరించాడు. మళ్ళీ నిలద్రొక్కుకుని, తన తండ్రినీ, రాముణ్ణీ, సీతామాతానూ స్మరించి కుడి చేయి పైకెత్తాడు. ఈ లోపల రావణుడు రథం దూరంగా తోలించి నీలునితో తలపడ్డాడు. పారిపోయిన పంక్తికంఠుణ్ణి చూచి "ఓ పారు బోతా! మాట నిలకడలేని మాంసభోజీ! పారిపోయి ప్రాణాలు దక్కించు కున్నావు. ఈసారి నా దెబ్బ తింటే బ్రదుకవని నీకు తెలిసే తప్పించు కుని పోయావు. నన్ను దాటినా, మా రామప్రభువు దృష్టిలో నుంచి తప్పుకోలేవు. నీ చావు ఆయన చేతుల్లోనే వుంది. పోపో" అంటూ తను పూర్వం నిల్చిన స్థానానికి పోయాడు. ఇది చూస్తూ వున్న కపిసేన హనుమ దివ్యపరాక్రమాన్ని, సాహసాన్ని వేనోళ్ళ నుతించింది. లోక కంటకుడన్న పేరు మోసిన రావణుని పాడుబోతుతనాన్ని గేలి చేసింది.

## రావణుడు నీలునితో యుద్ధం చేయుట

హనుమంతుని ముష్టిఘాతాన్ని తప్పించుకుని అసురేశ్వరుడు మృత్యుముఖంనుంచి బయటపడ్డవానిగా తన్ను నిభావించుకు, తొందరగా

రథం తోలించుకుని, కపి సేనాపతి నీలుణ్ణి తాకాడు. మర్మ భేదకాలైన మార్గణాలు కురిశాడు. నీలుడు, తనపైకి వచ్చి శర ప్రయోగం చేస్తున్న నిశాచరనాథునిపై గిరీంద్రాన్ని గిర గిర త్రిప్పి విసిరాడు. ఈ లోపల పావని స్మృతికలవాడై, నీలునితో పోరుతున్న రావణుని చూచి. "అయ్యో! తప్పించుకుపోయాడు. వాడికి ఇంకా కాలంతీరే సమయం కలిసిరాలేదు. ఇతరులతో యుద్ధంచేస్తున్నవాడిపై పడరాదు. మళ్ళీ అవకాశంవస్తే వాడి మరణం నా చేత తథ్యం" అని విచారించాడు. అక్కడ రావణుడు నీలునిచే విసరబడ్డ పెనుకొండను బాణాలతో పగులకొట్టాడు. నీలుడు తెరిపిలేకుండా శైల వృక్షసారం కురిపించాడు. వాటినన్నింటిని మధ్యే మార్గంలోనే ఖండించి ఏకలక్ష్యంగా అసురపతి నీలుని మీద అంపవాన కురిశాడు. నీలుడు తన దీర్ఘకాయాన్ని క్షణంలో హ్రస్వీకరించి ఎగిరి ధ్వజంపైకి దూకాడు. "ఎక్కడికి పోతావు? అంతక నిలయంలో నీ కోసం అన్నీ సిద్ధపరచాను. ఆతిథ్యం తీసుకోపో"మ్మంటూ, ధనుష్టంకారం చేయబోతుండే, నీలుడు సింహగర్జనంచేసి, నాగముమీదా, కేతనంమీదా, తలమీదా, గుర్రాలమీదా, సారథిమీదా, తుదకు రావణుని చాపంమీదా దూకుతూ, ఇటుచూస్తే అటూ, అటుచూస్తే ఇటూ దూకి లంకేశుని లక్ష్యాన్ని భంగిస్తూ సారథిని చావుదెబ్బ కొట్టాడు. గుర్రాలను నేలకు త్రొక్కాడు. నీలుడు చేస్తున్న వింత యుద్ధం రావణునికి చెవిలో జోరీగ లాగా తోచకుండా చేసింది. కలవరపాటునుంచి తేరుకున్న రావణుడు తన మాయాబలంతో నీలుడున్న చోటు గుర్తించి "ఓరీ కోతిగాడా! నీ మాయ చేష్టలు మహా మాయావినైన నా వద్ద సాగుతవా? నీ వెంత ఎగురు లాడినా, కుప్పిగంతులువేసినా ఈ అస్త్రం నీ ఆటలు కట్టిస్తుంది" అంటూ అనలాస్త్రాన్ని అరిపోసి ప్రయోగించాడు. ఆ అగ్నిశరంసోకగానే నీలుడు స్మృతిహీనుడై నేలపడిపోయాడు. అగ్ని అంశతో జన్మించినవాడుకనుక, బల సంపన్నుడు కనుక ఆ వహ్నిశరానికి కాలిపోకుండా బ్రదుకకలిగి నాడు. నీలునిపాటు చూచి రావణుడు ముందుకు రథం తోలించాడు.

# రావణ లక్ష్మణ సంవాదం

మురజ ధ్వనిలాగా రథం ఘోషపెడుతూ లక్ష్మణాభిముఖంగా పోతుంటే కపివీరులు మధ్యలో అడ్డుపడుతూ సౌమిత్రిని చేరకుండా చేయాలని ఎంతో ప్రయత్నించారు. కాని, పంక్తిముఖుని బాణప్రసారాన్ని నిలువరించ లేక కొందరు పసీల్గారు. మరికొందరు భగ్నతనులైనారు. ఇంకా కొందరు రక్షణలేక పారిపోయారు. తన వారు శాత్రవశరాగ్నికి ఇంధనాలుగా అవుతుండటం చూచి సహించలేక సౌమిత్రి తానే కల్పించుకుని, శరశరాస నాలు ధరించి మూర్తికొన్న ఆదిశేషునివలె శ్వాసలు విడుస్తూ, "ఓరీ క్రూరా! నిశాటా! ఆగు. అక్కడే ఆగు. అడుగు ముందుకువేసి అంతక నిలయానికి అతిథివికాకు. సామాన్య సైన్యంపై నీ ప్రతాపం చూపిస్తే ఎవరు మెచ్చుతారు. నా అన్న అనుమతితో నీతో ద్వంద్వయుద్ధానికి వచ్చాను. నా పేరు లక్ష్మణుడంటారు. త్రిలోకాలను జయించావట! నీ కెదురునిలిచే వీరుడేలేడట! మా హనుమంతుని రెండో గ్రుద్దుతినకుండా పారివచ్చిన నీ పరాక్రమం ఎంతటిదో మాకు తెలియనే తెలిసింది. ఏదీ నీ శరకౌశలం? ఏపాటిదో నేనూ చూస్తాను. ముందు నీవే అస్త్రప్రయో గం చేయి. ఆపై నేను చేస్తాను" అని మేఘగంభీర ఘోషణంగా పలి కాడు. ఆ రౌద్రమూర్తినీ, ఆ గుణధ్వనినీ, ఆ సాహసాన్నీ నిరాదరించి "ఓ మానవ బాలకా! ఎవరితో ప్రసంగిస్తున్నావో ఎరుక పరుస్తాను. నీకు విపరీతబుద్ధిపుట్టి నీ అన్నకు మారుగా నీవు వచ్చావు. అతడువస్తే కొంతకాలమైనా నీ ఆయుష్కాలం మిగిలేది. పాపం. అది ఇప్పుడే ముగించుకో తలచినట్లున్నావు. నరయుద్ధంలో నా దృష్టినుంచి తప్పు కోక నిల్చో. నీవో నేనో యమలోకానికి అతిథులుగా పోయేది ఇప్పటి కిప్పుడే తేలుతుంది" అని రావణుడు వికటహాసం చేశాడు సౌమిత్రి ఆ మాటలకు విలువనీయకుండా "ఆత్మశ్లాఘ పరాయణులంతా విన్న ఇక ముందు గురువుగా భావించేట్లు పలికావు. ఈ అధిక ప్రసంగం ఎందుకు చేస్తున్నావో నీకే తెలియాలి. నేను నిన్ను శర ప్రయోగం చేయమంటే నీవు వికత్థనాలు (ఆత్మస్తుతులు) ప్రయోగిస్తున్నావు. నీ పూర్వ విక్ర మాలు నాకు తెలియకపోయినా తెలిసినవి కొన్నివున్నై. మా పావని నీ

కొడుకును చంపి, నిన్నెదిరించి, నీ లంకకాల్చి నిరుపద్రవంగా రావటం. మేడపైనున్న నిన్ను మా కీశనాథుడు కిరీటం పడదన్ని నిన్ను నిస్తేజుణ్ణి చేసి నిరాటంకంగా రావటం. మా యువరాజు అంగదుడు నీ భటులను చంపి, నీ ప్రాసాదం కూలదన్ని రావటం. మా పావని ముష్టికి ధనపతి పదునితో తలపడటం. ఇవి నీవు కాదనలేని పౌరుష ప్రదర్శనం. నేను నీతో రణంకోరి వచ్చాను. నా చేతిలో శరచాపాలున్నై. నీకిష్టమైతే యుద్ధంచేయి. కాదంటే లంకకుపోయి సింహాసనం ఎక్కు. వంది మాగధులకైవారం వింటూ వుండవచ్చు" అని రావణునకు ప్రత్యుత్తర మిచ్చాడు.

## రావణ లక్ష్మణుల యుద్ధం

లక్ష్మణుని పల్కులకు రావణుడు నిరుత్తరుడైనాడు. భిన్నుడై నాడు. లజ్జితుడైనాడు. పట్టరాని కోపంతో పండ్లుకొరికాడు. మేరుసన్నిభ చాపం సజ్యంచేసి విషసదృశాలైన బాణాలు ఏరించి లక్ష్మణునిపై ప్రయోగించాడు. అవి నడుమనే అంతర్హితమైనై. ఎన్ని బాణాలు రావ ణుడు వేసినా లక్ష్మణుని బాణాలు దరికి రానీకుండా ధ్వంసం చేస్తున్నై. అంతకంతకు అసురపతికి అవమానం హెచ్చుతోంది. ఇరువది చేతులకు పని కల్పించాడు. ఆ అస్త్రాలను సౌమిత్రి కర్ణిభల్లక్షుర కాండాలు వేసి, అర్ధ చంద్ర మార్గణాలు పరపి తునాతునకలు చేసి కసికందకుండా నిశ్చ లంగా నిల్చున్నాడు. ఎన్ని మారణాయుధాలు వేస్తున్నా చెంతకురాకుండా ఛేదిస్తున్న లక్ష్మణుని హస్త లాఘవానికి అసురపతి అబ్బురపడ్డాడు. అదిరిపడ్డాడు. సౌమిత్రి శత్రుచాప విముక్త శిలీముఖాలను ఖండించి ఖండించి, తన శక్తి చూపతలచి అగ్ని సంకాశ మార్గణాలను అవ్యా హతంగా ప్రయోగించాడు. నిశాటపతి వాటి నన్నింటిని రూపుమాపి, బ్రహ్మదత్త దివ్యాస్త్రాలు లలాటం లక్ష్యంగా విడిచాడు. అంతటి శక్తి కలిగిన వివిధాస్త్రాలతో ఆ శరాలను విధ్వంసంచేసి, చేతిలోని శరాసనాన్ని త్రుంచి మూడు బాణాలు గుండెలు బద్దలయ్యేలాగా నాటాడు. ఖండీభూత చాపుడు, రక్తక్లిన్నగాత్రుడు, మేదోంధ వ్యాప్త శరీరుడు, అసంజ్ఞుడు అయి, తెలివి ఎట్టకేలకురాగా, "ఇక ఈతనితో యుద్ధం అవసానకాలాన్ని

సమీపించటమే." అని భావించి, ఒకవంక బ్రదుకుపై తీపి బాధింప, వేరొకవంక అవమానం సాధింప, వెఱ్ఱెత్తి, మతిచెడి, గతిదప్పి, బ్రహ్మదేవుడు ప్రాణ రక్షణ కొరకిచ్చిన మహాశక్తిని జీవకోటి బెగ్గిలగా చేకొని రావణుడు సౌమిత్రిపై విసిరాడు. ఆ శక్తిని దరిచేరకుండా అనేక మార్గణాలను లక్ష్మణుడు ప్రయోగించినా, తీవ్రవహ్నితప్త లోహంపై, అల్ప జలకణ సేచనంలాగా ఆహరిస్తూ వచ్చి ఉరాన్ని నాటింది.

## మూర్ఛపోయిన లక్ష్మణుని రావణుడు కొనిపోనెంచుట

మహా వేగంగావచ్చి ఉరాన్ని నాటిన శక్తి ఘాతానికి సౌమిత్రి జ్వలిస్తున్న గాత్రంకలవాడై, చాపం జారగా సొమ్మసిల్లి నేలకు సోలాడు. ఆ మనోహరాకారుడు, ఆ తేజస్వి, నాతిగల బ్రహ్మచారి, అప్రతిహత ప్రతీకారచింతనుడు, అఖిలాస్త్ర విద్యాసంవేది, కనకనగ సదృశమూర్తి మూర్ఛితుడు కాగానే, తన వెంట లంకకు కొనిపోవాలన్న భావంతో రథం దిగి రావణుడు లక్ష్మణుని చేరవచ్చాడు. వింశతి భుజాలతో పట్టి పైకెత్తచూచాడు. కాని చీమ తలంతైనా లేపలేకపోయాడు. మేరుమందర తుహినాచలాలేకాక, ద్యోయానంపై పోయి కనదగిన సర్వ విశ్వంభర అవలీలగా కదల్పగల మహాబాహుబల సముదగ్రుడు ఒక మానవుని కదల్పలేక సిగ్గుతో తలవంచుకున్నాడు. మళ్ళీ పంగటించి బలంగా ఎత్త ప్రయత్నించాడు. ఇంతలో వనజభవదత్త శక్తినాటి స్మృతి తప్పిన సౌమిత్రి సకలలోకారాధ్యమైన, విష్ణ్వంశ భూతమైన, స్వస్వరూపాన్ని సంస్మరించాడు. వైష్ణవ హంశం మానవదేహ సమాశ్రితమై మహా భారంగా పరిణమించింది. అడుగడుగునా అవమానం ఎదురై అసురనేత క్రుంగిపోయాడు. మళ్ళీ - మళ్ళీ ఎన్నిసార్లో యత్నం చేశాడు. అదంతా బూడిద పోసిన పన్నీరువలె వ్యర్థమైంది. ఎత్తజాలక, విడిచిపెట్టి పోలేక రావణుడు మూర్ఛా ముద్రిత లక్ష్మణకాయంతో పెనగులాడసాగాడు.

## హనుమ రావణుని తన్ని లక్ష్మణుని రామునివద్దకు కొనిపోవుట

తన ముష్టి ఘాతానికి వెరచి దశకంఠుడు పారిపోయి సీలాదులతో యుద్ధం చేస్తూపోయి లక్ష్మణుని ఎదుర్కొనటం, వారిపోతూ దూరంనుంచి

చూస్తున్న మారుతి, లక్ష్మణుని మూర్ఛ, రావణుని దుష్టయత్నం గమనించి, తృటికాలంలో చేరవచ్చి, "ఓరి పారుబోతా! ఇదేంపని? నా వాయుకుణ్ణి నీవా కొనిపోయేది? ఇందాక తప్పుకున్న నా గ్రుద్దు ఇప్పుడు చవిచూడు" మంటూ, ముష్టి బిగించి, కొబ్బరికాయను పందానికి గ్రుద్దినట్లు రొమ్ముపై గ్రుద్దాడు. ఆ ఘాతానికి మోములవెంట, చెవులవెంట, కన్నులవెంట, ముక్కులవెంట, బొటబొట నెత్తురు వెదలి నేల తడపగా, దిమ్మతిరిగి, దిక్కుతేక, చేష్టలుడిగి, సోలి, తూలుతూ రథంలో కూలబడ్డాడు. అయినా పూర్వస్థితి రాలేదు. హనుమ కొట్టిన దెబ్బతో అరచావు వచ్చిన రాక్షసపతిని చూచి, ఋషులు, దేవతలు, కపులు హనుమంతుని ప్రశంసావాక్య సందోహంతో అంబరాన్ని ప్రతిధ్వనితం చేశారు. వెంటనే అస్ఖలిత బ్రహ్మచర్యవ్రతుడు, మహాయోగి, అనేకానేక దివ్య దత్త వరబల సంపన్నుడు, సీతారామ పదచింత నాసక్త చిత్తుడు, మనోజవుడు, మారుతతుల్యవేగుడు, బుద్ధిమంతుడు, అవలీలగా సౌమిత్రిని ఎత్తి భుజంపై పదిలంగా ధరించి రాముని సన్నిధికి కొనిపోయాడు. శాత్రవునకు అప్రకంప్యమైన సౌమిత్రి హనుమ బాహువుల్లో లఘుమూర్తిగా భాసించాడు. కొంతసేపటికి సౌమిత్రిని ఆవహించిన శక్తి మళ్ళీ రావణుని చేరింది. శక్తినిర్గమనంతో సౌమిత్రి మెల్లగా సేద తీర్చుకున్నాడు. హృదయంలో విష్ణ్వంశతో కూడిన స్వీయభావాన్ని సౌమిత్రి సంస్మరిస్తూనే వున్నాడు. మిక్కిలి కష్టంమీద మళ్ళీ తెలివి వచ్చిన రావణుడు శరచాపాలు దాల్చి రణానికి సిద్ధమైనాడు.

## హనుమపై నెక్కి రాముడు రావణునిపైకి పోవుట

తమ్ముని పాటు చూచిన దాశరథి కన్నులు కెంపెక్కగా, తన సైన్యాన్ని హతమార్చిన దశకంఠుని దిక్కుగా హుటాహుటిన నడువసాగాడు. అంతలో హనుమ వేగంగా వచ్చి "స్వామీ! వాడు రథికుడు. నీవు పదాతివిగా పోరటం తగదు. రాక్షస హరణంలో విష్ణువు వైనతేయునిపై అధివసించినట్లు రావణ వధోద్యోగంలో నాపై ఆసీనుడవు కమ్ము. నేను స్యందనంగా నీకు తోడ్పడతాను. నన్ను జయించటం విధాత నిర్మించిన ఈ సృష్టికి అసాధ్యం" అని పాదాభివందనం చేసి

మోకాలిపై కూర్చున్నాడు. ఆ మహా కపి అంసభాగంపై అధివసించి వింశతి భుజుణ్ణి వీక్షించాడు. వైరోచనుని వెంట తగిలే విష్ణువవలె బధిరీకృతమౌర్వీ టంకృత దిగ్దిగంతముడై "రాక్షసపతీ! నిలు నిలు. నాకు విప్రియం కలిగించిన నీవు నేటికి నా దృష్టిలో నిల్చావు. వంచనతో ఎక్కడికైనా పారిపోతే వదలుతాననుకున్నావేమో. నా చేత విడువబడిన శరం చతుర్దశ భువనాలు తిరిగినా నీ వెనువెంటనే వస్తుందని తెలుసుకో. నీ దేహానికీ, జీవానికీ ఈ నాటితో ఋణం తీరింది. బ్రహ్మప్రసాదిత శక్తిని ప్రయోగించి ఎవ్వని నీవు తాడితుని చేశావో, ఆతని పాటుకు పొంగుతున్నావో ఆ లక్ష్మణుడే, నా తమ్ముడే నిన్ను సపుత్ర మిత్ర కళత్ర బాంధవంగా వానరేశ్వరునికి అప్పగించ వచ్చాడని భావించు. ఈ వచ్చిన నేను, నీ వారున్న జనస్థానాన్ని, శూన్యస్థానం చేసిన వాణ్ణిగా గుర్తుంచుకో" అని రాముడన్నాడు.

## రామ రావణుల మొదటి యుద్ధం

రామవచనాలకు రాక్షసపతి భగ్గున మండిపడ్డాడు. స్యందన మాత్రంగా ఉన్న హనుమంతునిపై తీవ్ర శర వృష్టి కురిసి నొప్పించాడు. కాని, మారుతి కాయం వజ్రకాయం కనుక అంతకంతకు తేజం అధికమైందే కాని, తగ్గలేదు. తనపై మార్కొనటానికి మానగా, హనుమపై అస్త్రప్రయోగం చేస్తున్న దశగ్రీవునికిపై దాశరథికి పట్టరాని ఆగ్రహావేశాలు కల్గినై. తన రక్షణకై బాధ సహిస్తున్న తపచర శ్రేష్ఠుని శరీరం చూచి నేత్రాలు అగ్నిగోళాలుకాగా, ఆకర్ణాంతం నారిలాగి "ఇక నీవు లేవు" అంటూ శతమార్గణాలను విచిత్రాను సంధానంతో సంధించాడు. ఏం మిగిలింది? చక్రాశ్వధ్వజచ్ఛత్ర సూతశూలాశనిఖడ్గ పతాకాన్వితంగా పంక్తికంఠుని రథం సుడిగాలికి వగుదాకువలె లేచి మింటిని పరిభ్రమించి నేలపైబడి నిరాకారతత్వంలో లీనమైపోయింది. ఆగ్రహం ఆగని రాముడు వజ్రసన్నిభమైన దారుణ బాణాన్ని మేరుశైలాన్ని వజ్రంతో ఇంద్రుడు కొట్టినట్లు వ్యూఢభుజాంతరంలో తీవ్రంగానాటాడు. అప్పటికీ కోపం చల్లారక అర్ధచంద్రబాణంతో కువలయ విరోధివలె దేదీప్యమానంగా వెలిగే కిరీటాన్ని నేలరాల్చాడు. మళ్ళీ శరాన్ని తీసే

లోపల మాంసాశనపతి చేతిలోనున్న ధనువు వదలి పెట్టాడు. దిగ్విజయ యాత్రల్లో ఎంత వీరుడెదుర్కొనినా తృణీకరించి "అస్మత్ప్రతిరథం నాస్తి" అని అనిపించాడో ఆ దేవతా భయంకరుడు నిరాయుధుడై, దీనుడై అడుగు కదల్చలేక, శరవిద్ధ శరీరబాధ సహించలేక వడవడ వణుకుతుండటం చూచిన రాముడు, అప్రాకృతయుద్ధం చేయనొల్లక "ఓ రావణా! అనితర సాధ్యమైన, పరభయావహమైన రణం నాతో ఇంత వరకు చేశావు. నన్నే నొప్పించావు. ఇప్పుడు నీవు కోరలు తీసిన సర్పం లాగా, వేడిచల్లారిన సూర్యుడువలె, కిరీటపతనంతో భ్రష్టశ్రీకుడవై నిల్చావు. నీవు మిక్కిలి డస్సిపోయావు. ఆహవంలో నిల్చినరాముడు అస్త్రహీనుణ్ణి అధర్మంగా చంపడు. సురక్షితంగా లంకకు పోవటానికి అనుజ్ఞ ఇస్తున్నాను. వెంటనే వెళ్ళిపో. నావారు నిన్ను గేలిచేస్తారు. నీ తమ్ముడు విభీషణుడు నిన్నీ స్థితిలో చూచి సిగ్గుపడతాడు. నా మిత్రుడు సుగ్రీవుడు నిన్ను మన్నించడు. నీవలె మాయతో మనుష్యులు లేని సమయంలో ఒంటరిగానున్న వనితను అపహరించే నీచబుద్ధిగలవాడు రాముడు కాడు. లంకాపతీ! హాయిగా లంకకుచేరు. అలసట తీర్చుకో. ధన్వివై, రథివై, దివ్యాస్త్ర శోభితుడవై, శతాంగస్థితుడవై, రాతగిన వారిని చేర్చుకుని తీరికగా రా. అప్పుడు మళ్ళీ రాముని పరాక్రమం చూద్దువుగాని. ఇప్పటికి పో" అని దయార్ద్ర హృదయుడు, సమయపాలకుడు, ధర్మనిరతుడు ఆనతి ఇచ్చి అసురనేతను వదలివేశాడు. ఈ విధంగా రావణుడు రామునిచేత రణభూమిలో పరాజితుడై, తలవంచుకుని పోవటం చూచి దేవతలు హర్షధ్వానాలు చేశారు. రాముడు కపులను ఓదార్చి సంతోషం కలిగించాడు.

## పంక్తిముఖుడు తను పొందిన పరాభవానికి విలపించుట

"అంతకు పూర్వం ఎవ్వరు చేయని అభిచార రూపమైన ఘోర తపస్సు చేసి విధాతను మెప్పించి అసాధ్య వరాలు పొంది అజేయుడై, దేవతల జయించి, దిక్పాలుర సాధించి, ముల్లోకాలవీరుల వేధించి, విశ్వకర్మ నిర్మితమైన లంకా నగరంలో అనంత భోగభాగ్యాలు అమరేంద్రుని

మించి అనుభవించిన పంక్తిముఖుడు తన వరాల్లో నిర్లక్ష్యం చేసిన నర వానరులు దండెత్తి వచ్చి స్వస్థలంలో ప్రవేశించి, తన వారిని చంపి, తన్నే యుద్ధానికి వచ్చేట్లు చేయగా, మానవమాత్రుడు ద్వంద్వ యుద్ధంలో విరథుణ్ణి, నిరాయుధుణ్ణిచేసి దయతో, చంపకుండా వదలటం చావుకుమించిన అవమానం. బ్రహ్మవంశంలో పుట్టాను. ధనపతిని జ్యేష్ఠుడుగా పొందాను. కుంభకర్ణుడు సాటిలేని మేటి తమ్ముడు. ఇంద్రజివంటివారు పుత్రులు. నేను దశగ్రీవుణ్ణి. వింశతి భుజుణ్ణి. కామచరులైన దైత్యులు పరివారం. సముద్ర మధ్యంలో నివాసం. సర్వం నిష్ఫలం. విధి వైపరీత్యంచేత దైవబలం లేకుండా పోయింది. ఇది స్వయంకృతాపరాధం. ఎవరిని ద్వేషించానో వారు హితం చెప్పారు. ఎవరిని భూషించానో వాళ్లు యుద్ధానికి పురికొల్పారు" అని పలుమారు భావించి, రామశర ప్రయోగశక్తిని తలచి తలచి, భగ్నదర్పుడై, వ్యథితేంద్రియుడై, వైనతేయ పదాఘాత పన్నగమై, హర్యక్ష ముఖముక్త హస్తియై, ప్రతివీరుని బాణాలు ఇంకా తన్ను తాకుతున్నట్లే కలతపడి, అతి దీర్ఘంగా శ్వాసలు వదలుతూ, చిత్ర కనకాసనాసీనుడై, మంత్రులతో, సేనాపతులతో, గద్గదకంఠుడై దశ కంఠుడు పలుకసాగాడు.

"అమాత్యులారా! పృతనాధిపులారా! బంధువులారా! నేను చేసిన ఆశ్చర్యకరమైన తపం వ్యర్థమై పోయింది. సురపతిని యుద్ధంలో జయించి చరణదాసుణ్ణి చేసిన నేను మానవుని చేతిలో ఓడిపోయాను. కాలంలో ఎంత మార్పు కనుపిస్తుంది? మనుజాశనుడు మానవునిచే పరాభూతుడైనాడు. నాకు వరప్రదానంచేస్తూ నాళీకభవుడు నరుని చేతిలో నీకు భయం తప్పదన్నాడు. ఆ మాట ఈనాటికి రూపు కట్టింది. ఆనాడు దుర్మదంతో నరవానరుల గణించలేను. ఇప్పుడది ప్రాణానికే ముప్పు తెచ్చింది. పూర్వం ఇక్ష్వాకురాజు అనరణ్యుడనే వాణ్ణి నిష్కారణంగా యుద్ధంలో చంపాను. వాడుచస్తూ, "నా వంశంలో వాడే నీ సర్వ సంపదలతో, పుత్రమిత్ర కళత్రాదులతో నిన్ను చంపుతా"డని చెప్పి చచ్చాడు. ఆ రాజు శాపం నేటికి ఫల రూపాన్ని పొందింది. ఆ వంశంలో వాడే కనుక రాముణ్ణి మానవుడుగా భావిస్తున్నాను. ఒకానొకప్పుడు నాచే అవమానం పొంది మహా తపస్వినియైన వేదవతి "నేనే నీ కులనాశనానికి, నీ

నాశనానికి మళ్ళి జన్మిస్తా"నని చెప్పి యోగాగ్నిలో దగ్ధం అయింది. ఆమే జనకునికి పుట్టి సీతగా రాముని చేరింది. పార్వతి, రంభ, వరుణపుత్రిక, నంది నన్ను శపించారు. వారివాక్కులు అనుభవానికి ఇప్పుడు వస్తున్నై. మహర్షుల పలుకులు వ్యర్థం ఎన్నడూకావు. నాకున్న శాపాలలక్షణం ఇది. దాచకుండా మీకు చెప్పాను. చేసేటప్పుడు అజ్ఞానంతో, అహంకారంతో, అధికార దర్పంతో, ప్రతీకారభావంతో, దుర్బుద్ధితో, అనాలోచితంగా చేశాను. వీర విక్రములూ, ఆప్తులైనవారూ అనిలోహతులైనారు. ఇప్పుడు సీతను రామునకు ఇచ్చి సంధిని చేసుకుని సిచపు చావు చావటంకంటే కదనంలో మరణించి వీర స్వర్గం పొందటం మేలు. ఇంకా అపార సైన్యం వుంది. ప్రతిపక్షమువ్వార బలాఢ్యులున్నారు. కదనం కడముట్టగా సాగించవలసిందే. నా బొందిలో ప్రాణం వుండగా రామునకు సీతను దక్కనీయను. వెలితిపడిన స్థానాల్లో నూతన సైన్యాన్ని నిలిపి, బ్రహ్మశాపోపహతుడైన కుంభకర్ణుని లేపండి.

## రావణుడు కుంభకర్ణుని నిద్రలేప మంత్రుల నియోగించుట

భయంకర ప్రధనంలో ప్రహస్తుడు చచ్చాడు. నేను రామునిచే నిరియుడనై వచ్చాను. శత్రువులు లంకలో ప్రవేశించకుండ నిలువరించేవారెవరున్నారు? ఈ తరుణంలో నా తమ్ముడు కుంభకర్ణుడు ఒక్కడే కాపాడగల సమర్థుడు. మీరు మీ మీ సైన్యాలతో ద్వారాలను కాపాడండి. ప్రాకారాలపై ఎక్కి పగవాళ్ళ ప్రయత్నాలను పరిశీలించండి. నేను శాపోపహతుడనై ఈ విధంగా అవమానంతో కుళ్ళిపోతుంటే, ఆదమరచి నా తమ్ముడు హాయిగా నిద్రిస్తున్నాడు. త్రిదశమాసాలు ఒడలు తెలియని నిద్రలో వుంటాడు. (ఇది ఒక లెక్క. ఆరు, ఏడు, ఎనిమిది, తొమ్మిది నెలలు సంవత్సరంలో విడివిడిగా ఒకొక్కప్పుడు నిద్రిస్తాడని వేరొక లెక్క. పంచే, ఆరు మాసాలు విధిగా నిద్రిస్తాడు. ఆపై అతని ఇష్టానుసారం నిద్రించవచ్చు. లేకపోతే లేకపోవచ్చునను కోవాలి.) అంత కాలం ఆహారకులం జీవించడు. నాతో రాజ్యతంత్రం, యుద్ధమంత్రాంగం చేసి ఈ రోజుకు తొమ్మిది రోజులక్రిందనే నిద్రించాడు. ఇప్పుడు అతని

లేపటం సుకరం. అతడులేస్తే సోదరయుక్తంగా వానర సేనను రూపు మాపుతాడు. రాక్షస వీరుల్లో అతనికి సరిజోడు లేడు. దేవతలనే సరకు గొనని దిట్ట. ఈ నరులూ, వానరులూ అతనికి ఏంలెక్క? బహుకాల నిద్రితుడు కావటంచేత జాగ్రదవస్థ అల్పం కావటంచేత గ్రామ్యసుఖ జీవనుడై ప్రొద్దుపుచ్చాడేకాని, నాకు కలిగిన దుఃఖాన్ని గూర్చి ఆలోచించలేదు. నా తమ్ముడే నిద్రలేస్తే సీతాహరణవల్ల నేను పొందిన పరాభవాన్ని తీర్చి, పదింతలుగా ప్రతిపక్షికి కల్పిస్తాడు. నా మనశ్శల్యం నశిస్తుంది. మళ్ళీ ఉత్సాహంతో యుద్ధాన్ని కొనసాగిస్తాను. ఈసమయంలో అంతవాడు తమ్ముడుగా వుండి నాకు తోడ్పడకపోతే లేనివాడిక్రిందే జమ. అన్నీ ఆలోచించాను. కానున్నది కాకమానదు. మీరు త్వరగా పోయి ఆ మహావీరుణ్ణి నిద్ర లేపండి. లేవగానే వచ్చి నాతో చెప్పండి" అని చెప్పాడు. ఆ పలుకులు విన్న అమాత్యులు సంభ్రమాశ్చర్యాలు సమంగా పొందారు. ఇక కర్తవ్యపాలనం తప్పదనుకున్నారు. వర్షను ఆశ్రయించి తట్ట ఎండినట్లు, ఇనుమును పొంది అగ్ని సమ్మెట పోట్లు తిన్నట్లు, రావణుడొక్కడు చేసిన తప్పిదానికి ఆశ్రితులు, అనుచరులు, అయినవారు అంతా కాలగర్భంలో కలిసిపోబోతున్నారు. పరమేష్ఠి ప్రసాదించిన వరాలు సత్కర్మాచరణ ఫలితాలు. సద్వినియోగంచేస్తే ఆత్మ శ్రేయస్సుతోపాటు విశ్వశ్రేయస్సు కలుగుతుంది. అనందాభినందనలు లభిస్తాయి. రావణునకు నిద్రసమయంలో తమ్ముణ్ణిలేపటం తప్పనితెలుసు. ఆ పని తనకుగాని, తమ్మునికికాని క్షేమంకాదని తెలుసు. అయినా లేపమని ఆజ్ఞయిచ్చాడు. మహర్షుల, మానవతుల మాటలు అభిశాపాలై కాలంలోకలిసి అనుభవానికి వస్తున్నప్పుడు బుద్ధికూడా కర్మానుసారంగానే నడుస్తుంది. అసురపతిపట్ల అంతే జరిగింది. ఆజ్ఞాబద్ధులైన అమాత్యులు తగినవారిని వెంట బెట్టుకుని, గంధమాల్యాదులు, భక్ష్యవర్గాలు, భోజన పదార్థాలు, పానీయాలు బండ్లతో కొని, ఎటుచూచినా యోజనం విస్తీర్ణంగల మహా ద్వారాన్ని సమీపించారు. ఆ పర్వతగుహనుంచి ప్రవాహంలాగా గంధపరిమళాలు ఘుమ్మని వస్తున్నై. ఆ పరిమళంవెంట ఘటకర్ణుని ఊర్పుల వాయువు ప్రచండంగా వస్తూంది. మహాబలశాలులైన మాంసాశనులు వగుదాకుల్లాగా ఎగిరిపోతున్నారు. ఏటికి ఎదురీదినట్లుగా ఎంతో కష్టం

మీద కాళ్ళు నిలత్రొక్కుకుంటూ బంగారు తాపిన గుహలో ప్రవేశించారు. బంగరు పట్టెమంచంపై, సుందరంగా తీర్చి దిద్దిన పనితనం గల పరుపులు, దాలీసులు, దిండ్లు నింపి, కన్నుల పండువుగ పవళించిన రావణానుజుని చూచారు. అతని జాగ్రదవస్థ ఎరుగుదురుకాని, నిద్రవస్థ పిశాచములు ఎన్నడూ ఎరుగరు. పుడమిపాటు తప్పి ఒరిగిపడిన పర్వతంలాగా పండియున్నవాణ్ణి, శేషాహివలె బుసలుకొట్టేవాణ్ణి, నిటారుగా లేచి నిల్చిన కరకు రోమాళికలవాణ్ణి, గహ్వరంవంటి ముక్కుపుటాలు కలవాణ్ణి, పాతాళ వివరంవలె అగాధమైన ఆస్యం కలవాణ్ణి, రత్నస్థగిత మకుట మండిత మూర్ధం కలవాణ్ణి, రక్తగంధలేపనం కలవాణ్ణి, భీమదర్శనుణ్ణి, అరిందముణ్ణి కుంభకర్ణుణ్ణి చూచి లేపటానికి మనస్సురాక అదిరిపడ్డారు. ప్రభువిచ్చిన ఆజ్ఞ వెన్ను చరచగా కార్యోన్ముఖులైనారు. వెంటకొని వచ్చిన ఆమిష ఖండాలు మేరు వింధ్య పర్వతాల్లాగా ఒకవంక పేర్చారు. మహిషమృగ సూకరాది జంతు కళేబరాలను ఒకవంక గుట్టలుగా పడేశారు. చిత్రవిచిత్రంగా వండిన అన్నాలు రాసులు పోశారు. రకరకాల మద్యాలు, రక్త కుంభాలు వరుసగా పెట్టారు.

## కుంభకర్ణుని నిద్ర లేపుట

పునుగు, జవాది, కస్తూరి, మంచిగంధం శరీరంనిండా పూశారు పరిమళ ద్రవ్యాలను, బహువిధ వాసనా భరిత పుష్పకదంబాన్ని తనువుపై పరిచారు. ధూపాలువేశారు. స్తోత్రాలు వల్లించారు. చంద్రుని గేలిచేసే శంఖాలు దిక్కులు పిక్కటిల్లేలాగా పూరించారు. గొంతులు పగిలేలాగా ఘోరాతి ఘోరంగా గోలచేశారు. అరిచారు. ఆ అరపులకు లంకంతా హావడి పొందింది. అయినా ఆ మూర్తికి చీమకుట్టినట్లైనాలేదు. పణవ భేరీ శంఖ పటహ ఢక్కా ఝల్లీ నాదాలు, సింహధ్వానాలు ఎడతెగక మ్రోయించారు. పక్షులు దిక్కులకు పరుగెత్తినై. ఆకాశానికి ఎగిరినై. రెక్కలు కంపంలో తడబడి విప్పలేక నేలపై వ్రాలినై. ఇంతచేసినా ఆ మహాకాయుడు కదలలేదు. కన్ను విప్పలేదు. విసిగివేసారారు. గాసిపడ్డారు. కలతపొందారు. కర్తవ్యతామూఢులైనారు. ఎప్పటికప్పుడు వేగుప్రభు

వుకు పోతూనేవుంది. ఏవిధంచేతనైనా లేపి తీరాలని ఆజ్ఞలు అందుతూనే వున్నై. సహజమార్గం, సాత్వికమార్గం వ్యర్థం కావటంతో జాలిమాలి కఠోర హృదయులై ముసల ముద్గర గదాద్రి భూరుహాది ప్రహరణ సాధనాలతో దేహాన్ని బాధించారు. కాని పర్వతంపైన పడ్డ వర్షంలాగా ప్రయోజన శూన్యమే అయింది. పైగా నాసికారంధ్ర నిర్గత ప్రళయ వాతోద్ధతి వాళ్ళను దూదిపింజల్లాగా దూరంగా చిమ్ముతూంది. ఇది పని కాదని పదివేలమంది భీమబలాఢ్యులు తూర్యమృదంగఘటాదివాద్య విశేష విన్యాసాలు చేశారు. అది సహజనిద్రకాక శాపసంబంధం కావటంచేత అసురుల యత్నం వ్యర్థం అవుతున్నదేకాని ఫలకారి కావటం లేదు. అంతా కలిసి ఇదీ కాదనుకున్నారు. ఒక దారుణమార్గం దైత్యులు ఆలో చించారు. దండకుశాంకుశ ముసలాది సాధనాలతో ఒడలు హూనంగా కొట్టారు. హయ గజోష్ట్ర ఖరమహిషాది జంతువులతో శరీరం త్రొక్కించారు. భయంకరంగా అరిచే జంతువులతో అరపించారు. తామూ కేకలు వేశారు. సుత్తెలతో, కత్తులతో, శూలాలతో, గునపాలతో, గుదియలతో, గొడ్డళ్ళతో తమ శక్తిమేరకు మొత్తారు. నిరంతరాయంగా చేస్తున్న ఆ క్రియలకు, ఆరవుళ్ళకు, లంకావాసులు, శైలకానన పర్వతాలు కిలగుండు పడటం జరిగింది. అయినా అతని నిద్రాదేవి వదలిపోలేదు. వేయి ఢంకాలు మ్రోగించారు. అలసిపోయారు. కోపంతో వూగిపోయారు. దూరంగాగాక చెవులకు దగ్గరగానిల్చి, డప్పులు, తప్పెట్లు, ఢంకాలు, ఇంకా—ఇంకా—ఎన్నో మ్రోగించేవాళ్ళు మ్రోగిస్తుంటే, జుట్టు పీకేవాళ్ళు పీకారు. చెవులు రక్తం కారేలాగా కొరికేవాళ్ళు కొరికారు. గోళ్ళతో గీరేవాళ్ళు గీరారు. చెవుల్లో నీటి కుండలు తెచ్చిపోసేవాళ్ళు పోశారు. తలమీదా, రొమ్ముమీదా ముద్గరాలతో కొట్టేవాళ్ళు కొట్టారు. తాళ్ళుగట్టి శతఘ్నులను పైగా లాగారు. మదించిన ఏనుగులను వేయింటిని ఒక్కసారిగా ఒడలిపై కెక్కించారు. ఇంతచేస్తే ఏదో తనమీద సోకు తగిలి నట్టుగా తలచి కన్నులు అరవిచ్చాడు. అంతే.

# కుంభకర్ణుడు నిద్ర లేచుట

బలవంతంగా కన్నులు పూర్తిగా తెరిచాడు. లేచి మంచంపై కూర్చున్నాడు. కాని, తన శరీరంపై జరిగిన ఘోరక్రియలు సుతరాం తలపులోకే రాలేదు. ఆకలి దవానలంగా మండసాగింది. లేచి ఒళ్లు విరిచాడు. శేషాహివంటి రెండు చేతులు జాడించాడు. నిల్గాడు. బాడబ తుల్యమైన వక్త్రం తెరచి ఆవులించాడు. పాతాళ సన్నిభంగా, మేరువుపై నున్న భానుడులాగా వుంది. లేచి నిల్చిన ఆకృతి కొంగవాలుతో కూడి వానగురిసే మబ్బులాగా పొల్చింది. నాల్గుదిక్కుల కలయచూచాడు. జ్వాల దగ్నితుల్యం, చంచలా సహస్రసదృశం అయిన నేత్రాలు, గ్రహాలు మండేలాగా క్షుధ పెచ్చుమీరగా మండుతున్నట్లున్నై. సమీపంలో వున్న భోజన పదార్థాలు చాలినంతగా భుజించి, మద్యాన్ని, రక్తాన్ని త్రాగి, ఆకలి శమించగా అటునిటు తిరుగాడసాగాడు. అంతవరకు దాగివున్న దానవులు వచ్చి పాదాలపైబడి నమస్కారాలు చేశారు. తన చుట్టూ మూగిన దైత్య నివహాన్ని నిద్రారహితం కానట్టి, కలుషీకృతమైనట్టి, కన్నులతో అందర్నీ కాంచి, "ఎందుకు బలవంతంగా మీరు లేపారు? నా అన్న భద్రంగా వున్నాడా? భయ కారణం ఏమీ లంకకు ప్రాప్తించలేదుగా? ఆలోచిస్తే నాకు సంశయాలు వస్తున్నై. అకాలంలో నన్ను నిద్ర లేపటం చూస్తే ఏదో గొప్ప ఆపద సంభవించి వుంటుంది. ఎంత ప్రమాదం రాకపోతే అన్న నన్ను నిద్రలేపుమంటాడు? భయపడకుండా నన్ను ప్రతిబోధితుణ్ణి చేసిన కారణం చెప్పండి. పాకశాసనుణ్ణి భద్రపీఠంపై నుంచి క్రిందికి నెట్టాలా? అగ్నిహోత్రుణ్ణి తెచ్చి సభా స్తంభానికి కట్టాలా? దేవతలు కాక ఇంకా ఎవరినైనా చావచితకకొట్టాలా? అకారణంగా అన్న నన్ను లేపడు. మీరంతా అధోముఖులై వున్నారు. చెప్ప సందేహిస్తున్నట్లున్నారు. నాకు ఆగ్రహం ఆగటంలేదు. చెప్పండి" అంటూ కుంభకర్ణుడు క్రోధావేశపరుడై పలికాడు.

## యూపాక్షుడు నిద్ర లేపిన కారణం కుంభకర్ణునితో చెప్పుట

క్రోధావిష్టుడై నేత్రాలు, ఘూర్ణిల్లి నిప్పులు వెళ్ళగక్కే బడబాగ్ని కాగా పల్కిన మాటలకు యూపాక్షుడనే మంత్రి చెంతకు చేరి నమస్కరించి వినమితశిరస్కుడై, గద్గద కంఠంతో "ఆశరశేఖరా! దైవకృత భీతి మన దైత్యులకు ఎన్నడూ కలుగదు. మరి ఇప్పుడు వచ్చిన భయం తీర్చటానికి వీలులేకుండా మానవులతో వచ్చింది. ఇదివరకు ఎప్పుడూ దితిజ బృందంచేతా, దానవులచేతా, దేవతలచేతా రాని ప్రమాదం నరులచే వానరులచే వచ్చింది. పర్వతాకారులైన శాఖాచరులు లంకను లగ్గపట్టారు. సీతాహరణార్తుడు రామునిచేత రక్షస్తతికి తీరని కీడు మూడింది. ఒక్క కోతి వచ్చి లంకలో చొచ్చి, మన అక్షయ కుమారుని చంపి, లంకకు చిచ్చుపెట్టాడు పూర్వం. ఇప్పుడు మనసేనలతో, రథగజ తురగాలతో, సేనాపతులందర్నీ రాముడు మట్టు పెటాడు. ఆహవానికి పోయిన అసురేశ్వరుని, భగ్నరథుణ్ణీ, నిరాయుధుణ్ణీ చేసి, "బ్రదికి ఇప్పటికిపోయి బలంతో మళ్ళీ అవకాశం వుంటే తిరిగిరా" అంటూ అవమానించి పంపాడు. దేవదానవయక్ష గంధర్వాదులు చేయని ఘోరావమానం కూర్చి చచ్చీ చావని వాడిగా నీ అన్నను చేసి వదిలాడు" అని కారణం వివరించాడు. అన్నపాటుకు కుంభకర్ణుడు దంతపీడనం చేస్తూ, కన్నులు వివృత్తాలుకాగా, గంభీరంగా నైఋతయూథపపరివృఢుణ్ణి, యూపాక్షుణ్ణి వీక్షించాడు.

## యూపాక్షుడు రావణుని చూడబొమ్మని కుంభకర్ణునితో చెప్పుట

"మహామంత్రీ! అన్నపాటు విన్నాను. ఇప్పుడేపోయి వానరుల వధించి, మానవాధముడైన రాముని గుండె చీల్చి రక్తంపానం చేస్తాను. మనవాళ్ళకు వనచరామిషాన్ని విందు చేస్తాను. మా అన్నను అప్పుడు వచ్చి చూస్తాను" అని అన్నాడు. రోష వివృద్ధ దోషజుష్టమైన గర్వాలాపాలు ఆలించి యూపాక్షుడు మౌనంవహించగా, మహోదరుడు మెల్లగా

ఉచితమైన విధంగా, "దేవా! నిన్ను లేపించిన కారణం ఇది ఐనప్పటికీ, ముందు ప్రభువును చూచి, గుణదోష నిర్ణయాలు గుణించి, విజయావకాశాలు సమాలోచించి, తర్వాత యుద్ధ రంగానికి పోవటం యుక్తం" అని చెప్పాడు. కుంభకర్ణుడు "అలాగే" అంటూ లేచాడు. ఆ సంగతి రక్షోవీరులు పరుగెత్తి రావణునకు నివేదించి "దేవా! తమ ఆజ్ఞ మేరకు కుంభకర్ణుని లేపాము. ఆయన లేచి కూర్చున్నాడు. తమరక్కడకు పోతారో, ఆయన్నే ఇక్కడకు రమ్మంటారో సెలవీయండి" అన్నారు. "నాతమ్ముణ్ణి గౌరవపురస్సరంగా అర్ఘ్య సమర్పణాదికాలు నెరపి కొనిరండి" అని ప్రభువు చెప్పాడు. ఆ వృత్తాంతంకొని "ప్రభువు మిమ్మల చూడాలనుకుంటున్నారు. దయచేస్తారా?" అని భటులు అడగ్గా "ఇదిగో వస్తున్నాను. క్షణకాలం నిలువండి" అని చెప్పి తల్పం నుంచి లేచి, బయటికి వచ్చి, దంతధావనంచేసి, పరిమళ జలంతో మజ్జనం ముగించి, ఆభరణాలు ధరించి, బలవర్ధకమైన పానీయాలు తృప్తిగా త్రాగాడు. అనంతరం, ప్రభువు అనుమతితో మదిరాఘటాలు, వివిధోపహారాలు రాక్షసాంగనలు సమర్పించగా, ఒక వేయింటిని త్రాగి, కుత్తుకబంటిగాభుజించి, సంపూర్ణ శక్తిమంతుడై, ప్రళయకాల జలధర భీకరాకారంతో అన్న సమక్షానికి పయనించాడు. అతని పాదాహతికి లంకానగరం దద్దరిల్లిపోయింది. అతడు దాల్చిన భూషణ ప్రకాశం రెండు వంకల బద్ధకరాంజలిచ్చాయా పంక్తిగా భాసించింది. బ్రహ్మ దర్శనార్థం సురపతిపోయినట్లు పోతున్న వాణ్ణి, సూర్యమండలాన్ని చుంబిస్తున్న మహాకాయం కలవాణ్ణి, మేరు పర్వతంవలె విస్తృత పరిమాణంకలవాణ్ణి, ముట్టడించిన వనచరయోధులు అబ్బురపాటుతో ఆలోకించారు. ఆ భీకరమూర్తిని చూచి కొందరు వానరులు కూలబడ్డారు. కొందరు భీతితో పారిపోయి రాముని శరణు చొచ్చారు.

## అన్నను కన పోతున్న కుంభకర్ణుణ్ణి చూచి రాముడు విభీషణుని ప్రశ్నించుట

కపులంతా కాందిశీకులై రావటం చూచి రాముడు లంకానగరం వైపు తల ఎత్తి చూచాడు. "కపిల నేత్రుడు, పర్వతాకారుడు, భయద

శరీరుడు, నారాయణునివలె ఆకాశం తాకే పొడవు దేహం కలవాడు, అంబుదసదృశ వర్ణంకలవాడు, కాంచన కేయూరాది నానావిధ పరిష్క్రియా రమ్యుడు, స్వీయకాంతిలో పరిసరాలను ముంచి తానే కనుపించువాడు ఎవరయ్యా! మిత్రమా ఆతడు? రాక్షసుడా? లేక బృందారకుడా? మన సైన్యం కకావికలై పోతూంది. ఇంత మహాద్భుత కాయంకల భూతాన్ని పూర్వ లోకం చూచి వుండకపోవచ్చు. మహాశక్తిమంతులైన మన వానర శ్రేష్ఠులు, ఇంతవరకు ఎవరికీ భయపడనివారు, ఈతని చూచి, స్వస్థానాలను వదలి నన్నాశ్రయించ వస్తున్నారు. నాకే ఈ మూర్తి పరమాద్భుతంగా వుంది. మనవాళ్ళు భయపడటంలో వింత ఏముంది? ఈతడు రాక్షసుడే అయితే, ఇటువంటి వాళ్ళు లంకలో ఎందరున్నారో? ఆకారం చేతనే కాక, పరాక్రమంచేతా, అస్త్రశస్త్ర ప్రయోగకుశలతచేతా ఆరితేరిన వారి అండదండలుండబట్టే రావణుడు లోకవిద్రావణుడైనాడు. సహజంగా ఆతడూ వరబలగర్వితుడే" అని విభీషణుని అడిగాడు.

## విభీషణుడు రామునకు కుంభకర్ణుణ్ణి గురించి చెప్పుట

"రామచంద్రా! నీ వూహ సమంజసమైందే. ఈతడు భండనంలో గిట్టి వాసవుణ్ణి బట్టి బంధించిన బంటు. విశ్రవసోముని పుత్రుడు. నాకు రెండవ అన్న. పేరు కుంభకర్ణుడు. ఇంకా బలాఢ్యులు, మాయోపాయ చతురులు, కదనకఠోరులు చాలామంది వున్నారు. కాని, వాళ్ళకి దేహం లేదు. ఈ శక్తి లేదు. మిగిలినవారికున్న శక్తులన్నీ వర ప్రభావంవల్ల వచ్చినవే. ఈతడు సహజశక్తి సంపన్నుడు. విచక్షణ కలవాడే కాని, అన్నకోసం ఆత్మార్పణం చేసే అనురాగం కలవాడు. గత యుద్ధాల్లో అమర గంధర్వ కిన్నర యక్ష దనుజ విద్యాధరాదుల అశ్రమంగా జయించాడు. దేవతలకు ఈతని పేరు చెపితే మనశ్శాంతి నశిస్తుంది. వచ్చిన విజయాలన్నీ ఈతనివల్లనే వచ్చినై. శూలం కేల ధరించి, ఆలంలో వికటాట్టహాసంచేస్తూ, సంచరిస్తూంటే కాలుణ్ణి చేరలేని ప్రాణివలె, నిర్జర జాలం నీళ్ళుకారిపోయేది. ఈయన భూమిపైన పడిన వెంటనే ఆకలితో వేల వేల సంఖ్యలో జంతువుల మ్రింగ మొదలుపెట్టాడట. ప్రజలంతా భయపడి ఇంద్రునితో మొరపెట్టుకుంటే, ఆయన వజ్రాయుధంతో కొట్టా

రట. ఆ దెబ్బకు ఈయన ఆర్భటించసాగాడట. ఆ రోదనధ్వనికి దిశలు మార్మ్రోగి చెవులు గింగురుమెత్తుతుంటే నీరసించి లోకంవిషణ్ణమైందట. అంతటి మహా బలశాలి. ఐరావత దంతం పీకి దానితో వెంటబడి ఇంద్రుణ్ణి హింసించాడు. మాటిమాటికి ఈతడుపెట్టే రాయిడికి తట్టుకోలేక శతక్రతుడు ధాతకు విన్నవించుకుంటే ఆయన కుంభకర్ణుని చూచి గుండెలు చెదరగా నిబ్బరించుకుని, మా అన్నను పిలిచి "నిన్ను విశ్రవసుడు లోక నాశనానికి సత్యంగా నిర్మించాడు. అందుకే నీవు లోక భక్షణం, స్వర్గనధర్షణం, అన్యకాంతా శీలాపహరణం, ఆశ్రమధ్వంసం చేస్తున్నావు. నీవు యథాస్థితిలో వుంటే నా సృష్టి నాశనం అవుతుంది. కనుక నీవు మృతకల్పుడుగా పడివుండు" మని శపించాడు. వెంటనే ఆయన వద్దనే నేల మూర్ఛతోపడ్డాడు. తమ్ముని పాటుకు దశవదనుడు దుఃఖించి "తాతా! ఇంత అన్యాయం ఎందుకు చేశావు? వీడు ఎవడు? నీ మనుమడు. ఉమ్మెత్త చెట్టైనా పెంచి తానే నరకటం తప్పని పెద్దలంటారు. అలాంటి స్థితిలో నీయంతవాడైన నీ కొడుకు కొడుకును మృతకల్పుడుగా శపించటం నీకు ధర్మమెలా అవుతుంది? నీ సృష్టిలోనే సాత్త్వికజీవులు, హింసాజీవులు లేవా? నా తమ్ముడు స్వభావ విరుద్ధ కర్మ ఏం చేశాడు? ఇంత శరీరం, ఇంత ఆకలి ఎవరిచ్చారు? ఎందుకిచ్చారు? ఆ బుభుక్షకు పరిహారం చావుమని శపించటమేనా? నీ వాక్యానికి తిరుగులేదు. ఎంతోకాలం జీవించి సుఖించవలసిన జీవి, స్మృతిహీనంగా వుండి ఏం ప్రయోజనం? శాపనిష్కృతి ఉపదేశించు. శయనజాగరాలలో కాలనిర్ణయం చేసి పునర్జీవితుణ్ణి చేయి. సత్యలోకాధిపతివి. సత్యం పాలించు" అని దీనుడై ధాతనువేడుకున్నాడు. ధాత తన తొందరపాటును తెలుసుకుని "మనుమడా! నీ మాటలు హర్షించ తగినవే. నా సృష్టి అనంతకాలంలో అఖండంగా క్రమపద్ధతిలో సాగిపోవాలె. మధ్య మధ్య భంగం జరుగరాదు. నీ తమ్ముడు నీ తండ్రి సంకల్ప బలంతో విశ్వ విరోధిగా జన్మించాడు. ఆ కారణంచేత సృష్టి క్రమం దెబ్బతింటుంది. కనుక, నీ తండ్రి కోరికా, నీ ప్రార్థనా మన్నించి శాప పరిహారం చెపుతున్నాను. వత్సర కాలంలో ఆరు మాసాలు నిద్రావస్థలో వుంటాడు.

ఒక్క పగలు అగ్నిలాగా అప్రతిహతంగా తిరుగుతు ఆకలి తీర్చుకుంటాడు. ఈ నియమం పాటించినంతకాలం నీ తమ్ముడికి చిరాయుష్మంతుడే పొమ్మన్నాడు. అంతటివాడు నీ వదిగిన నా రెండవ అన్న. నీచేత అవమానపడి నిశాచరపతి అకాలంలో నిద్రలేపాడు. అతని చూచి కపులు భీతిల్లుతున్నారు. ఎలా యుద్ధంచేస్తారో ఏమో? ఇప్పుడాతడు శిబిరం వదలి అన్న వద్దకు వెళ్ళుతున్నాడు. ఈయన చేసే యుద్ధం వేరు. రెండు చేతులతో అందిన జీవకోటిని ఆహారంలాగా కడుపులో వేసుకుంటాడు. ఈయన గమనం నిరోధించటం కష్టం. మన సేన భయపడకుండా "రావణుడు మాయతో ఒక యంత్రాన్ని (కీలుబొమ్మను) రాక్షసాకృతిలో నిర్మించి పంపాడు. భయపడవలసిన పనిలేదు"ని ప్రచారం చేయుట మంచిది. ఎంతచేసినా పూర్తిగా కాకపోయినా, కొంత తీవ్రనష్టం తప్పదు. చివరకు నీకు విజయం తప్పదు" అని సహయానుకూలంగా సలహా ఇచ్చాడు విభీషణుడు. ఆ మాటలు విన్న రాముడు శాఖామృగ సర్వసైన్యాధిపతిని పిలిపించాడు. "మహా సైన్యాధిపతీ! నీలా! నీవు జాగ్రతగా మన సేనలను వ్యూహాలుగా తీర్చి లంకా ద్వారాలనూ' కీలక స్థానాలనూ, శృంగాటకాలనూ (నాల్గు దారుల కూడలి) బంధించి, శత్రు చర్యల బలంగా నిరోధించు. శిలలూ, పర్వతాలూ, వృక్షాలూ సమృద్ధంగా చేరవేయించు. రణభూమిలో నిల్చినవారు తమ తమ సాధనాలతో సంసిద్ధంగా వుండేట్లు జతపరచు" అని ఆదేశం పావకికి ఇచ్చాడు. రామాజ్ఞ సేనావారానికి తెలియపరిచి నీలుడు, తానుకూడ తన స్థానాన్ని కాపాడటంకోసం పోయాడు శైలవృక్ష పాణులై శరభ గవాక్షాంగద హనుమంతులు నాల్గు ద్వారాలను అరికట్టాడు. కపిసైన్యం నూతనోత్సాహంతో వెనుక ప్రక్క నిల్చి విజయార్భటులు విపరీతంగా చేసింది. నీలుడు పన్నిన వ్యూహం లంకకు రెండవ సముద్రంలాగా తోచి కన్నులకు ప్రేగై పోయింది.

## కుంభకర్ణుడు రావణుని చూచుట

లంకలో బలవంతంగా నిద్రలేపిన కుంభకర్ణుడు, అర నిద్దర మబ్బుతో, అతి మదిరాపానమత్తతతో ఆకులితచిత్తంతో అన్న వున్న

హర్మ్యానికి వెళ్ళాడు. అతడువస్తుంటే రాక్షసులు బారాబరులు చేస్తుంటే, స్తోత్రాలు పఠిస్తుంటే, పూలు చల్లుతుంటే, గంధాలు చిలుకుతుంటే, రాజ మార్గం నవనవశోభతో రాణించింది. మనోహరాతి మనోహరమైన అన్న హర్మ్యాన్ని తరణి మేఘ గర్భంలో ప్రవేశించినట్లు ప్రవేశించి, కక్ష్యాంత రాలు గడచిపోయి, బ్రహ్మను దర్శించే ఇంద్రుడులాగా దర్శించి, పుష్పక విమానంలో చింతాదంతురితస్వాంతుడై, అధోముఖుడై, ఆలోచనాపరుడై వున్న అన్నను చేరాడు. తమ్ముని రాకతో దశముఖుడు తేరుకుని "రా, నాయనా! రా" అంటూ సింహాసనంపైనుంచి దిగి వచ్చి ఆలింగనం చేసు కున్నాడు. అనుజుడు పాదాభివందనం చేశాడు. నిర్దేశించిన హేమ పీఠంపై ఆసీనుడయ్యాడు. రూక్షప్రేక్షణుడై "అన్నా! అకాలంలో నన్ను లేపవలసిన అపకారం నీకు చేసిన ప్రతిపక్షి ఎవ్వడు? వాడిక లేనట్లే భావించు. కాలం గడపక వివరించు. కయ్యానికి అనతి యిచ్చి పంపు" మని తమ్ముడు కోరాడు. తమ్ముడికి కోపస్థితి గమనించి అన్న, అరమర లేకుండా, ఆ మహా వీరునితో చెప్పసాగాడు.

## రామునిచే రాక్షసులకైన విపత్తు తమ్మునితో రావణుడు చెప్పుట

"తమ్ముడా! మనం మంతనం చేసిన అనంతరం నీవు నిద్రించావు. ఆ పిమ్మట జరిగిన వృత్తాంతం నీకు తెలియదు. సుగ్రీవుని సహాయంతో రాముడు వానరసైన్యాన్ని వెంటబెట్టుకుని, సేతువు కట్టి, వారాశి తరించి వచ్చి మన రాక్షస వీరుల మూలముట్టుగా నాశనం చేశాడు. మన మహా సేనానులంతా యుద్ధభూమికి పోవటమేకాని, ఇంతవరకూ రావటంలేదు. వానర వీరుల్లో పేరుగలవాడెవడూ మరణించినట్లు నేను వినలేదు. అందుచే నాకు లోపల భీతి కల్గింది. నగర రక్షణం నాతరం కాకుండా వుంది. నీవుకాక ఈ రణవారాశి నిస్తరించే దిక్కులేదు. మనకున్న కోశా లన్నీ శూన్యస్థితి నందుకుంటున్నై. ఇప్పుడు లంక బాల బాలికలతో, వృద్ధులతో, రుజాపీడితులతో నిండి వుంది. మొన్నటివరకు సర్వ లక్షణ సంపన్నమైన లంక నేడు శోభాదరిద్రాణంగా వుంది. ఇంతకు పూర్వం నీకు ఎటువంటి పనులు చెప్పలేదు. నీమీద నాకున్న ప్రేమా, నామీద

నీకున్న అనురాగ వినయవిధేయతలూ కలిసి నిన్ను అకాలంలో నిద్ర లేపించినై. నీవు ఇతర భావం పొందక, మన జాతి గౌరవం దక్కించు. మన పురాన్ని రక్షించు. నీయంత నీవే సురాసుర యుద్ధంలో జోక్యం కల్పించుకుని ఎన్నో విజయాలు నాకు సమకూర్చావు. ఇప్పుడు నేనై నిన్ను కోరుతున్నాను. నా అవమానాన్ని తీర్చు. నీ ఉపకృతి ఎన్నడైనా మరిచానా? మరువగలనా? భీమ పరాక్రమధుర్యుడవు. భుజ వీర్య శౌర్య ధైర్య సముద్రుడవు. సమిద్భూమిలో నేడు నీ సాహసం చూపు. నిన్నెదిరించే పోటు మగడు త్రిజగాల్లో లేడు. నాకి ప్రియం చేకూర్చు. బంధు నాశనం తప్పించు. శత్రువుల మడియించి సంగరంలో సాటిలేనివాడన్న కీర్తిని పునఃప్రతిష్ఠించు. దేవతలజయించిన నీకు నరవానరులొక లెక్కా? నీ విడుద విట్టూర్పుల గాలికి శాత్రవ జలధర చయం విచ్చిపోతుంది. మనకు విజయశ్రీ వచ్చితీరుతుంది" అని.

## కుంభకర్ణుడు రావణుని దూషించుట

అమిత భయార్తుడై అంగలారుస్తున్న అసురాధిపతి మాటలకు అలతి నవ్వు నవ్వి, "అగ్రజా! లోగడ సభలో మంత్రం సలిపేటప్పుడు మంత్రులూ, నేనూ, నీకు రానున్న కీడు ఏ రూపంగా వుంటుందని ఊహించామో, ఆ విధంగా నేడు హిత విరోధివైన నీకు వచ్చింది. ఇందులో విపరీతం ఏమీలేదు. దురితంచేసే వాళ్ళు నిరయంలో కూలి పోయినట్లు, నీవుచేసిన పాపకర్మాలఫలం ఇప్పుడు అనుభవానికి వచ్చింది. ఈ సీతాపహరణ విషయంలో మొదట ఎవరితోనూ ఆలోచించలేదు. కేవలం శౌర్యమదాన్ని, వరబలాన్ని నమ్మి చేశావు. రాబోయే అనర్థాల రూపం ఆలోచించలేదు. కార్యం మించి ముంచుకుని వచ్చిన తర్వాత అంగలారిస్తే అయ్యేదేముంది? వాడు నీతివేత్త కానేకాదు. దేశకాల పాత్రాల తెలిసి చేయని కృత్యాలు హవిస్సు అపాత్రులకు దానంచేసినట్లు వ్యర్థం అవుతై. అవి ఉత్తమ మధ్యమాధమ రూపంగా పరిణమించుతై. ద్రవ్యంఅన్నా, దేశకాలాలన్నా, ఆత్మప్రయోజనార్థంగా ఆలోచించబడతై. పంచ సంబంధాలను పరిశీలించి, సచివుల ఏకాభిప్రాయాన్ని సాధించి చేసిన కార్యం సత్ఫలాన్ని ఇచ్చి తీరుతుంది. ధర్మార్థకామాలు వేరువేరుగా

వున్నా, వాటిని అర్హకాలాల్లో అనుభవించాలి. ధర్మదృష్టితో అర్థాన్ని పొందాలి కాని, కేవల ధర్మం, కేవలార్థం అంటు ఏవీ అనుభవానికిరావు. క్రమం తెలిసి పురుషార్థాలు పొందేవాడు లక్ష్మికి ఆటపట్టు అవుతాడు. కేవలం కామపిశాచాన్ని ఆశ్రయించి బ్రదికేవాడు మానవుడూకాదు, వాణ్ణి సిరి చేరనూచేరదు. పై మూడు పురుషార్థాల్లో ఉత్తమమైనదాన్ని, నృపుడు కానీ, నృపమాత్రుడుకానీ, నిష్ఠతో అనుష్ఠించకపోతే గుండెలు పగిలేట్లు చదివి ఏ ఫలం సాధిస్తాడు? శ్రమ మాత్రమే మిగులుతుంది. సామ దాన భేద దండోపాయాలను, ధర్మార్థకామాలకు అనుసంధానంచేసి కార్య నిశ్చయాత్పూర్వం సచివులతో సంప్రదించి, నిశ్చయానికివచ్చి చేసిన నిర్ణయం కీడు ఎన్నడూ రానీయదు. ఆ విధంగా చేసినవాడెవడైనా దుఃఖాన్ని అణుమాత్రం కూడా పొందడు. శాస్త్ర మర్మాలను తెలుసుకోకుండా, పశు బుద్ధితో, ధైర్యంగా, చిత్తభ్రమలో వున్న రాజు మెచ్చేట్లు ప్రగల్భాలు కొందరు సచివులు కొట్టుతారు. భట్రాజులవలె పొగడుతారు. వచ్చే ప్రమాదం వాళ్ళకు తెలియదు. అర్థశాస్త్రానభిజ్ఞులూ, అత్యధిక లక్ష్మి సంపాదనాసక్తులూ, దురాశాపరులూ, దుర్బుద్ధులు చెప్పే హితవు పాటించే వాడు పొందే ఫలానికి నీవు ప్రత్యక్ష తార్కాణ. మాటల్లోతీపి, మనసులో చేదు పెట్టుకుని విరోధులకు రహస్యాలు చెపుతూ, అందుకు అనుగుణంగా పోషించే రాజుచేత కర్మ చేయిస్తూవుండే మంత్రులు ఎందరో వున్నారు. మహారాజైనవాడు, మధువుకంటే, మగువకంటే మత్తు కల్గించే వాళ్ళ మాటలు వినక సమయంచూచి సాగనంపాలి. కాని, ఆదరించి అధఃపతనం పొందరాదు. శాత్రవబలం తెలుసుకోక, కేవలం స్వజన బలాన్నే నమ్ముకున్నవాడు చెడిపోక ఏమవుతాడు? మన తమ్ముడు విభీషణుడు మన క్షేమంకోరి మంచి మాటలెన్నో చెప్పాడు. వాటిని నీవు నిగ్రహించావు. ఫలితాన్ని పొందావు. ఇప్పుడైనా నీవు ఆ పని చేయటం నా అభిమతం. నేను చెప్పవలసింది మళ్ళీ చెప్పాను. అంశమాత్రంచేత నీ ఇష్టానికి వ్యతిరేకంగా విభీషణునివలె ప్రవర్తించను" అని కుంభకర్ణుడు చెప్పాడు.

## రావణుడు కుంభకర్ణుని కోపించి పలుకుట

కుంభకర్ణుడు అరమర లేకుండా, శాంతగంభీరంగా, ఉపదేశం చేశాడు. కాని రావణునికది ఆ ఒప్పు, నెప్పు, తిప్పు గరళంలో కూడు కలిపినట్టయింది. కోపం తీవ్రస్థాయిని పొందింది. అసలేని ప్రమాద వానికి అవకాశం కలిగింది. ముఖంపై రాగం దట్టి కట్టుకట్టినట్టయింది. మౌనమును వదిలింది. ఆపుకోలేని ఆగ్రహంతో "ఓ జ్ఞానవంతుడవైన తమ్ముడా! అపార విజ్ఞానంగల అమాత్యునివలె నాకు నీతులు బోధిస్తావే కానిస్తున్నావేమిరా? అధిక ప్రసంగం ఆపితే మంచిది. ఈ సమయంలో చేయవలసింది చేయక వ్యాఖ్యానం చేస్తున్నావెందుకు? పొరపాటో, తెలిసిలేకనో, ఆత్మశక్తిపైగల విశ్వాసంలేకనో కార్యం చేయడం జరిగింది. "అది తప్పు, అది తప్పు" అంటూ వల్లిస్తే వచ్చే ఫలం నాకేముంది? నీకేముంది? గతాన్ని కూర్చి ఏకిస్తే ఏం లాభం? అధిగతం గాని, వర్తమానంగాని, ఏవిధంగా సాధించాలో ఆ విధంగా చేయాలేకాని, ఉపయోగంలేని ఉపన్యాసం ఎందుకు చేస్తావు? పూర్వం చెప్పిందే ఇప్పుడు మళ్ళీ చెపుతున్నావు. ఇందులో కొత్త ఏమీలేదు. అప్పుడు నీ మతానికి నా మతం ఏమిటో బోధపడిందనుకదా? వృథా దూషణభూషణ భాషణాలు ఇప్పుడిద్దరికీ వ్యర్థం. నీకు నాపైన అన్నగా అనురాగముంటే, ఆపదలో ఉన్నాడు, ఆదుకోవాలనిపిస్తే, నా అవమానం నీదిగా భావిస్తే, నేను కోరినట్లు, రామలక్ష్మణుల, వానరుల నీవు ఆహారంగా గ్రహించు. ఆపదలో ఆదుకున్నవాడే మిత్రుడు. దుఃఖంలో తోడ్పడ్డవాడే బంధువు. నేనుగా చెప్పవలసింది లేదు. నీవేది నిర్ణయించుకుంటే అది చేయి" అని దశకంఠుడన్నాడు.

## కుంభకర్ణుడు రావణుని తృప్తి పరచుట

అన్న నిందాగర్భిత, రోషభాషణాలు విన్న కుంభకర్ణుడు, వినయ మధురోక్తులతో విజ్ఞాపించాడు. "రాక్షసేశ్వరా! సంతపించకు. కోపం విడిచిపెట్టు. శాంతుడవుకమ్ము. నే బ్రదికివుండగా నీకు శోకించే అవసరం లేదు. నీ శత్రువుల రూపుమాపుతాను. నేను నీకు సోదరుడను కనుక, ఆపత్సమయంలోనైనా నిష్ఠురమని తెలిసికూడా నీకు నీతి చెప్పాను.

వినకపోతే తప్పు నాదికాదు. నాకు అన్నవేకాక, ప్రభువుకూడ. విధాత శాపంతో మృతప్రాయుడనైన నన్ను బ్రతికించింది నీవు ఈ దేహాన్ని కాపాడుతుంది నీవు. నా విపరీత క్షుణ్ణివారణకు దేవమానవ దానవహింస కాక కేవల మృగమాంసాశనభోజన భాజనాలతో తృప్తి కలిగిస్తుంది నీవు. నిన్ను నిందించటం నా ధ్యేయం కాదు. ఆ రాముని నేను చంపక వాడే నన్ను చంపితే నీ చావు తథ్యం. నీవు చావటం నాకిష్టం ఏ మాత్రం లేదు. అందుకు ఇంత చెప్పాను. నీవు రక్షించిన శరీరం నీ కోసం త్యాగం చేయలేని కాపురుషుణ్ణికాను. చావగా మిగిలినవారు సంతోషించే లాగా వానరులను పట్టివధిస్తాను. త్రిమూర్తులెదుర్కొన్నా శూలధారినై నేను సమరంలో నిలిస్తే పరాభవం పాలుగాకమానరు. నా చేతి గ్రుద్దు రాముడు భరిస్తే, రాముని బాణాలు నా నెత్తురు త్రాగుతై. నాకు సైన్యంతో పనిలేదు. ఆయుధాలతో అంత కన్నా పనిలేదు. నా రెండు చేతులే నాకుచాలు. బాహువుల్లో వలలో చేపల్లాగా వానరులను బంధించి నల్లులనలిపినట్లు నలుపుతాను. మధు పానంతో నంజుడులాగా క్రోతుల నాల్కకు రాచుకుంటాను. ఈ బ్రహ్మాండ కటాహాన్ని నా అరచేతులతో చలిమిడి ముద్దచేస్తాను. సంశయంవద్దు. నేనాగ్రహిస్తే సూర్యచంద్రులు గతులు తప్పుతారు. అగ్ని చల్లారి ఆహారం అవుతుంది. శతమఖుణ్ణి బలిపశువుచేసి మ్రింగుతాను. నీవు నీవాళ్ళతో నేవచ్చేదాకా, ఇహ సుఖాలన్నీ ఇష్టంతీరేట్టుగ అనుభవించు. నేపోతాహతుడుకాగ రాముడు అక్షయంగా సీత పొందకలుగును నీవు శోకింపవద్దు. నాతో నిద్రించిన నా సర్వశక్తులు నాతోనే జాగృతాలైనై" అని.

## మహోదరుడు కుంభకర్ణుని మతాన్ని ఖండించుట

ప్రతిపక్ష భయంకర బాహార్గళుడైన కుంభకర్ణుని మాటలకు మహోదరుడు అసంతృప్తుడై, "కుంభకర్ణా! పుట్టింది గొప్పవంశంలోనే కాని బుద్ధిలేదు. ప్రాకృతుడులాగా గర్వంతో ప్రగల్భాలు పలుకుతున్నావు. కార్యంలో లోతుపాతులు తెలుసుకోలేక బాలుడువలె భాషిస్తావెందుకు? నీదేమతం? ఏమిరాజనీతి? త్రిలోక శాసకుడైన రాజుకు నీతి తెలియదా?

నోటికి వచ్చినట్లు మాట్లాడావు. జ్ఞానంచే పెద్దగాక వయస్సుచే పెద్దయైన వాడు పలికినట్లే వుంది నీ నీతి. ధర్మార్థకామాలు తెలిసి ఆచరిస్తే మంచి ఫలితం వస్తుందన్నావు. దానికి తగినలోకానుభవం ఏదైనావుంటే చెప్పు. దేనికి ఏ ఫలం వస్తుందో నేనూ వింటాను. అన్నిటికీ ప్రధానమైంది కర్మే కదా? కర్మలేకుండా పురుషార్థసిద్ధులెలా వస్తాయో నిరూపిస్తావా? పాపులకు శ్రేయం కల్గటం, పుణ్యపురుషులకు పీడకల్గటం లోకంలో చూడటంలేదా? అధర్మంగా వున్న అనర్థ కార్యాలు ధర్మార్థ కామాలు తెలిసిచేస్తే వచ్చే ఫలాన్ని ఇస్తున్నైకదా? ఇంక అన్నిటికీ ధర్మమే మూలం అని ఎలావాదిస్తావు? అచ్చంగా పుణ్యకర్మలు చేస్తేనే ఐహిక సౌఖ్యపరత్ర భోగాలు వస్తాయని లోకులంటుంటారు. స్వైరవిహారంగా ప్రవర్తించేవాణ్ణి సర్వసౌఖ్యాలు ఎందుకు పొందుతున్నై? మన ప్రభువు అర్థకామాలలో, అర్థం అనంతంగా వుండటంచేత కామాన్ని ఆశ్రయించి సుఖపడకోరటంతప్పా? మాకు మాత్రం ఆ మార్గం సమ్మతమే. అందులో శాత్రవులపట్ల చేసే ప్రతి కార్యం ఆనంద కారణమే. ప్రభువు చేసిన తప్పేమిటో చెప్పగలవా? నేను ఒక్కణ్నే యుద్ధం చేస్తానన్నావు. అది నీకు తప్పని చూపిస్తాను. రాక్షస లోకంలో పేరెన్నికకన్న ఖర దూషణాదుల పదునాల్గువేలమందిని ఎవడు జనస్థానంలో వధించాడో, ఎవడిచేత నీ అన్న ఇంత ఇంత చింతకు గురి అయినాడో, ఎవడిపేరు చెపితే ఇప్పటికీ వాళ్ళ బంధువులు నిద్రపోరో, ఆ రాముని మార్కొనటానికి నీవొక్కడవుపోతావా? పోయి నీ అన్నకు విజయం తెస్తావా? నమ్మతగిన మాటేనా? క్రుద్ధ కేసరి వలె నున్న రాముణ్ణి రాక్షస లోకం తేరిచూడలేకపోయిందే? అసహాయుడవై నీవొకనితో అది చేస్తావా? నీవు ఒక్కడవుకాక ససైన్యంగా పోవటం నాకిష్టం. రాముడు మానవుడేకాని ఇతనివంటివాడు ఈ లోకంలో ఇంతకుపూర్వం పుట్టలేదు. ఇకముందుకూడా పుట్టడు. నీకు పోలిక చెప్పాలంటే వజ్రపాణి ఒకడు. భాస్కరుడు ఒకడు. వీళ్ళను ప్రభువు స్వాధీనం చేసుకున్నాడు. కాని, ఈతడు కాలేదు. భేదం తెలుసుకో. ఎందుకు సుఖంగా వున్న ప్రాణాన్ని కష్టపెడతావు?" అని పల్కి రావణుని చూస్తూ, "ప్రభూ! నేను మీకొక హితం చెపుతా" నన్నాడు.

## రావణునకు మహోదరుడు ఉపాయంచెప్పుట

"నేను చెప్పేది నీకు సమ్మతమైతే నా వాక్యాలు ఆలకించు. ఈ యుద్ధానికి కారణం సీత. ఆమె నీ చేతిలోనే వుంది. దానికోసం ఇంత విచారం ఎందుకు? ఆమె నీకు తనంత స్వాధీనురాలు కాలేదనికదా నీ బాధ? కుంభకర్ణుడు, నేను, ద్విజిహ్వుడు, వితర్దనుడు, సంహాద్రి, మేం అయిదుగురం కలసి రామునితో పోరాటానికి పోతాం. ఈ విషయం పట్టణంలో చాటింపు వేయించు. మేం మా శక్తి కొలది యుద్ధం చేస్తాం. మేం జయిస్తే ఉపాయంతో పనేలేదు. మాచేత రాముడు నిహతుడు కాక మేమే ఆతని చేతిలో హతులమయితే కార్యమేలేదు. మేం చావకముందే చేయవలసినదాన్ని ఆలోచించి వుంచాను. మేమే బాణాలతో శరీరాలను గాట్లుపెట్టుకుని, రామనామాంకిత మార్గణ చిహ్నాలుగా చూపిస్తూ రామ లక్ష్మణుల చంపినట్లుగా సింహనాదాలుచేస్తూ నీ వద్దకు వచ్చి వ్రాల్తాము. అప్పుడు మాకు బహూకృతులిస్తూ ఏనుగుపై ఈ వార్తను పురమంతా చాటించు. భటులకు, తక్కినవారికి వివిధ పదార్థాలు దానంచేయి. నీవు ఆనందంగా మదిర త్రాగు. సుగంధ ద్రవ్యాలను శరీరంలో అలదు. క్రమంగా ప్రథ లంకంతా వ్యాపిస్తుంది. నీవు చల్లగా చేరి మంచి మాటల తోనో, అబద్ధాలతోనో, రత్నకాంచనాది వస్తుసంతానంతోనో ఆశ రేకెత్తించి స్వాధీనం చేసుకో. అంతతో నీ మనశ్శల్యం అంతరిస్తుంది. ఆడవాళ్ళ బుద్ధి క్షణ చపలం. భర్త మరణంవిని మనసు మార్చుకోవచ్చు. ఇక వేరే దిక్కులేక నీవే దిక్కని భావించవచ్చు. ఇది నాకు తోచిన అవాంతర కార్యం. ఈ మార్గం నీ సోదరునికి కూడా మంచిది. కాదని పోతే కాలధర్మం పొందటం ఖాయం. కుంభకర్ణా! విన్నావుకదా? ఆ విధంగాచేసి చిరకీర్తి పొందటం నీకు శ్రేయం" అని చెప్పాడు.

## కుంభకర్ణుడు మహోదరుని నిందించుట

కుంభకర్ణుడు ఆ మాటలు విని క్రోధాన్ని పొందాడు. "ప్రభువు పన్నుగడలు అసరాగా చేసుకుని హద్దులు దాటి పలికిన మహోదర మంత్రి వర్యా! మౌనంగా వుంటే నీ గౌరవం చివరంట దక్కేది. రాజనీతి విశారదునిలాగా ఉపదేశన ప్రారంభించావు. అధమాధములు కూడ

చేయని ఆలోచన చేశావు. పౌరుషవంతులు, అభిమానులు, వాక్శూరులు కారు. నీవేదో విషయాన్ని లోతుగా చూచావని చెప్పావు. నీవు చూపిన ఉదాహరణలు బాహ్య స్వరూపాలేకదా? "పాపులు సుఖపడుతున్నారు. పుణ్యాత్ములు బాధపడుతున్నారు" అన్న నీ మాటలు లోతెరింగి పల్కిన వేనా? అన్నింటికీ కర్మ మూలం. కాదని ఎవరన్నారు? కర్మంటే లక్షణం లేక చేసేపని. దీనికి లక్ష్యం ఏమిటి? లేక కారణం ఏమిటి? కార్యం కారణ రహితంగా, అంటే ప్రయోజన శూన్యంగా ఎవరైనా చేస్తారా? కారణం కామవాంఛ అయినట్లయితే కర్మదాన్ని క్షేమంగా పొందేందుకు చేయాలె కాని సర్వనాశనం కోరి ఎవ్వరు చేయరుకదా? వర్తమానంలో పాపకర్మలు చేసే వ్యక్తి లౌకికదృష్టిలో భోగాలు అనుభవిస్తున్న మాట నిజమే. అందుకు ఎప్పుడూ వర్తమాన కర్మ కారణం కాదు. జన్మాంతరకర్మ. వెనుక మంచికర్మలు చేశాడు. వాటి ఫలితం ఇప్పుడు పొందుతున్నాడు. ఇప్పుడు పాపకర్మలు చేస్తున్నాడు. భవిష్యజ్జన్మలో అనుభవిస్తాడు. అంతేకాని, ఈనాడు చేస్తున్న కర్మ ఫలం కాదు. కాని, ఇప్పటి కర్మ ఫలమే కలిసివస్తున్నట్లు కనుపిస్తుంది. అందుకు ప్రత్యక్ష్యంగా నా అన్న జీవితాన్నే ఉదాహరిస్తాను. మహా ఘోర తపస్సు చేశాడు. ఆత్మ లింగార్చనతో శతకోటి శివాలయాల్లో విశ్వరూపంతో అర్చన చేసి ప్రతి లేని శివపూజాధురంధరుడని పేరు కన్నాడు. ఈ సుకృత ఫలం సర్వలోక శాసనకర్తగా చేసింది. తర్వాత పాపకర్మలకు పాల్పడ్డాడు. సుకృత ఫలం నశించేవరకు పూర్వకర్మఫలం అనుభవిస్తూనే వున్నాడు. పొందిన వరాల్లో లోపం, చేసిన సత్కర్మలో బలం తగ్గగనే పాపకర్మ ఫలంలో చేరింది. అనుభవానికి వస్తూంది. మీరంతా దేవతలను ఓడించినవాళ్ళే. కోతులతో తన్నులెందుకు తిన్నారు? ఎందుకు చస్తున్నారు? ప్రవాహం వుంది. పారుతూంది. మనకు పై నుంచి పారుతున్నట్లే కనుపిస్తున్నది. కాని, దానిగమనం అధోముఖంగా జరుగుతుంది. నీవు చెప్పిన సలహా శాస్త్ర సమ్మతమూ కాదు, యుక్తి సహమూ కాదు. కృత్రిమంగా రాముణ్ణి చంపి, బహుమానాలు పొందుతావా? అంతపాటిదేనా నీ పరాక్రమం? అందుకేనా ఇంత నోరు పారేసుకున్నావు? మానవుడని చెప్పే రాముని ఎదుట పడలేక, దొంకదారిన

బ్రదుకచూచే నీవు నాకు శ్రీరంగనీతులు చెపుతున్నావా? నన్ను కూడా పోవద్దని చెప్పి అన్నకు కృతఘ్నుడుగా నన్ను జీవించమంటావా? అన్న కోసం నేను చేయంది లేదు. మీరిందరున్నా నన్నెందుకు లేపాడు? అన్న తత్త్వం నాకు తెలుసు. కొడుకు ఇంద్రజిత్తూ, నేనూ ఆయనకు రెండు భుజాలం. మా అన్న కరుణా హృదయం అపార సముద్రం కనుక, నీవంటి కాపురుషులకూ, పండితమానులకూ, బాలిశులకూ, ఇచ్ఛకమాడు లకూ, హీనబుద్ధులకూ ఆశ్రయం ఇచ్చింది. తిన్నఇంటివాసాలు లెక్కించి నట్లు ఆయన చేటుకు మీరంతా కారకులైనారు. ఆనాడే మీరు విభీష ణాదులు చెప్పిన హితోక్తులు పాటించినట్లయితే ఇంత విపరీతం వచ్చేది కాదు. నా అన్న బలహీనతను బాగా తెలుసుకున్నారు. ఆయన అనుకున్నదాన్ని ప్రతిఘటిస్తే వెంటనే విరోధిగా చూస్తాడు. త్రికరణశుద్ధిగా ఆయన క్షేమం కోరేవాళ్ళం కనుక విరోధం వచ్చినా హితం చెప్పాం. మీ మంత్రాంగం, నిత్యకళ్యాణం, పచ్చతోరణంగా, మూడుపూలు, ఆరుకాయలుగా, విజయలక్ష్మి విలాస భవనంగా, సకల దైత్య, దానవ రాక్షసలోక సంరక్షకంగావున్న లంకా నగరాన్ని, రాజ శేషంగా, నిర్వీర్య సేనా సుహృద్బాంధవంగా, శూన్య సమస్తకోశంగా చేసింది. నీ యుక్తి నా అన్న ప్రయోగించిన రెండు యుక్తులకంటే గొప్పదా? పతిశిరశ్చాపాలు చూపించాడు. మూర్ఛాగతులైన దాశరథుల చూపించాడు. ఆ దృశ్యాలకే చలించని సీత, నీ పారుబోతు యుక్తికి వశ పడుతుందా? సీత అన్నకు ఎన్నడూ దక్కదు. నే జీవించి వుండగా, లంకకుగానీ, లంకేపతికిగానీ ఏమాత్రం ప్రమాదం రానూరాదు. నేను మరణిస్తే అన్నకూడా మరణిస్తాడు. శాప సంబంధమైన నిద్రా కాలంలో నేను బలవంతంగా లేపబడటం నాకుగాని, నాపై ఆశపెట్టుకున్న అన్నకు కాని శుభ సూచకంకాదు. అసదృశ మాయాయుద్ధ ప్రవీణుడు ఇంద్రజిత్తు కూడా ఈ దైవ వైపరీత్యాన్ని నిరోధించలేడు. మీ దుష్ట మంత్రాంగ ఫలంగా వచ్చిన జాతి నాశనాన్ని యథాశక్తి వారించ యత్నిస్తాను. కాదా? అన్నకోసం ఆహవంలో ఆనందంగా దేహత్యాగం చేస్తాను. వీర లోకాన్ని చూరకొంటాను. నన్ను జయించినవాడే నా అన్నను కూడ

జయిస్తాను. అగ్రజా! వ్యధపడవద్దు. వింధలేక బొందిపోదన్నారు. సీత నీకు నిమిత్తం, నాకు నీవు నిమిత్తం. ఇందరిని పోగొట్టుకుని, ఇంత అల్లరిపాలై, అవమానం పొంది, సీతను ఇప్పుడు రాముని కర్పించి జీవించటంకంటే, నీ లక్ష్యంకోసం నీవూ, నా లక్ష్యంకోసం నేనూ, వీరులంగా పోరి మరణించుదాము. నా పతనానంతరం నీవు యుద్ధం మాన వద్దు. అనిమిత్తాలెన్నో అప్పుడే లంకలో చూచాను. ఈ యుద్ధం కుల క్షయానికే వచ్చింది. ధర్మం బలం పుంజుకుంటూంది. అధర్మ క్షయం జరిగి తీరాలి. అందుకు మన యిద్దరం అడ్డంగా వున్నాం. నీవు వేద మూర్తివి. మహా తపస్వివి. సర్వశాస్త్రపారంగతుడివి. అయినా వివక్ష ఎరుగని అంధకాముకుడివి. గతం నశోచామి, కృతం స్మరామి. నా నిశ్చయం విన్నావుకదా? నాకు అనుజ్ఞతో ఆశీస్సులనిచ్చి పంపు" మంటూ కుంభకర్ణుడు భూత భవిష్యద్వర్తమానాలను సింహావలోకనం చేశాడు.

## రావణుడు మెచ్చి కుంభకర్ణుని ఒంటిగా యుద్ధానికి పోవద్దని చెప్పుట

అసురేశుడు తమ్ముని మాటలు విని పొంగే ఆనందంతో ఆలింగనం చేసుకున్నాడు. "తమ్ముడా! నూటికి నూరుపాళ్ళు సత్యం చెప్పావు. నీవు చెప్పినట్లే చేస్తాను. ఈ మహోదర మంత్రి మాటల మాటున దాగాడు. రాముని చేతిలో నేనే అవమానపడివస్తే ఈతడు రాముని ఎదుటికిపోతాడా? అందుకే నా అర్ధప్రాణమైన నిన్ను లేపాను. నీ వొక్కడవే ఈ ముప్పు దాటించే తెప్పవు. శూలపాణివై ఆ శూలపాణివలె, పాశపాణివలె కదనా నికి పోయి, కపులనూ, రామలక్ష్మణులను కడుపార భక్షించు. నీ ఆకలికి తగ్గ ఆహారం సమకూడింది. సార్థకం చేసి నా దుఃఖోపశమనం చేయి. నిన్ను చూస్తే కపులు కాలికి బుద్ధిచెపుతారు. అందితే ఆహారం అవుతారు. సైన్యం స్థితి చూచి దాశరధులు గుండెలవిసి చస్తారు. నీ రాకకు ఎదురుచూస్తూ శోకం మరచి కర్తవ్యాన్ని కఠినంగా ఆలోచించి పాలిస్తాను" అని చెప్పుచూ కేతుగ్రహ విర్ముక్త భాను బింబంలాగా సభలో సింహాసనంపై భాసింనాడు. అన్న కోరిక మేరకు

కుంభకర్ణుడు యుద్ధ సన్నాహం చేయించి. కాలాయసమూ, కనకభూషితమూ, శక్రవజ్రసన్నిభమూ, సాధ్వసదమూ, దేవ యక్ష దైత్య దానవ గంధర్వ సూదనమూ, వమదుగ్రవహ్నిజ్వాలమూ, అసమతేజమూ, దీప్తమూ, ధృతరక్తమాల్యమూ, శాత్రవశోణిత రాగరంజితమూ, నిరంతర పూజాతృప్త బలిష్ఠసత్త్వమూ, అయిన శూలాన్ని హస్తంలోదాల్చి, అన్నదిక్కై, "అగ్రజా! అమరపతీ నేను పోతున్నాను. నా సైన్యమంతా ఇక్కడే వుంటుంది. నా కవసరమైతే పిలిపించుకుంటాను. అంత మహాయోధులముందు వీరెంత? సెలవు" అని అన్నాడు. "తమ్ముడా! నీవు ఒంటరిగా పోవద్దు. ధ్వజనీచయం సేవించగా, సర్వాయుధాలు ధరించి పదాతివర్గం పరివేష్టించిరాగా, మహారాజువలె రణాంగణానికి పో. కపులు శౌర్యవిక్రములు. వేగవంతులు. సాహసులు. ఆహవధురంధరులు. నీవు ప్రమత్తుడవు. నీకు ముందుచూపేకాని వెనకచూపులేదు. ఏమరుపాటులో వుంటే వాళ్లు కోరలతో, గోళ్ళతో, ముసలముద్గర శూల గదాది సాధనాలతో చేయలేని హింసచేసి చంపుతారు. వాళ్ళ యుద్ధపద్ధతే వేరు. అది వాళ్ళ నాయకులకూ, వాళ్ళకే తెలుస్తుంది. అందువల్ల నీకు తోడుగా సైన్యం వుంటుంది" అంటూ, గిరి నిర్గత కంఠీరవంలాగా సింహాసనం దిగి, మదదంతావళంవలె నడచివచ్చి, సర్వాభరణ భూషితాలై, అనంత వాసుకులవలె బలిష్ఠాలైన బాహువులు చాచి, ప్రియమార కౌగిలించి, కంఠంలో వెలిగే సర్వ రత్న స్థానమైన కాంచనమణి మాల గళభూషణం కావించాడు. చెవులకు బంగరు కుండలాలు అలంకరించాడు. సువాసనా వాసితమైన పుష్పదామాలతో, సుగంధలేపనాలతో శరీరాన్ని శోభావంతం చేశాడు. అన్న చేసిన అలంకరణలతో హవనం ప్రేల్చిన అగ్నిలాగా కుంభకర్ణుడు దేదీప్యమానంగా ప్రకాశించాడు. శ్రోణీసూత్రధారణంతో వాసుకి పరిబద్ధమందరాద్రిలాగా వున్నాడు. స్వర్ణభారసహం, నివాతం, అకాండ విదార్యం, వైద్యుత తేజోంచితం, అయిన కవచాన్ని ధరించి, మహాత్ముడూ, వీరుడూ అయిన కుంభకర్ణుడు సంధ్యారుణ రంజితశైలంలాగా ప్రతిభాసించాడు. వామనుడు కార్యార్థియై త్రివిక్రముడైనట్లు అతను ఇంకంత పెరిగి అన్న పాదాలకు ప్రదక్షిణ నమస్కారాలు చేసి, ఆలింగనం చేసుకుని ఆహవరంగానికి అభిముఖంగా నడిచాడు.

## కుంభకర్ణుడు యుద్ధానికి పోవుట

కుంభకర్ణుడు అన్న ఆదరాభిమాన గౌరవాలను అందుకొని సింహధ్వని చేస్తూ పోరాటానికి పోతుంటే, పురజనులు పుష్పాలు చల్లారు. అతివలు హారతులెత్తారు. శంఖభేరీభాంకారాలు సంకులంగా రేగినై. రథగజతురగపదాతులు విపరీతోత్సాహంతో వెంటనంటిపోయినై. బహువిధ మృగయూథాధిరోహులై వీరులునడిచారు. ముందు నడుస్తున్న భీమరూపుడు, అస్రగంధమత్తుడు, నూరువిండ్ల వెడలుపూ, ఆరునూర్ల ఉన్నతీ, రథచక్రాలవంటి నేత్రాలూ, రౌద్రరూపం, శైలసన్నిభాంగం, వృక్షదగ్ధశైలోపమ తనువూ, గహ్వరాస్యంగల కుంభకర్ణుడు వెడ నవ్వుతో తన వారిని చూచి "దైత్యనాథులారా! మిడుతలపై చిచ్చు పడ్డట్లు కోతి గుంపుపై పడతాను. కానీ, అవి నాకేం అపకారం చేసినై? మావంటివాళ్ళ ఉద్యానవనాలకు శోభకల్గిస్తూ ఉండవి. మన నగరానికి ప్రమాదం తెచ్చింది మానవులైన రామలక్ష్మణులు. వాళ్ళను చంపితే ఇక యుద్ధంలేదు. ముందే వాళ్ళను వాతపేసుకుంటాను. ఆ దిక్కుకే పోదాం పదండి" అనగానే అసురులంతా ఆర్భాటాలు చేశారు. దాశరథుల పోటు కుంభకర్ణుని ప్రేటుతో ముగుస్తుందని నిశాటులు సంతోషించారు. రావణానుజుడు రాముని దిక్కు నడుస్తుంటే వెనుకటి వీరులకు తోచిన దుర్నిమిత్తాలన్నీ తోచినై. తెలిసికూడా కాలచోదితుడైన ఘటకర్ణుడు ముందుకే సాగాడు. వచ్చే భీమరాక్షసుని ఆకారం చూచి భీతితో కొందరు వానరులు చచ్చారు. ఊర్పుల గాలికి నిల్వలేక మరికొందరు చచ్చారు. పదఘట్టనానికి కంపించే భూమి చలనానికి సురిగి కొందరు చచ్చారు. వాతాహతికి మేఘాల్లాగా, ప్లవంగ సేన బగ్గంపాడుగా పోరిలో నిల్వలేక పారిపోయింది. తన రాకతోనే కీశసైన్యం తమంతతామే చస్తూ పారిపోతుంటే చూచి రాక్షసశ్రేష్ఠుడు నవ్వుకున్నాడు. వెంటపడ్డాడు. అందినవాళ్ళను ఆహరించాడు. ఆగచరులు అదుపుతప్పారు.

## పరుగెత్తే వానరులకు అంగదుడు ధైర్యం చెప్పుట

"కపియోధులారా! ఎందుకు పారిపోతున్నారు? ఇంతవరకు రాని ఉపద్రవం ఇప్పుడేమి వచ్చింది? నల నీల గవయగవాక్షదులంటే రాక్షసు

లకు గుండె గాలంగా చేసిన మీరు నిర్హేతుకంగా పారిపోతున్నారెందుకు? ఇప్పటికి ఎరుగని పిరికితనం ఇంతలో ఎలా వచ్చింది? మీరు ప్రాకృత వానరులుకారే; పారిపోవటానికి? మృత్యువుపోయినచోట లేదా? సంగరంలో చచ్చి యశఃకాయులు కాకుండా నీచపు చావు చస్తారా? మీ పరాక్రమానికి రాక్షసులు వెరచి రాక్షసాకారంతో యంత్రపు బొమ్మను యుద్ధంలోకి తెచ్చారు. మాంసాశనులు మాయావులని మీకు తెలుసుగదా? పైపై పర్వతాలు పడవేయటం కాకుండా నేలపై పడేట్లు చేయటం నేర్పరితనం. అంతా వెనుకకు రండి. కలసికట్టుగా ఆ బొమ్మను భూపాతం చేద్దాము" అంటూ అంగదుడు అగచర వీరుల మరలించి యుద్ధానికి పురికొల్పాడు. యువరాజు చేకూర్చిన ఉత్సాహబలంతో వెనుకటిలాగా శైల వృక్షాలు ధరించి పోరుకు తారసిల్లారు. ఎంతెంత పర్వతాలు ఎంత బలంగా విసరినా అతని చేరువకే పోవటంలేదు. మధ్యలోనే కూలి రాక్షస సైన్యాన్ని నాశనం చేస్తున్నై. వీళ్ళు వేసే చెట్లకు, కొండలకు, శిలలకు వాడుకూలం తాకిస్తే చాలు సహస్ర శకలాలై నేలపడిపోతున్నై. వానరులుచేసే ఆగడానికి రాక్షస నాయకుడు ఉగ్రుడై అడవిలో పడ్డ కారుచిచ్చులాగా అపారంగా కపి సేనను హతం చేశాడు. అతని ధాటికి ఆగలేక చెట్టుకొకడు పుట్టకొకడుగా పారిపోయారు. కొందరు దాగుకున్నారు. కొందరు సముద్రంలో మునిగారు. కొందరు కొండలకెగబ్రాకారు. మళ్ళీ అంగదుడు అడ్డుకుని ధైర్య వాక్యాలు చెప్పాడు. అంతటిపేరులు ఎవరూ వినిపించుకోలేదు. నెత్తి నోరు పెట్టుకుని సహేతుకంగా ఎన్నో విషయాలు చెప్పాడు. ఎలాగో పావని మైందద్వివిదాది మహాకపులుమరానికి దొరకున్నారు.

## వేరువేరుగా కపులు కుంభకర్ణునితో పోరి ఓడిపోవుట

ద్వివిదుడు సాహసంతో ముందుకువచ్చి రాక్షసభూతాన్ని ఎదుర్కొన్నాడు. ఎడతెరిపి లేకుండా శైలవర్షం కురిపించాడు. దావన ప్రవాహానికి తాకక సైన్య మధ్యంలోపడి సర్వనాశనం అవుతూంది. స్వీయ వాహినీ నష్టానికి రక్కసులు చెలరేగి కపిసేనపై విజృంభించారు. కపులు కూడ వెనుదగ్గక ఎదిరించి పోరారు. ఉభయపక్షాల సైన్యం

విపరీతంగా నష్టపడింది. పావమాని మధ్యలో ప్రవేశించి గగనచరుడై పర్వతవర్షం పైనుంచి తలపై వర్షించాడు. రాక్షసుడు శూలం అడ్డపెట్టాడు. తునాతునకలై కూలిపోయినై. వాడు అంతతో వూరకోక ప్లవగుల ప్రాణాలు బలిగొనసాగాడు. కోపంతో హనుమ కొండతో ఎదుట ప్రత్యక్షమై గుండెను గురిచూసి కొట్టాడు. ఇంతవరకు శత్రువుల ప్రతీకార చర్యలు శరీరం సోకని సోకుడేదు హనుమ విసరిన శైలం గుండెకు తగిలి ఆక్రోశించాడు. కాయం చిట్లి రక్తం కాల్వలు కట్టింది. బాధతోనే వాడు శూలం వైచి హనుమ వక్షం బద్దలుకొట్టాడు. ఆ శూలఘాతానికి మారుతి విహ్వలించాడు. కొంతకాలం దిమ్మరపోయి నేలసోలాడు. కపులు హనుమపాటు చూచి కకావికలు కాసాగారు. నిల్వరించి నీలుడు పర్వత వృక్షాలతో పలలాశనునిపై పడ్డాడు. వాడి బాహాల కందకుండా నీలుడూ, నీలుని రాళ్ళ దెబ్బలకు తప్పుకుంటూ రాక్షసవీరుడూ కొంతసేపు పోరాడారు. చివరకు నీలుడు తెంపుచేసి నిశాటుని సమీపించిచేకొలది శైలాన్ని విసిరాడు. వాడు దాన్ని కుడిచేయి ముష్టితో గ్రుద్దాడు. మిణుగురులు చిమ్ముతూ, రాయి గుండ్లుగా బ్రద్దలైపోయింది. శరభ నీలగవాక్ష గంధమాదన ఋషభులైదుగురు తలపడి నాల్గువైపుల చేతులతో, కాళ్ళతో, గోళ్ళతో మహారాక్షసుణ్ణి మర్దిస్తుంటే చీమలు పాకినట్లుగా భావించి, ఋషభుని రెండు చేతులతో నలిపాడు. గంధమాదనుని కాలదన్నాడు. శరభుణ్ణి మోకాలితో క్రుమ్మాడు. నీలుణ్ణి చెంపపై తాచాడు. గవాక్షుణ్ణి కంఠం నులిమాడు. వాళ్ళు నెత్తురు గ్రక్కుతూ నేలపై పడ్డారు. వానర ముఖ్యులు పడిపోగానే, వానర సైన్యాన్ని దోసకాయలవలె నోటిలో వేసుకోసాగాడు. కుక్షిలోపడ్డ కోతి మూకలు, చెవుల్లోనుంచీ, ముక్కుల్లో నుంచీ చావకుండా వెలికివస్తుంటే ఆ బాధకు హా అని నోరు తెరువగానే, నోటిలోనుంచి వేలకువేలు కపులు వెడలివచ్చి పారిపోయారు. మదించి ఆలానం తెంచుకొని వీథివిబడ్డ మాతంగంలాగా కదనరంగమంతా కలయతిరిగాడు. చచ్చిన వానర రాక్షససేనతో రణరంగం భీతావహంగా వుంది. అడ్డం లేక తిరిగే ఆ క్రూర దానవుణ్ణి అంగదుడు అడ్డగించి అతిదారుణంగా పోరు సల్పాడు. బలియుడైన అంగదుడు పెట్టిన పీడహింసలు సహించలేక శూలాన్ని విసిరాడు. ఆ శూలలక్ష్యాన్ని అతి లాఘవంగా తప్పుకుని తానే

యుడు పైకిలంఘించిముష్టితో మూతిపై మోదాడు. ఆ దెబ్బకు అంత కాయం ఆపాదమస్తకం అతి ఘోరంగా చలించిపోయింది. స్మృతిహీనుడై, వెంటనేలబ్ధజ్ఞానంతో ఎడమచేతితో వీపుపై గ్రుద్దాడు. విసంజ్ఞుడై వెంటనే నేలపడ్డాడు.

## సుగ్రీవుడు కుంభకర్ణునితో పోరుట

అంగదుని పాటుచూచి రవిపుత్రుడు క్రుంగిపోయాడు. మరుక్షణం కోపఘూర్ణితనేత్రుడై నాడు. ఇంతలో రాత్రించరుడు సుగ్రీవుని సమీపించాడు. పర్వతాన్ని కేలపట్టి ఎదురుగాపోయి "నిశాటశేఖరా! కేశవీరులను త్రుంచావు. వానర సైన్యాన్ని భక్షించావు. ఇంతవరకు ఎవరికి దక్కని కీర్తి నీకు దక్కింది. ఇక మర్కట మారణం చాలించి నాతో పోరు" అని ఆహ్వానించిన సుగ్రీవుణ్ణి అట్టె తేరిపారచూచి కుంభకర్ణుడు "సుగ్రీవా! విధాతకు మనుమడవై, ఋక్షరజస్సుతుడవై, వినుత బలశాలివై ప్రేలుతున్నావెందుకు? నన్నెరుగవా?" అని నవ్వాడు. అపహసిస్తున్న అసురుణ్ణి వక్షస్థలం వ్రయ్యలయ్యేట్లు పర్వతంతో కొట్టాడు. "వానరా! నీ పర్వతానికి నా రొమ్మనే అద్దం పెడుతున్నా" నంటూ వక్షం విరిచి నిలుచున్నాడు. అతనిగుండె తాకి పర్వతం బ్రద్దలైంది. కపులు గగ్గోలు పడ్డారు. రాక్షసులు రంకెలు వేశారు. పట్టుదలకు గుండె విచ్చినా తగిలిన దెబ్బకు తలక్రిందులైనాడు. అంత దెబ్బ అతడంతకు పూర్వం తిని వుండలేదు. చేతిలోని శూలాన్ని వానరేశ్వరుని చంపే వాంఛతో చేకొలది విసిరాడు. ఈశ్వరుడవిశూలంవలె పరాతంకంగా రవిసుతుని లక్షించవస్తున్న దాన్ని మారుతి నడుమలోనే ఒడిసిపట్టి మోకాలు సాయంతో ఫెళ్ళున విరిచాడు. కుంభకర్ణుని శూలం గోగుకట్ట విరిచినట్లు విరిచిన హనుమంతుని వానరులు జే జే అంటూ ప్రశంసించారు. వేయి బారువుల బరువుతో ప్రేగయిన ఉక్కుశూలాన్ని విరచి వేయటంచూచి రాక్షసుడు ఉగ్రుడై లంకలో వున్న మలయ పర్వతం పెకలించి దానితో నెత్తిపై కొట్టాడు. కులిశాహతికి పర్వతం కూలినట్లు సుగ్రీవుడు ఘటకర్ణుశైల ఘాతంతో నేలకూలాడు. రాత్రించరులు గర్జనలు చేస్తుండగా పడిన సుగ్రీవుణ్ణి ఎత్తి చంకపెట్టుకుని మేఘాన్ని వాయువువలె లంకకు

కొనిపోతున్నాడు. ప్లవంగ లోకం ప్రభువు ప్రతిపక్షిచే మూర్ఛితుడు కావటం, లంకకు కొనిపోవటంచూచి, ఘోరంగా దురపిల్లసాగింది. రావణానుజుడు సుగ్రీవుడు చిక్కినట్లే కపులు, దాశరథులు చిక్కుతారని తనలో ఎంతో సంతోషం పొందాడు. తన ప్రభువు చిక్కటం, కీశులు పారిపోవటం శత్రుంచేసినట్లుకాగా, "దీనికి ప్రతివిధానం ఏమిచేయాలి? కార్యంతప్పి వచ్చింది? నాఎదుట నా రాజు పరాభూతుడై శాత్రవునకు చిక్కితే చూస్తూ ఊరుకోవటం ఎలా? ఆ క్రూరవికంటె అధిక శరీరధారినై బ్రహ్మ వరబలం గ్రహించి నిలువునా కూల్చనా? చంపకుండా హింసించి ప్రభువును విడిపించనా? నాకు ఇప్పుడు న్యాయమార్గం ఏది? నా ప్రభువు మాత్రం సామాన్యుడా? వాలితప్ప ఆతని నిగ్రహించే శక్తి ఎవరికీ లేదు. స్మృతిహీనుడు కావటంచేత శత్రువుకు చిక్కాడు. కాని, తెలివిరాగానే లోకాన్నే పిండి చేస్తాడు. కుంభకర్ణుడొకలెక్కా? కావని నేనిప్పుడు సాహసంచూపి విడిపించితె స్తే శాశ్వతంగా ఆమహాత్ముని కీర్తికి కళంకం వస్తుంది. ఒక ముహూర్తకాలం ఓపిక పట్టుతాను. ఈ లోపల తేరి విముక్తిమార్గం ఆయనే ఆలోచిస్తాడు. అప్పటికీ ఆయన రాకపోతే, లంక దక్కుతుందా? లంకేశుడు దక్కుతాడా? కుంభకర్ణుడు దక్కుతాడా? విశ్వవిలయమే కలిపిస్తాను. నా ప్రభువును ప్రతిపక్షికి దక్కనిస్తానా?" అని హనుమ అనేక విధాల ఆలోచన చేశాడు. కుంభకర్ణుడు సుగ్రీవునితో లంకా రాజమార్గంలో ప్రవేశించాడు. విజయుడై వస్తున్న రాక్షసవీరునిపై ఇరువంక ఉన్నతసౌధాల పైనుంచి లాజగంధోదక పుష్పాలు పౌరులు కురుస్తున్నారు. మలయ మారుతం హాయిగా వీస్తుంది. శాత్రవునకు జరిగే మర్యాద రవిపుత్రునకు శైత్యోపచారమైంది. తెలివి వచ్చింది. ఒడలు తెలియని మత్తుతో పోతున్న వైరిచంకలోనుంచి జారి, చప్పున ఉప్పరానికి లంఘించి భుజాలపై వ్రాలి ముక్కు కొరికి, గోళ్ళతో చెవులు పెరికాడు. కర్ణనాసికాచ్ఛేదంతో నెత్తురు మడుగులో మునిగి రాక్షసుడు చేతితో చీదపురుగును దులిపినట్లు భుజంపై వున్న వానరపతిని నేలకేసి కొట్టాడు. వెంటనే లఘుత్వం పొంది వింగికెగిరి క్షణంలో రాముని చెంగట వచ్చి వ్రాలాడు. తన వారి మధ్యలో శత్రువు తప్పించుకుని పోవటమే కాక కర్ణనాసికా ఖండనం చేసి వికృత రూపుణ్ణి చేయటం

కుంభకర్ణుడు సహించలేకపోయాడు. గిరుక్కున వెనక్కి తిరిగాడు. చేతిలో శూలం పోయినందున ముద్గరం ధరించి ఆ కొన్న బెబ్బులి లాగా అరుస్తూ కపిసేనలో చొరబడి అందినంతవరకు మ్రింగుతూ, అందని వాళ్ళను గుదియతో బాది చంపుతూ, ఆ మత్తులో, ఆ ఆగ్రహంలో వాళ్ళు వీళ్ళు అనకుండా ఉభయ పక్షాల వాళ్ళనూ పొట్టబెట్టుకున్నాడు. ఇరువాగులవారు భయగ్రస్తులైనారు.

## రాముడు కుంభకర్ణునితో యుద్ధం చేయుట

ఆ రాక్షసుని దాటికి నిలువలేక హతశేష వానరులు రాముని శరణు వేడారు. కొంతమంది కపివీరులు రాళ్ళతో, చెట్లతో, కొండలతో తలపడ్డారు, కాని ప్రయోజనం లేకపోయింది. నెలవుల వెంట శోణితం కారుతుండగా, పచ్చి మాంసం ఎడతెరిపి లేకుండా మెక్కుతూ, కపులను తరుముకుంటూ వస్తూవుంటే లక్ష్మణుడు ఏడు క్రూరనారాచాల ప్రయోగించాడు. ఆ బాణాలను అలక్ష్యంచేసి, అంతకుడు వలె రాముని మీదికి రాసాగాడు. రాముడు వాడు సమీపించక ముందే రౌద్రాస్త్రాన్ని విడిచి రొమ్ములో నాటాడు. ఆ బాణప్రభావంవల్ల నోట, ముక్కుల, చెవుల అగ్ని జ్వాలలురాగా, భరించలేక పెడబొబ్బపెట్టి రాముని విడిచి కోతులపై పడ్డాడు. రౌద్రాస్త్రం తగలగానే చేతుల్లోవున్న సాధనాలు జారిపడినై. అయినా ఆ క్రూర నిశాచరుడు, కాలితో, చేతితో శత్రుమర్దనం సలుప సాగాడు. అచ్చు విడిచిన ఆబోతులాగా యుద్ధరంగమంతా తిరిగి ఒక పర్వతం పీకి రామునిపై విసిరాడు. సీతాపతి దాన్ని మార్గమధ్యంలోనే సప్త మార్గణాలతో భిన్నాభిన్నం చేశాడు. తన వాళ్ళకు బాధలేకుండా శకలాలుకాక చూర్ణంగా కొట్టిన రాముని ధనుర్విద్యా నిపుణతకు దానవుడు అసూయపడ్డాడు. ఇంతలో వాణ్ణి చంపే ఆలోచన చేస్తున్న సౌమిత్రి "అన్నా! మనవాళ్ళను ఎలా మ్రింగుతున్నాడో చూడు. ఇలా వదలితే మన సేన ఎంతోసేపు నిల్వలేదు. నీ వెందుకు సంశయిస్తున్నావు? మన వాళ్ళల్లో బలవంతులనందర్నీ వాడిపైకి ఎక్కిస్తే ఆ భారంతో వాడు కదలలేడు. మనవాళ్ళు బ్రదుకుతా"రని చెప్పాడు. వెంటనే వానర వీరులు అపారంగా వాడిపైకి లంఘించారు. మదించిన ఏనుగు మావటివాణ్ణి

తొండంతో లాగి నేలకువేసి కొట్టినట్లు ఆ వరబల గర్వశాలి ఒడలువిదిర్చి పైకెక్కిన కోతి గుంపును నేలపడవేసి కాలితో మట్టసాగాడు. తన శరణు చొచ్చిన కపులు, తన రక్షణకు వచ్చిన కపులు, తన ఆధిపత్యం క్రింద వున్న కపులు, తన ఎదుట కుమ్మరి మట్టిని మర్దించినట్లు తొక్కి చంపు తుంటే చూడజాలక రాముడు సర్వ కపికోటికి సంతోషం కల్పించదలచి జగద్విలయంగా జ్యాటంకారంచేసి అసురుణ్ణి అదలించి అడ్డగించాడు. నోటి నుంచి రక్తం కారుతుంటే నాలుకతో నాకుతూ, రాక్షసాకృతిలో వున్న అపూర్వ ఘాతం అన్నట్లు తిరుగాడుతూ, అపహాస సూచకంగా ఉల్లస మాడుతూ పోతున్న కుంభకర్ణుడు రాముని దిక్కు తిరిగాడు.

## శ్రీరామ కుంభకర్ణుల ఉపాలంభం

ఎదురు తిరిగిన రాక్షసవీరుణ్ణి చూసి రాముడు "రావణానుజా! నేను బాణాలతో కొడుతుంటే నీవు వానరులపైకి పోతావెందుకు? నేను రాముణ్ణి. శరచాపాలుధరించి సిద్ధంగా వున్నాను. నీ ఆశ చూసుకుని నీ అన్న నిన్ను మెచ్చి మాపై పంపాడు. నీవు చంపాల్సింది మమ్మల్ని కాని, మర్కటు లను కాము. అది వేరే వీరులు చేయాలి. నీవు వచ్చింది మాకోసం. మేం ఎవరమో నీ వెరుంగవు. అందుకే ముందు చెప్పాను. అడుగు ముందుకు వేసి ఆపై నా శక్తి చూడు. నీవు నిజంగా లోక సంక్షయకారివే. శక్తి మంతుడవే. నిన్నెదుర్కొనేవారు మాలో లేకపోలేదు. వాళ్ళకు నీవు తప్పి తిరగటమో, వాళ్ళు నీతో పూర్తిగా తలపడకపోవటమో జరుగవచ్చు. అయినా నీ లక్ష్యం మేమే కనుక, అందులో నాచే అవమానం పొందిన నీ అన్న పంపింది నాపైకే కనుక, నీవు మమ్మల్ని గుర్తించలేవు కనుక, నాకై నేనే నీ ఎదుటికి వచ్చాను. నీ ఆకలితీరేలాగా నన్ను మ్రింగుతావో, నా బాణాలే మ్రింగుతావోచేసి, బ్రదికితే లంకకూ, చచ్చిపోతే శమనుని పురానికిపో. వృథా వానర సైన్యాన్ని మ్రింగితే వచ్చే లాభం నీకేముంది? నీ అన్నకేముంది?" అని వ్యంగ్యంగా రాముడన్నాడు. "ఓహో! నీవేనా రాముడవు? నా అన్నకు అవమానం కూర్చిన ధనుర్విద్యాకుశలుడవు? వెదకతలచిన తీగ కాలికే తగిలినట్లు నీవే వచ్చావు. నన్ను చూచికూడ వచ్చావంటే నీవు సాహసుడవే. సందేహం

లేదు" అంటూ కపులు భయపడేట్లు నవ్వాడు. మళ్ళీ, "రామా! నేను
విరాధుణ్ణి కాను. కబంధుణ్ణి కాను. ఖరుణ్ణి, వాలినీ, సుబాహుణ్ణి కాను. దేవ
దానవ నికరదారణకారణ భీషణ తదుగ్రానల తుల్యముద్గర కరార్పితవర్ణుణ్ణి,
కుంభకర్ణుణ్ణి. నాకు ముక్కు చెవులు లేవని పరిహసించకు. అవి లేక
పోయినా నా శక్తికి లోపం లేదు. నీ భుజ విక్రమం ముందుగా చూచి,
తర్వాత నా శక్తి ప్రకటించి, ఆపై ఆహారంగా మిమ్మల్ని మ్రింగుతాను.
నీవెంత శక్తిశాలివో నాకు చూపించు. ఆ అవకాశం నీకే ఇస్తాను."
అని వికటాట్టహాసం చేశాడు. రాముడు రాక్షసుని పల్కులు విని
"నిశాచరా! నీవెంతవాడవో చెప్పకముందే నాకు తెలుసు. నీవు చెప్పిన
వాళ్ళు నీవనుకోటానికి పాపం! వాళ్ళిప్పుడు బ్రదికిలేరుగా? నీవు నీవే
అనుకున్నాను. నీ నోటితో నీవే ముందు పొందబోయే స్థితికి సరిపడే
వాళ్ళనే పోల్చుకున్నావు. అవశ్యం అట్లే జరిగిస్తాను. నీవు నీ ముద్గ
రాన్ని సరిగా ధరించి అడుగు ముందుకు వేయి. నీకంటే ముందుగా
అవకాశం నేనే నీకిచ్చాను. అది గుర్తు తెచ్చుకో" అని గుండెలదిరేట్లు
గుణాన్ని మీటాడు. ఆ ధ్వనికి అసురుని గుండెలు జలదరించినై.
"ఎంత కండకావరం? ఏం అహంకారం? నన్ను యమాలయానికి పంపు
తావా? ఇదిగో ఇప్పుడే నిన్ను మ్రింగుతాను. ఇక కాచుకో" అంటూ
కాలు ముందుకుచాచి, రొమ్ము విరిచి నిలబడ్డాడు. ఎడమ చేతిని రాముని
వంకచాచి పట్టుకునే యత్నం చేశాడు. కాని, కాలు ముందుకు చాచగానే
రాముడు ఘోరాస్త్రం ప్రయోగించాడు. వాడి ముందు భూమి బ్రద్దలై
అగాధం ఏర్పడింది. ఆ గర్తం అంచున నిర్భయంగా నిల్చి, "నా వెనక
అడుగు నీ ముందుకు వేస్తానని నీకు తెలియదు. వేయమంటావా?
ఇంకేమైనా చేయతలచావా?" అంటూ కాలెత్తబోతుంటే, ఏ అస్త్రాలు
సప్తసాలభంజనం చేసినవో, వాలిని గూల్చినవో ఆ అస్త్రాలను తీవ్రంగా
ప్రయోగించాడు. అతని తనువు తాకి క్రిందబడ్డై. రాముడు అది చూచి
అవ్యాహతంగా శర ప్రయోగం చేస్తుంటే, రాక్షసుడు గుదెతో వాటిని
వారించాడు. ఆ ముద్గర పరిభ్రమణంలో పుట్టిన గాలి తరుచర వర్గాన్ని
జలధిపర్యంతం వెనక్కు నెట్టింది.

# శ్రీరాముడు కుంభకర్ణుని కాలు చేతులు నరకుట

రామచంద్రుడు తన అస్త్రాలు శత్రువుపై వ్యర్థం కావటంతో ఎంతో ఆశ్చర్యం పొందాడు. "విభీషణుడు చెప్పింది ఎంత యథార్థం! ధాత శాపం లేకపోతే ఈశ్వరుడువలె ఈతడుకూడ జగత్సంహార సమర్థుడే. వాలితో రావణుడు పోరలేక సంధి చేసుకున్నాడు. అంత బలశాలి సుగ్రీవుణ్ణి ఇతడు మూర్ఛితుణ్ణిచేసి పంచాంగం కట్టవలె చంకలో పెట్టుకుని లంకకు పోయాడు. వాలిని, సాలాలను కూల్చిన దారుణాస్త్రాలు ఈతనినేమీ చేయలేకపోయినై. ఇతడు సామాన్య శరాలతో చావడు. నా చేత దివ్యాస్త్రాలు ప్రయోగించేట్లు చేస్తున్నాడంటే ఈతడెంత వరబలం కలవాడో, సహజశక్తి సంపన్నుడో తెలుస్తున్నది! విభీషణుడు ఈతని కూర్చి చెప్పిన వాక్యాల్లో కొంత గూఢార్థం వున్నట్లుగా నాకిప్పుడు స్ఫురిస్తూ వుంది. ఇక ఇతణ్ణి వుపేక్షిస్తే చెప్పినంతపనీ చేస్తాడు. కపి సంహారం కాకుండా, కాలహరణం జరగకుండా ఈతని కడతేర్చాలె. కర్ణ నాశికలు పోయినా ఈతని శక్తి తగ్గలేదు. ఎన్ని శరాలు ప్రయోగించినా వ్యర్థం అవుతున్నై. ఈతని వాలకం చూస్తే దివ్యాస్త్రాలు కూడా ఊర్ధ్వకాయం మీద పనిచేయలేవు. అందుకే గుండె ఎదురిచ్చి నిల్చాడు. ఇప్పుడీతని చేయి నాపైకి చూపుతున్నాడు. ముందీ గండం గడవాలె" అని సూక్ష్మంగా వెనుక ముంగల సంగతులు పరిశీలించి సమీపిస్తున్న కుంభకర్ణుని వామ హస్తాన్ని వాయవ్యాస్త్రంతో నరికాడు. శరచ్ఛేదంవల్ల తెగిన కరం పడిపోతూ ప్లవగసహస్రాన్ని బలిగొన్నది. విగతహస్తుడై కూడా శేషహస్తంతో చేసిన సమరం దేవతలకే భయం పుట్టించింది. కపుల సంగతి సోదికి కూడ రాలేదు. దూరదూరంగా పోయి రామ కుంభకర్ణుల యుద్ధం చూస్తూ, ఎప్పటికప్పుడు ప్రాణాలు అరచేతుల్లో బిగిస్తూ, భయంతో వగరుస్తూ, తక్కుతూ, దాగుతూ కపులు కాలం గడుపుతున్నారు. ఒక వంక రాముని బాణాలను వ్యర్థంచేస్తూ, ఒక వంక అందిన కపులను తింటూ, ఒక వంక మహావృక్షాన్ని పీకి దానితో రాముని హతమార్చటానికి అంగలు వేస్తూ వస్తుంటే "రాముడేమవుతాడో" అని దివ్యులు దిగ్భ్రమ చెందుతున్నారు. రాముడు మాత్రం సాచిన సవ్యపాదం వెనకకు జరపలేదు. ధనువుగాని,

శరం తొడగటంకాని కనుపించటంలేదు. అయినా అతడు చేయి ముందుకు వస్తూనే వుంది. ఆ చేతిలో పర్వతం అంత పెద్ద చెట్టు వుంది. ఫెళఫెళార్భటుల మధ్య పిడుగుకు ముందు మెరిసే మెరపులాగా, నారీటంకృతిలో ఐంద్రాస్త్రం తళుక్కున మెరిసింది. కుంభకర్ణుని కుడిహస్తం చంకవరకు తెగింది. ఆ హస్తం వృక్షంతో నేలపడి పొరలుతూ కపికాండాన్ని ఎంత పొట్టను పెట్టుకుందో చెప్పటం సాధ్యంకాదు. అప్పటికీ అతడు చలించ లేదు. కరకర్ణ నాసికలు లేకపోయినా ఆ మహాకాయుకు జంకలేదు. అవి పోయినట్లుకూడా అతడెరుగడు. గిరిగహ్వరం వంటి నోరు తెరచి వెనుక నున్న అడుగు రాముని ముందుకు పెట్టటానికి ఎత్తాడు. ఆ కాలు రాముని ముంగల పడితే రాముడూలేడు, గీముడూలేడు. అప్పటి కుంభకర్ణుని రూపం, చేష్టా చూస్తుంటే చైతన్యం వున్న శరీరం కాక వైద్యుతమైన యంత్రం లాగా గోచరించింది. కపులు గజ గజ వణకు తున్నారు. దేవతలు తెల్లమొగాలతో తెలివి తప్పి చూస్తున్నారు. రాముడు మాత్రం చలించలేదు. పైకెత్తినపాదం పైనా, క్రిందవున్నపాదంక్రిందా అర్ధచంద్ర బాణద్వయంతో ఒక్కసారి ఖండించబడ్డై. ఆ నేర్పు రామునికే తెలుసు. గురువైన కుశికనందనునికే తెలుసు. చరాచర జీవకోటిలో ఇంకెవరికీ తెలియదు. అన్న అనుగ్రహంవల్ల సౌమిత్రికి మాత్రం తెలుసు. చరణద్వయం నరకబడంగానే, ఆ నేర్పరి తూలిపడక చటీలం పడ్డాడు. విగతనాసికా కర్ణుడూ, కృత్తకర చరణుడూ అయినా బింకం వదలలేదు. దేకుతూ, నోరు తెరచి రాముని ముందుకు రానేవచ్చాడు. వాడు రాముని క్రమంగా సమీపిస్తుంటే శశిని మ్రింగటానికి క్రమంగా వస్తున్న ఛాయాగ్రహం రాహువువలె తోచాడు.

## శ్రీరాముడు కుంభకర్ణుని శిరాన్ని తునుముట

ఆకాశానికీ, భూమికీ అంటునట్లున్న ఆ నోటినిచూచి రాముడు క్షణ కాలం నివ్వెరపోయాడు. అనేక శతఘ్నీ ముఖాలను నోట నాటాడు. మాట పడిపోయినా, అర్పులు, పెడబొబ్బలు మానలేదు. ఆ రావానికి ప్రపంచం ప్రతిధ్వనించింది. అభీలమై, జ్వలదర్క ప్రతిమానమై, సంవర్త కాలాభమై, ఖలభీదమై, బ్రహ్మాస్త్ర సదృశమై, కనకపుంఖమై,

బలసూదన వజ్రసంకాశమై, ప్రదీప్తానల జ్వలనమై, స్వప్రభరోదోంతరం నిండగా ఐంద్రశరాన్ని అభిమంత్రించి, కోదండంలో సంధించాడు. ధూమ్యాంత శిఖలు కాల్చుకుంటూ, పొగలు చిమ్ముకుంటూ, సరిత్సముద్ర పర్వతకాంతారాలను గజగజలాడిస్తూ, మహీధరాగ్రనిభం, చారుసువర్ణ కుండలమండితం, వివృత్తదంష్ట్రం, అయిన కుంభకర్ణుని శిరాన్ని దోస కాయను తరిగినట్లు తరిగింది. ఆ అస్త్రవేగానికి అంబరానికి ఎగసి పునర్వసు, పుష్యమి నక్షత్రాలమధ్య వెలిగే చంద్రుడిలాగా భాసించింది. అక్కడ ఆధారంలేక అధోముఖంగా పయనిస్తూ, లంకా నగర గోపురద్వార సౌధ వప్రాలను నేలమట్టంచేస్తూ, కోటివానరానీకాన్ని కూలుస్తూ, సముద్రంలోపడి అపార జలజంతు సంతానాన్ని హతం చేస్తూ పాతాళానికి పయనించింది. అతని కళేబరం భూపాతం కాగానే అనంత విశ్వం అదరి అల్లాడిపోయింది. దేవబ్రాహ్మణ మహర్షి శాత్రవుడు కుంభకర్ణుడు రణక్షేత్రంలో రాలిపోగానే వాతానీతవార్తా శ్రవణమై స్వర్గమర్త్య పాతాళాలు సంతోషించినై. జగత్పీడాకరులైన వారిలో ముఖ్యుడు ఈవిధంగా వికృతపు చావు చావటంతో కపివార్ధి ఆనందతరంగ సంక్షుభితమైంది. రామచంద్రుని పరాక్రమానికి దేవమహర్షి పన్నగయక్ష కిన్నర దైత్యదానవ కింపురుషాది ద్యోచరస్తోమం పూలవాన కురిపించింది. దైత్యకాంతారాన్ని దగ్ధం చేసిన శ్రీహరినిచూచి రాక్షసాంగనలు ఏడ్చినట్లు రామునిచూచి రావణ బంధువులు, సేనాపతులు, ఏడ్చారు. కేతువిముక్త భాస్కరునివలె సర్వలోక సంతాపతిమిరం పోగొట్టుతూ మర్కట వాహినిమధ్య వెలుగొందాడు. రహస్యం తెలిసిన దేవతలు, కుంభకర్ణుడు చచ్చాడు కనుక రావణుడు కూడ రాముని చేతనే చస్తాడు. విజయశ్రీ రామునకు దక్కుతుందని పరమానందం పొందారు. సుగ్రీవ విభీషణ హనుమజ్జాంబవంతాంగదాదులు, మైందద్వివిద నీలాది మహావీరులు, పట్టరాని సంతోషంతో సముద్ర జలంతో పాదాలు కడిగి, వికసిత బహువిధ పరిమళ పుష్పగుచ్ఛాలతో పాదపూజ చేశారు. ఇక విజయం తమదేయని విశ్వసించారు. యుద్ధంలో అర్ధ విజయం కలిగినట్లే తృప్తిపడ్డారు. హతులైన మహాయోధులను తలచి ఒక్కసారి అశ్రువులు రాల్చి మౌనమూర్తులైనారు. సౌమిత్రి అంతర్ముఖుడైనాడు.

## కుంభకర్ణుని చావు రావణునకు హతశేషులు చెప్పుట

మిణుగురును చూచి, భల్లూకాలు భయపడి పారినట్లు హతశేషులైన రాక్షసులు చిన్నబోయిన మొగాలతో, డగ్గుత్తిక గొంతుకలతో, అపగత శౌర్యోత్సాహ సంతోషాలతో పోలేక పోలేక లంకకు మరలిపోయారు. తమ్ముడు తన వైరులైన రామలక్ష్మణుల్ని వధించి వస్తాడని మొగమంతా కన్నులు చేసుకొని చూస్తున్న రావణుని పాదాలపైబడి భోరున ఏడ్చారు. కదనభూమినుండి వచ్చిన వాళ్ళను చూడగానే దైత్య ప్రభువు గుండె ఝల్లుమంది. అడగలేక ప్రభువూ, చెప్పలేక భటులూ ఒకరినొకరు చూస్తూ నిలబడ్డారు. ఎలాగో ధైర్యం తెచ్చుకొని, "దేవా! పరాక్రమానికి అవధియైన నీ తమ్ముడు సీతాపతిచే కర చరణ శిరచ్ఛేదం చేయబడి మరణించాడు. అబ్బా! ఆ మహామూర్తి చేసిన యుద్ధం మరపురాదు. లోగడ చేసిన యుద్ధాలు వేరు. ఈ యుద్ధం వేరు. అబ్బ! ఎంత వానర సైన్యం హతమైందో, ఎంతమంది మహావీరులైన వానర ప్రముఖులు మరణించారో చెప్పలేం. ఇప్పుడున్నవాళ్ళంతా ఆయనచే పరాభవం పొందినవాళ్ళే. కృత్తగళోరు బాహువరణుడై కూడా ఆయన ఎంతమంది కపులను కసిమసంగాడో! ఆ రాముడు సామాన్యుడు కాడు ప్రభూ! అవేం బాణాలో. అబ్బబ్బ! వాటి శక్తి ఇంతని చెప్పటానికి సాధ్యంకాదు. ఒక్కొక్క శరం నీ తమ్ముని అవయవం నరుకుతుంటే, లక్ష్యపెట్టక రామునిపైకి పోయి మ్రింగబోయాడు. మరుక్షణంలో నోటికందుతాడని అనుకుంటుండగానే ఆ వీరుడు తల నరికాడు. ఖండిత శరీరం నుంచి రక్తం కాల్వలై పారింది. కంఠం తెగినవెంటనే శిరం మర్కట సంతానాన్ని మ్రింగుతూనే పోయి సముద్రమధ్యంలో పడింది. మొండెం మన లంకానగర ప్రాకారం అడ్డగించగా ఆగింది. దిక్కులేక నీకీ వార్త చెప్ప వచ్చాం" అని ఘోరంగా రోదిస్తూ భటులు చెప్పారు. "హా తమ్ముడా! కుంభకర్ణా! నన్ను వదలిపోయావా?" అంటూ, దశ వదనాలతో శోకిస్తూ, వింశతి నేత్రాలతో అశ్రువులు వర్షిస్తూ, కూర్చున్నవాడు కూర్చున్నట్లే మూర్ఛలో మునిగి పోయాడు. త్రిశిరోతికాయ దేవాంతకనరాంతకులు "హా! పినతండ్రీ!" అంటూ, విహ్వలచిత్తులై, "ఎంతటివాడ వెట్లయినావు? విధి చేతకు

అర్ధం లేదని నీవు కూడా ఋజువు చేశావా? నీవంటివాడు మాకింక ఎవ్వడున్నాడు? సకల రాక్షస లోకంలో ఎవ్వడున్నాడు? లేడు. మేం ఉండినా మండినా ఒక్కటే" అంటూ కంటికి కడివెడు నీళ్ళుగా ఏడ్చారు. "సహోదరా! నీ అన్న లంకేశ్వరుణ్ణి ఏంచేసి పోయావు? నీ సహోదరుణ్ణి నన్నేంచేసి పోయావు? నిజంగా నీవీ మహాయుద్ధ సాగరాన్ని తరించి వస్తావనుకున్నాము. నిన్నే ఆ సముద్రం పొట్టబెట్టుకుంది. నీవంటి రత్నాన్ని పోగొట్టుకుని చిల్లర రాళ్ళను మోయటానికేనా నేను జీవించింది? దేవతల జయించిన నిన్ను ఒక మానవుడా చంపింది? నమ్మశక్యం కాకుండా వుంది" అంటూ మహా పార్శ్వుడు మట్టిలోబడి పొరలాడడు. ముఖప్రీతి వచనాలతో ప్రభువును మెప్పిస్తూ, తనువుదాచుకున్న మహోదరుడు సయితం అతడు సలిపిన సంగ్రామం, అతడు హతమార్చిన అగచర సైన్యం తలంచుకుని మనస్సు నిబ్బరం చేసుకోలేక సత్యంగానే తల బాదుకుంటూ శోకించాడు. జ్ఞాత చైతన్యుడైన లంకేశుడు తమ్ముడు స్మృతికిరాగా, కళ్ళకు మూర్తి గోచరించగా మళ్ళీ పడిపోయాడు.

## తమ్ముని మరణానికి దశకంఠుడు శోకించుట

పరివారం శ్రద్ధతో పచరించిన ఉపచారాల వల్ల తెలివివచ్చి "తమ్ముడా! కుంభకర్ణా! వీరాగ్రణీ! శత్రుదర్పఘ్నా! వీరలోక రత్నమా! మహాకాయా! మేరుమందర సదృశ గంభీర పరాక్రమ ధుర్యా! దైవ చోదితుడవై నా కోసం పోరి తరలిపోయావా? నీ విక్రమానికి ఊర్ధ్వలోకాల్లో ఇప్పుడున్న స్థానాలు నీకు తగినవికావు. నూతన లోకం నీ కోసం బ్రహ్మ నిర్మించవలసిన అవసరం అప్పుడే ఎందుకు కల్పించావు? ఎవని అండ చూచుకుని ఇంద్రాదుల దండయాత్రల బాధమరచి గుండెపై చేయి పెట్టుకుని పండుకున్నానో అట్టి విక్రమ మూర్తివి, నా దక్షిణ భుజానివి నన్ను వదలిపోయావా? నీ పోకతో హీనబలుడనైన నన్ను చూచి పూర్వ వైరం గురుతువచ్చి దేవతలు పరిహసించరా? నేనిప్పు డెక్కడికి పోయేది? ఎవరి సాయం అర్థించేది? దేవదానవులకు కాలానల రుద్రాభుడవైన నీవు ఆలంలో హీనమానవునిచే నిర్జింపపడ్డావా? ఎంత వైపరీత్యం? ఇంద్రుని వజ్రం, యమపాశం, ఈశాన్యుని శూలం,

అగ్ని ఆగ్నేయం, వరుణుని, వారుణం వాయువు, వాయవ్యం నిన్ను దాకి నిలువలేక నేలకొరిగినవే? అట్టి వజ్రకాయుడవు మానవులు వేసిన శరాలకు మరణించావా? సముద్రంవాటి కాలువలో పడ్డట్లుగా నీ చరిత్ర మారటం ఎంత శోచనీయం? వేల్పులు, వానరులు నీ మరణానికి ఎంత సంతోషిస్తారో? ఇది నా పిచ్చి భావం। ఆ వినిపించే కోలాహలం అంతా వాళ్ళదే. ఎందుకు సంతోషించరు? ఎందుకు నవ్వరు? తమ ప్రత్యర్థి రెక్కలూడ్చిన పక్షి అయినాడుగదా? అసలే కోతులు, కొండముచ్చులు, ఎలుగుబంట్లు. ఆపై దైవశక్తి ప్రేరితులు. విధి చోదితులు. రామ రక్షితులు. ఇక నా లంకంతా వాళ్ళతో నిండిపోతుంది. ఆపేవాళ్ళెవరు? ఎవరిని యుద్ధానికి పొమ్మంటాను? అంటే పోయేవారెవరు? పోతే తిరిగి వచ్చేవారెవరు? ఎందుకు నాకీ లంక? ఎందుకు రాజ్యాధికారం? ఎందుకు సీత? ఎందుకు నాకీ జీవితం? నా తమ్ముడులేక ఇవి శోభిస్తాయా? నేను రక్షిస్తానా? తమ్ముడా! అకాలంలో నిద్రాభంగం చేశాను. చేయకూడదని తెలిసి దురభిమానంతో నిన్ను పోరుకుపంపి బలవంతంగా చంపించాను. దోషం నాది. నీ యంతట నీవు లేచి రణానికి పోతే రాముడేమిటి? సర్వ సృష్టి నీకు దాసోహం అనేది. అమిత కోపం అనర్థానికి దారి తీసింది. అనర్ఘరత్నాన్ని పోగొట్టుకున్నాను. ఆ మహాత్ముడు పోతూ చెప్పిన మాటలు ఎంత భావగర్భితాలు? ఆ వాదన ఎంత సత్యమైంది. "నీవిచ్చిన శరీరం నీ కోసం త్యాగం చేస్తా"నని చెప్పి పోయాడు. ఇంతటివాణ్ణి, బహువరగ్రహీతను నన్నే విరథుణ్ణి, నిరాయుధుణ్ణిచేసి విడిచిన వానిపై విజయాశతో పంపటం నా అవివేకం. నీచస్వార్థం. అది విజయానికికాక మరణానికే తోడ్పడింది. నా తమ్ముని మృతకళేబరం పడివున్న చోటికి పోతాను. నా తప్పు మన్నించమని వేడుకుంటాను. నాలో ఇంకా ఏమైనా సుకృతఫలంమిగిలివుంటే అదిధారాదత్తంచేసి శాశ్వతపుణ్యలోక వాసం కల్పిస్తాను. అతని వదలి బ్రతుకలేను. బ్రదికి అట్టి తమ్ముణ్ణి నేనెలా పొందుతాను? ఈ వార్త తెలిసి ఇంద్రుడు దేవతలతో లంక ముట్టడిస్తే, నా బ్రతుకేం కావాలె? నెత్తిననోరు పెట్టుకుని అరటిపండు ఒలిచిపెట్టినట్లు అన్ని సంగతులు మతిమంతుడు విభీషణుడు చెప్పాడు.

"మీ విజయాలన్నీ వరబలంవల్ల వచ్చినవే. ఈ నరవానరులు నీ వరాల్లో వధ్యులు అవతారని బ్రహ్మ విధించలేదు. మన అశక్తత ఇతరుల శక్తి హెచ్చటానికి కారణం అవుతుం"దని హెచ్చరించాడు. మాల్యవంతుడు సోదాహరణంగా రాముని బలపరాక్రమం వివరించి, నా లోపాలు ఎత్తి చూపి కర్తవ్యం బోధించాడు దూరదృష్టిరహితులూ, గతసమర విజయోసిత మదగర్వితులూ, అయినవారి ప్రగల్భ వాక్యాలపై విశ్వాసం వుంచి తమ్ముణ్ణి తరిమివేశాను. మాల్యవంతుణ్ణి అతిపరుష వచనాలతో అవమానించాను. వాళ్ళు ఎంత ముందుచూపు కలవాళ్ళో, నాపై ఎంత అభిమానం నిష్కళంకంగా వున్నవాళ్ళో ఇప్పుడు అనుభవానికి వస్తూంది. ప్రహస్త కుంభకర్ణులు సంగరంలో మరణించిన వార్తలు విన్న తర్వాత, ముందు కూడ విభీషణుడు చెప్పినట్లు సీత దక్కకపోగా కులక్షయం తప్పదని తెల్లమైంది. అతని మాటలు వింటే, నాకింత అవమానం, ఇంత బంధుక్షయం వచ్చేదికాదు. ఆ సాత్త్విక తపస్వింపన్నుణ్ణి, నిష్కారణంగా వెళ్ళగొట్టి చేసిన మహాపాప ఫలం గర్భశోకంతో నన్ను కాలుస్తూంది. ఛీ! ఎంత శోకించినా, చచ్చినవాళ్లు రారు. విడిచిపోయిన విభీషణుడురాడు. సరస్సులో నీరెండి, సహస్రదళాలు రాలి మోడుగా నిల్చిన స్వర్ణకమలం సరోవరానికి అలంకారమా? చూపరులకు ఆనందదాయకమా? చిన్నవాడైనా ఎన్నతగిన హితం బోధించాడు.విధి బలీయం కావటంచేత తిరస్కరించాను. మంత్రిశ్రేష్ఠుడు మాల్యవంతుడు మాత్రం తక్కువ చెప్పాడా? ఇప్పుడు నాకు నా పెద్ద తమ్ముడు కుంభకర్ణుడుపోతూ చెప్పిన మార్గమే శరణ్యం. "నేను మరణించినా యుద్ధం మానవద్ద"న్నాడు. అదొక్కటే నాకిప్పుడు మిగిలింది. సీతను రామునికిచ్చి జీవించేకంటే చావటమే మేలన్నాడు తమ్ముడు. అది ఎంతో సబబైనదారి. రాముడు వదలిపోయినా, దేవతలు వూరుకోరు. మళ్ళీ యుద్ధం వస్తుంది. ఈసారి సమరం జరిగితే వాళ్ళచే చావు తప్పదు. వరబలం నశించింది. దానితో శక్తి పోయింది. వాళ్ళ చేతిలో చచ్చేకంటే, రాముని చేతిలో చావటం మేలు. సీతాపహరణ దోష దూషితుడను ఐన నన్ను జయిస్తే అతని కీర్తి ఆచంద్రార్కం నిలుస్తుంది. సత్యవ్రతుడై, సత్యపరాక్రముడై, సత్యవచనుడైన రాముని చేతిలో మరణిస్తే ఇంతవరకెవ్వరు పొందని ఉత్తమ లోకాలు పొందు

తాను. అధర్మక్షయం, ధర్మవృద్ధీ జరిగి లోకం సుఖశాంతులతో శోభి
స్తుంది. దేవతలచే వచ్చేది సామాన్య స్వర్గం. అది ఇంతవరకు
నా అధికారం క్రిందనే వుంది. అయినా నేను మాత్రం ఎంతకాలం
జీవిస్తాను? ఎన్నాళ్ళున్నా ఇవే అనుభవాలు కదా? తెలివికల తమ్ముడు
నాకంటే ముందు మరణించి చేరవలసిన స్థానం చేరుకున్నాడు. నేను
వచ్చిన పని తీరింది. వైరం సాధించాను. మరణం పొందుతాను. నా
పూర్వ స్థానం మళ్ళీ పొందుతాను" అని అంతరాలోకనంతో అతి నిగూ
ఢంగా పరిశోధించి, "తమ్ముడా! నీవు చెప్పిన మార్గాన్ని అవలంబించి
నిన్ను చేరవస్తాను. నా స్వయంకృత దోష పరిహారార్థం నీ క్షమాపణ
అర్థించుతాను. రాముడు నాచే నిగ్రహించబడితే అతని రక్తంతో నీకు
తర్పణం చేస్తాను. నీకు తృప్తి కూరుస్తాను. ఇక ఈ నిర్ణయం మార్చు
కోను" అని దృశ్యాదృశ్య దీపంలాగా వుదాసీనంగా వున్నాడు. అతనిస్థితి
చూచి ఆప్తవర్గం, ఆత్మవర్గం గగ్గోలుగా ఏడ్చింది.

## త్రిశిరుడు రావణునకు దుఃఖోపశమన వాక్యాలు చెప్పుట

ఆ దుఃఖసాగరంలో తెప్పగా త్రిశిరుడు లేచి "తండ్రీ! ఎంత
దుఃఖించినా మృతులైనవారు రారు. నీవన్నట్లు పినతండ్రి అంతటివాడే.
కాలంలో కొన్ని రోజులు కలసివస్తె. కొన్ని రోజులు కలసిరావు.
శోకించతగినవాడైనా వీరునిచే వధింపబడి వీరులస్థానంచేరాడు. యుద్ధంలో
జయాపజయాలు సందేహాస్పదాలు. ఆయన చంపినంత వానర సైన్యం
గానీ, వానరశ్రేష్ఠులుకానీ, ఇంకెవరూ చంపలేదు. పూర్వం మన పక్షబలం
ఎక్కువగా నశించింది. ఇప్పుడు మనపక్షంకంటే వైరిపక్షంలోనే అధి
కాధికంగా నశించింది. వానర ప్రముఖులు మనలోవలెనే పెక్కుమంది
మరణించారు. బలం సమంగానేవుంది. పరాక్రమవంతులందరికీ ఎప్పుడో
ఖండనంలో మరణం తప్పదు. వీరుడై మరణించిన తమ్మునికోసం విచా
రించక ముందు సంగతి విచారించు. నీవే కంటనీరు కారిస్తే, వీరమాతల
వీరపత్నుల ఓదార్చే వారెవరు? నీకేం తక్కువని బేలవలె విలపిస్తు

న్నావు? మూడు లోకాల్లో సాటిలేని మేటి వీరుడవని పేరుపొందావు. బ్రహ్మదత్త శరశరాసనశక్తి తనుత్రాణాలు నీకు లేవా? కల్పావసాన జలధర గర్జాసదృశ సహస్రఖర సంబద్ధ దివ్యరథం లేదా? కొన్నియుద్ధాల్లో రిక్తహస్తుడవై శత్రు విదళనం సలుపలేదా? నీ అవమానం తీర్చుకోటానికి సమస్త దివ్యాయుధాలు, దివ్య రథం గ్రహించి శత్రు విజయం సాధించు. అంత అవసరం కూడా లేదు. నీ విక్కడ సుఖంగా వుండు. ప్రతీకారంచేసి పగ నేనే తీరుస్తాను. గరుత్మంతుడు సర్పాల కాల విదలించినట్లు వానరుల చించి చెండాడుతాను. బలవంతులైన శంబర నరకులను విష్ణువు చంపినట్లుగా రామలక్ష్మణులను ఆహవంలో నిర్జిస్తాను" అని పలుకుతున్న త్రిశిరుని వాక్యాలు మన్నించి, కాలప్రేరితుడై, వింశతిభుజుడు పునర్జాతుడుగా తన్ను భావించుకుని దుఃఖోపశమనం పొందాడు. పంక్తికంఠుడు తేరుకొనగానే, నరాంతక దేవాంతక త్రిశిరాతికాయులు రణసముత్సుకులై, అహమహమికతో ఒకరిని మించి వేరొకరు శంఖధ్వానాలు చేశారు.. తమతమ సైన్యాన్ని సిద్ధంచేయుమని పదవాళ్ళకు ఆజ్ఞలిచ్చారు. నేల ఈనినట్లు రక్ష సైన్యం మళ్ళీ లంకానగరం నిండింది. ఆ దశకంఠ కుమార చతుష్టయం, నాలుగు సముద్రాలు. నాలుగు దిక్కులు. ఐరావతం నాల్గు దంతాలు. అంతా ఆకాశసంచారులు. అంతా మాయలమారులు. అంతా దేవదానవ దర్పహంతలు. అంతా జన్య దుర్జయులు. అంతా శౌర్య ధైర్య సాహసోపేతులు. అంతా స్థిర యశస్సంపాదకులు. ఎన్నిసార్లో పన్నగులతో సమరం సాగింది. దేవతాయూథంతో ఖండనాలు జరిగినై. ఒక్కసారైనా ఓటమి ఎరుగని పోటుమానిసులు. యుద్ధమర్మజ్ఞులు. వరప్రసాదులు. దినకరతేజులు.

## రావణుడు కుమారుల యుద్ధానికి పంపుట

అంతవరకు శోకదరిద్రాణంగా వున్న రావణాసురుని అభ్యంతర సభ క్షణంలో కోటి విద్యుద్దీపకాంతులతో తుల్యంగా వెలిగిపోయింది. శోకదేవత స్థానంలో వీరరసాధి దేవత వచ్చి నిలుచుంది. సైన్య సంచలనంతో, ముఖ్యాధికృతుల హెచ్చరికలతో, రథ గజ తురగ ఖరమృగ సంచరత్సమ్మర్దంతో, యుద్ధవేగాకాండాహత భేరీఝాంకారాలతో, యువ

వీర విజయగాథా సంబంధి వందిమాగధ ప్రశంసాప్రస్తారంతో, అబాల వృద్ధ విరచిత దీపికా పుష్పమాలికా వస్తుసంతానంతో లంకానగరం కుమార చతుష్టయానికి స్వాగతం పలికింది. దివ్యమహర్షులు సేవింపగా సుధర్మాసనాసీనుండైన సురలోక సార్వభౌముని వలె రత్నాలంకృత సింహపీఠిపై రావణుడు భాసించాడు. సింహాసనం దిగి వరుసగా పుత్రుల ఆశ్లేషించి, అలంకారాలు సవరించి, ఆశీస్సులు వర్షించాడు. కొడుకులకు బాసటగా మత్తునీ, యుద్ధోన్మత్తునీ, సైన్యసమేతంగా తోడ్కొనిరమ్మని కబురుపెట్టి, భ్రాతలురాగానే వారిని సమరవీర సత్కారంతో సంతృప్తి చేసి అభినందించాడు. వాళ్ళు వినయంతో విబుధద్వేషి చరణాలకు శిరాలు సోకగా మ్రొక్కి ఆశీస్సులందారు. వేడివేడిగా ఆ అసురుడు సకలాధులతో తయారుచేసిన వీరగంధాన్ని శరీరాలనిండా పూసుకున్నారు. భేరీశతం ఒక్కసారి మ్రోగింది. శంఖధ్వానాలు కాహళధ్వనులతో కలిసి వాయువులో లీనమై యుద్ధ ధర్మనాభిలాషతో విమాన మధ్యస్థులై వినువీథినున్న దేవతల కర్ణకుహరాలు నిండి కల్లోలపరచినై. మహోదరుడు కుబేరుని వలె గదకేలికిలించి, ఐరావత వంశంలో పుట్టి, అంజనాచలంవలెవున్న కరిపైన సుదర్శనాది విచిత్ర శస్త్రాలు మెరయగా, అస్తగిరి అధిరోహించు ఆదిత్యునివలె అధివసించాడు ఈతడు సమరంలో జంకుగొంకు లేక సంచరిస్తాడు. యుద్ధం పేరు చెబితే రణక్షేత్రంలో సాక్షాత్కరిస్తాడు. అందుకే మత్తుడని ప్రఖ్యాతనామం ధరించాడు. అన్ని విధాలా అన్నకంటే అధికుడని అనిపించుకున్న మహాపార్శ్వుడుకూడ మహాగజాన్ని అధిరోహించాడు. ఈతని యుద్ధప్రీతికి, శత్రునిర్మూలన కళాకౌశలానికిమెచ్చి రావణుడు యుద్ధోన్మత్తుడని కృపాణం, బిరుదూ ఇచ్చి సత్కరించాడు. ఉత్తమ జాతి గుర్రాలు పూన్చిన రథంపై వర శస్త్రాస్త్రపాణి హూర్కృలించింది. సవిద్యుదుల్కం, సచాశ్రీభృత్పరివేష్వాసనం (కొండను పరివేష్టించిన ఇంద్రధనుస్సు) అయిన జీమూత కూటం అన్నట్లు ఆభీల కోదండం చేతదాల్చి షణ్ముఖునివలె రణోద్యోగానురక్తాత్ముడై వెలువడ్డాడు. అతడు మూడు బంగారు శిఖరాలతో భాసించే మంచుకొండ లాగా మూడు కిరీటాలతో రథమధ్యంలో ప్రకాశించాడు.

సర్వధానుష్క శస్త్రచరిత్రుడు, హేమమకుట మండితుడు, కిరణ

భాసిత మేరుధరణీ ధరంలాగా, బహురత్న భూషణ భూషితాంగుడు, దృఢరథాంగాక్షం, సుసంయుక్తం, అనుకర్షం, సుకూబరం, శరధిజటా సనసంప్రదీప్తం, ప్రాసముద్గరగాసి భాసితం, అయిన ఉత్తమోత్తమ రథంపై అసురపతి రెండవ సుతుడు అతికాయుడు ఆరోహించాడు. ఇరు వంకల శస్త్రాస్త్రపాణులైన నిశాచర ప్రముఖులు అనుసరించగా సమరానికిపోయే దేవసేనానివలె రహించాడు. శ్వేతవర్ణం,స్వర్ణాభరణోపేతం, ఉచ్చైశ్రవ సన్నిభం, జవస్ఫీతం, ఉన్నతకాయం అయిన తురంగంపై నరాంతకుడు పురాంతక పుత్రునివలె పొలిచాడు. షడాననుడు శక్తి ధరించినట్లు ప్రాసం పరమాయుధంగా ధరించాడు. వజ్ర సన్నిభమైన పరిఘాన్ని దాల్చి, పర్వతాన్ని చేబూనిన అద్రిశయనునివలె దేవాంతకుడు ఒప్పాడు. వీరంతా దానవులపై యుద్ధానికి స్వర్గం తరలివెడలే అసురులవలె సైన్యరథ దంతి సైంధవ సమేతంగా భటులు వెంటరాగా లంకను అధిగమించారు. కిరీటకాంతలు దిశలునిండగా, గ్రహాలవలె చకచకలాడు దివ్యాస్త్ర రోచిఃపటలం ఆకసంముంచగా, శారదాభ్రంలో రాయంచల గుంపువలె స్వీయకాంతులు ప్రకటిస్తూ, చావో, గెలుపో ఒకటిమాత్రం నిశ్చయమని పౌరుష వాక్కులు పలుకుతూ, వైరులదెప్పుతూ, ఆయుధాలు త్రిప్పుతూ, గర్వం కన్నుల కప్పుతూ, యుద్ధకాంక్షతో రొప్పుతూ, కుమారుని షణ్ముఖాలులాగా, దేవాంతకనరాంతక త్రిశిరోతికాయ మహోదర మహాపార్శ్వులు సర్వవిభవోపేతంగా ప్రకాశించారు. జైత్రయాత్రా చిహ్నమైన జయభేరీలు మ్రోగించబడినై.రావణుడు సౌధోపరిభాగంపైనిల్చి ప్రయాణమవుతున్న పుత్రకులకు కరసంచలనంతో, మూర్తీభవించిన వీరరసంతో తొణికిసలాడుతున్న కొడుకుల కాంచిన ఆనందంతో ప్రఫుల్లమైన విశంతి నేత్రాలు విస్ఫారితంకాగా అనుజ్ఞఇచ్చాడు. మంగళవాద్యాలు నినదించినై. క్రమపద్ధతిలో నిశాట సైన్యం లంకానగరంనుంచి ఆయోధన క్షేత్రానికి నిష్క్రమించింది. సర్వ సమర్థులైన యోధులు సంగర స్థలికి పోతుంటే దెసలు తెల్లవారినై. ఉల్కలు రాలినై. భూమి కంపించింది. స్వానుభవంగల దేవ దానవులకు (కుమార వీరుల భండనానికి పోతుంటే) గుండెలు దడదడ కొట్టుకున్నై. తమ సేనాపతులను, సైన్యాన్ని కూల్చి, తండ్రిని అవమానించిన, ఉద్యద్భాను వృషాగం,

యుద్ధకాంక్షం, అసంఖ్యాకం, అతివేలం, తేజోవంతం అయిన ప్లవగేంద్ర బలాన్ని చూడటానికి నాగరథాశ్వ సంకులఘనం ఘంటారావ ముఖరిత దిగ్వలయంగా యువ వీరులు వస్తుంటే, సముద్ర భంగాలవలె కోపం చెంగలించగా పర్వతవృక్షపాణులై, వాలాలు నేలబాదుతూ, సింహనాదాలుచేస్తూ, పెడబొబ్బలు పెడుతూ అసురసైన్యాన్ని కీశసైన్యం పారచూచింది. ఉభయపక్షాలు త్రాసు తక్కెళ్ళు లాగా వున్నై. ఇంతలో రెండు డేగలు వచ్చి దేవాంతక నరాంతకుల తేరి చెక్కాలపై వ్రాలినై. ఆ రెండూ సంభాషణ సాగించినై. "ఈ కుమార వీరులు మాయావులు, అవధ్యులు కదా? రణ పరిణామం ఎలావుంటుందో? భయంకరంగానే వుంటుంది కాని, పెద్ద ప్రమాదం ఏమీలేదు. నీ వింతవరకు రాముని సర్వజ్ఞత్వాన్ని సామాన్య మానవుని స్థాయికి దించలేదు. ఉన్నత మానవ స్థాయిలోనే వుంచావు. లక్ష్మణుడిప్పుడు సంపూర్ణంగా స్వాత్మాశ్రయుడై వున్నాడు. ఇకముందు వారాస్థితిలో వుండకూడదు. మరి ఎలా వుండాలె? కేవలం దురహంకారియైన పామరునిలాగా రాముడుండాలె. లక్ష్మణుడు ఆత్మరతి మాని, అనుక్షణం తల్లిపైనా, భార్యపైనా మనస్సు నిల్పేట్లు వుండాలె. ప్రయోజనం? తర్వాత తెలుపుతాను. క్రమంగా యుద్ధగతి ఘోరం అవుతూంది. ఇంకా అవుతుంది. అందుకే ముందుగా నిన్ను హెచ్చరిస్తున్నాను. దేవాంశల్లో జన్మించిన వానర ప్రముఖుల్లో ఆయా దేవాంశలు ప్రవేశిస్తై. ఈ రాక్షసులు పొందిన వరాలన్నీ దివ్యులజయించటానికీ, వాళ్ళచేత హతం కాకుండా వుండటానికీ, నరవానరులుకాక, మరే ప్రాణిచేతగాని, ఆయుధాలచేతగాని చావకుండా వుండటానికి మాత్రమే ఉపయోగిస్తై. వానరులు ప్రయోగించేవి అస్త్రాలు కావు. రాళ్ళు, గుండ్లు, చెట్లు, చేతులు. రామలక్ష్మణులు ప్రయోగించేవి దివ్యాస్త్రాలు. అవి చంపలేవు. అందుకే అందులోని దివ్యత్వాన్ని ఉపసంహరించాం. దానికి మారుగా, రామాస్త్రాలో, పితృవాక్య పాలన ఫలాన్నీ, సత్యవచన ఫలాన్నీ, మహాస్థలతపశ్శక్తినీ, సీతాశీలాన్నీ, ఏకపత్నీ వ్రతమహాత్వాన్నీ పూరిస్తున్నాం. లక్ష్మణుని శరాల్లో మహాయోగిని సుమిత్ర ఆశీర్వాద బలాన్నీ, త్రిలోకైక సాధ్వి ఊర్మిళ మహాపాతివ్రత్యయోగ బలాన్నీ నింపిస్తున్నాం. కాబట్టే, రాక్షస ప్రయుక్త దివ్య శరాలకు లొంగు

తున్నారు. ఆ కారణంచేత వాళ్ళల్లో, రామలక్ష్మణులను కేవలం మానవులనీ, వానరులను కేవలం కోతులు, కొండముచ్చులు, ఎలుగుబంట్లనీ భావం పాతుకుపోయింది. అందుకే రాముడు వానరులను మానవాకారాలు తాల్చవద్దన్నాడు. వానరుల్లో ప్రభుభక్తి, రామునిపై భక్తి పెంపొందించాం. వాటిఫలం వాళ్ళకు అఖండశక్తులు ప్రసాదించేట్లు చేశాం. మాకంటే నీవే మరికొంతకాలం శ్రమపడవలసి వుంటుంది. త్వరలోనే స్వశక్తులతో, స్వస్వరూపాలతో, స్వస్థానాల్లో వుండే అవకాశం వస్తుంది. సీతపై రాముని చిత్తం అనుమానరహితంగా స్థిరంగా వుండేట్లు చేయి. ఆ పని ఎంతో అవసరం" అని అపశకునంగా వ్రాలిన శ్యేనరూప వాసవమాయాదేవులు అదృశ్యం అయినారు. అన్నీ తెలిసినా, అహంకార గర్వితులు, అసురులు కావటంవల్ల వెనుకటివాళ్ళవలెనే అంతా ముందుకు సాగారు.

## వానర రాక్షస సంకుల సమరం

నీలజీమూతనిభం, దీప్తానలార్కతుల్యం, ప్రజ్వలదస్త్రశస్త్రస్తోమం, నైఋతర్షభవృతం, అయిన రక్షస్సైన్యాన్ని చూచి అగచరులంతా సాధనాలు పైకెత్తి అల్లకల్లోలంగా ఆర్భటించారు. రాక్షసులుకూడా ప్రతిసమాధానంగా, ఘోరాతిఘోరంగా విపరీతధ్వానాలు చేశారు. జై లంకేశునికంటూ నిశాటులు, జై రామరవిపుత్రులకంటూ వనాటులూ ఒకరి వ్యూహంలో ఒకరు చొరబడ్డారు కొందరు వింగిపైనా, కొందరు నేలపైనా, కొందరు వృక్షాలు ధరించీ, కొందరు పర్వతాలు దర్చీ, కొందరు గండశిలలు గ్రహించీ అగచరులు శత్రుసైన్యాన్ని అంటదాకారు. శాఖాచరులు వర్షించే శైల భూరుహ శిలావర్షాన్ని సరకుగొనక దాపికిప్రతిగా రాత్రించరులు ముసలముద్గర శితశరాది సాధన సంతానం వర్షించారు. ఆ స్కందనం సర్వదిదృక్షభయప్రదాయిగా క్షణంలో మారిపోయింది. రాక్షసులు వానరుల ఉద్ధృతాన్ని నిలువరించి తీవ్రంగా తిరోగమించేట్లు చేశారు. కపులు ఏ మాత్రం వెనుకంజ వేయక భీకరంగా గర్జిస్తూ, శత్రు వ్యూహంలో గండికొట్టి బాహుసంపద పట్టపగలింటి సూర్యునిలాగా ప్రకాశించగా ఆ రాతిసైన్యాన్ని తీర్చిపేర్చారు. ధ్వజనీయుగళం నరాంతక

రథాలను రథాలచేతా నుగ్గు నూచంగా ప్లవగపతులు పొగొన్నారు. క్రమంగా తన సైన్యం తరగటం, వానరులశక్తి పెరగటంచూచి ఓర్వ రిలేక సర్వ శక్తులు కూడ తీసుకుని రక్కసులు ఒక్క పెట్టునకట్టతెంచు కున్న వరదలాగా వానరక్షేత్రాన్ని ముంచవస్తుంటే చచ్చిపడ్డ శవాలను తెచ్చి అడ్డంగా కొండల్లాగా గుట్టలు పేర్చారు.వానరుల వసుయస్ఫూర్తికి శత్రువులూ, గగనచారులూ మెచ్చుకున్నారు. తాను నడుపుతున్న సైన్యం హఠాత్తుగా ఆగిపోవటంతో నరాంతకుడు మండిపడి ముందుకు చూచాడు. వానరులు కనుపించలేదు. శవ పర్వత వలయంలో తన సేన చిక్కు కున్నట్లు తెలిసింది. కపుల నేర్పు సిగ్గు కూర్చింది.

## వానరసైన్యాన్ని నరాంతకుడు నిశ్శేషం చేయుట

అసురపతి సుతుడు ఆశ్చర్యాన్ని అణచుకున్నాడు. చాపం సజ్యం చేసి శింజినీ ధ్వానం చేశాడు. అంతకాకారుడైనాడు. గంధవాహ బాంధవ సైంధవాన్ని అదలించాడు. వాయవ్యాస్త్రాన్ని ప్రయోగించాడు. పర్వత పంక్తివలెనున్న శవప్రాకారం క్షణమాత్రంలో ఎగురగొట్టబడింది. ధను వును అంగరక్షకుని కందించాడు. శక్తిధరుడై ప్రాసాయుధంతో మహా మీనం జలధిలో చొచ్చిన చందంగా కపి సైన్యంలో చొరబడి ఒక్క లిప్త కాలంలో శాఖామృగ సప్తశతాన్ని బలిగొన్నాడు. ఎక్కడ చూచినా తానేయై, విశ్వరూపంతో విజృంభించాడు. ఎంతదూరంపోతే అంతమేర శోణిత మాంస కర్దమితం, శైలచర శవవిచయావృతం అయి పోయింది. ఎవ్వడైన తలపడ తలిస్తే వాడితల నేల పడింది. కొండనో, చెట్టునో ఎత్తేలోపల వాడి చేతులు నరకబడినై. పైకి దూకపోతుంటే ఊర్ధ్వకాయం ఎగిరిపోయింది తనవంక దృష్టి త్రిప్పేలోపల కాలుని దృష్టిలో కాయం కలిసిపోయింది. నిశాటుడు తప్ప వనాటుడు వాడి దృష్టిలోపడి బ్రదకలేడు. ప్రాసకరుడై, శత్రు సంత్రాసకరుడై కుష్కా టవి దహించే హవ్య వాహనునివలె అగచర వీరసంతానాన్ని ముహూర్త కాలంలో ఆహరించాడు.వానకారులో నలువైపుల త్రిప్పి త్రిప్పి పెనుగాలి వీచినట్లు నరాంతకుడు పొలికలనిలో నాల్గు దిక్కుల తిరిగి తిరిగి కపుల ప్రాణాలు ప్రాసకు బలిపెట్టాడు. అతడు చేసిన యుద్ధం వానరులకేకాదు.

దేవతలకు సయితం పరమాద్భుతం కలిగించింది. కపులు నిల్వలేరు. పరుగెత్తలేరు. తప్పుకోలేరు. ఎగురలేరు. ఎప్పుడు ఎరుగని దరవస్థకు పాలైన ప్లవగుల, నిలిచినవాళ్ళను నిలిచినట్టే, నింగికి ఎగిరేవాళ్ళను ఎగురుతున్నట్లే, పారిపోయేవాళ్ళను పారుతున్నట్లే చంపాడు. పిడుగు పాట్లవలె ప్రాసపుపోట్లు తగులుతుంటే తట్టుకోలేక కోతిమూకంతా గొల్లున గోలపెట్టింది. వానరుల ఆక్రందనం విని రాక్షసులు సింహనాదాలు చేశారు.

## అంగద నరాంతకుల సంగరం

ఇంద్రుడు వజ్రధారచే పర్వత పక్షాలు నరికినట్లు నరాంతకుడు వనచర సంతానాన్ని వధించాడు. కుంభకర్ణుని చేతిలో చావుదెబ్బలు తిన్న ప్లవగ ప్రముఖులు రవిపుత్రుని చుట్టుకుని సురక్షితంగా వున్నారు. తమ సైన్య నాశనానికి శోకిస్తున్నా ప్రాణాలపై తీపి బాధపెట్టింది. తన దళపతుల దుస్థితి గ్రహించిన తరణిపుత్రుడు తనపక్షంవారు పారటం, శత్రుపక్షంవారు మీరటంచూచి, సురసేనానికి సరితూగే ప్రచండ విక్రముని అంగదుని పిలిచి, అభ్యంతర రహితంగా హయంపై తిరుగుతూ, ఆత్మీయుల చంపుతున్న నరాంతకుణ్ణి చూపించి "బిడ్డా! అంగదా! వాడే మన బలాన్ని సర్వనాశనం చేశాడు. మనదళాధిపతులు ధైర్యంకోల్పోయి ఆత్మరక్షణలో వున్నారు. ఇప్పుడు యుద్ధభారమంతా నాపైనా నీపైనా వుంది. దాశరథులు తమపైకి రానంతవరకు ధనువు సజ్యంచేయరు. రావణుడు పంపేవాళ్ళందరూ సైన్యంపైపడి చంపుతున్నారు. క్రమంగా మన సేన క్షీణించిపోతూంది. శత్రుపక్షంవైపు అధికంగా నష్టం కలిగినా మనకేం సంతోషం? యుద్ధంలో చావవలసింది సైన్యంకాదు. అది అధమ యుద్ధం. దళాధిపతులు చస్తే దళాలు నిల్చిపోతై. వాళ్ళవైపు పేరు మోసిన సేనాపతులు పెక్కండ్రుమడిసారు. మనవైపు వారెవ్వరు మరణించలేదుకాని, మరణభీతులై వున్నారు. రావణుడిక లొంగుబాటుకు రాడు. క్రమంగా యుద్ధాన్ని భారం చేస్తున్నాడు. తన సైన్యం తరిగింది కనుక మన సైన్యంపై దృష్టి కేంద్రీకరించాడు. వచ్చినవాళ్ళు రాముని మీదికిపోరు. ఆ ధర్మప్రభువు వీళ్ళవంక చూడడు. మనం ఆయన శరణు

వేడటమైనా చేయాలి. లేక వీళ్ళను ఆయన దృష్టిపథంలోకైనా నెట్టాలి. మనం క్షేమంగా వుండి ఆయన్ని శరణువేడటం ఔచిత్యభంగం. మన కీర్తి ప్రతిష్ఠలకు భంగం. శతయోజన విస్తీర్ణ సాగరందాటి శత్రు పురాన్ని దహించి, గుండెల్లో గుండ్లు దొర్లించి వచ్చిన పావనివున్నాడు. రావణ ప్రాసాదం కూలవన్ని వచ్చిన నీవున్నావు. రామునకు సర్వవిధాల సాయపడతానని మాటఇచ్చిన నేనున్నాను. విభీషణుడున్నాడు. హనుమ అవైపు శత్రుమున్నిరీక్ష్యంగ కాపున్నాడు. ఆయనవంక వీళ్లుపోయేట్లులేదు. నేను రామరక్షణార్థం ఈవైపుకాస్తున్నాను. నీవు ముందుగా నరాంతకుణ్ణి నిలువరించు. ఇంతలో శత్రునాశనవ్యూహాన్ని పన్నుతాను. అంతతో వాళ్ళఆట కట్టుబడుతుంది. ఏమంటావు?" అని ఆప్యాయంగా అడిగాడు. "తండ్రీ! నీ ఆలోచన సమయానుకూలంగానూ, సమర్థవంతంగానూ, సముచితంగానూ వుంది. ఇప్పటికిదే కర్తవ్యం. నేను నరాంతకుణ్ణి నరకలోకం పంపక నిన్ను చూడను. ఇంతవరకు చూపని నా నిజపరాక్రమం, నా తండ్రి నేర్పిన విద్యామర్మం ఇప్పుడు కొంత చూపుతాను. సెలవు" అంటూనే మబ్బులు చీల్చుకుని వచ్చే భాస్కరుని చందంగా నిజాంగదద్యుతులు మిరుమిట్లు కొల్పగా, ధాతు మండిత ధరణీధరం వలె నఖమాత్ర శస్త్రిడై, రివ్వున నరాంతకుని ముందువచ్చి వ్రాలాడు. ఆ వేగానికి హయంతోకూడ రాజకుమారుడు మొగ్గతిలబడ్డాడు. అదిరిపడి చూచాడు. ఇంత విలక్షణశక్తి సంపన్నుణ్ణి ఇంతవరకు చూడలేదు. వానరాకృతిలో వున్నా ఆ శరీర సౌష్ఠవం, ఆ సౌందర్యం, ఆ సమోన్నతదేహం నరాంతకునికి గొంతులోపడ్డ వెలగగుజ్జు అయింది. స్వస్థుడయ్యేలోపల తారేయుడు రావణ పుత్రుణ్ణి చూచి, "రాక్షస రాజకుమారా! ప్రాకృత కీశపాళిపై నీ ప్రతాపం చూపిస్తున్నావా? సామాన్య సైన్యాన్ని చంపితే బలమా? యశమా? ఫలమా? ఏదీ? నీ అభిమానపాత్రమైన ప్రాసాయుధాన్ని నా ఉరంపై ప్రయోగించు. నీవలె నాకు వాహనంలేదు. అస్త్ర శస్త్రాలులేవు. శిరస్త్రాణాలు, తనుత్రాణాలులేవు. అంగరక్షకులులేరు. ఎలా పుట్టానో, ఎలా పెరిగానో అలాగే వచ్చాను. మేం నఖాయుధులం మాత్రమే. నీ ప్రాసకు నా రొమ్మిచ్చినట్లే నా గోళ్ళకు నీ రొమ్ము ఇవ్వగలవా? చెప్పు? నీకే ముందుగా అవకాశం ఇస్తున్నాను. నీవు నరాంతకుడవటగా? దేవతలు

నీ పేరు చెపితే నిద్రపోరటగా ? ఇంకేం ? మంచివాడితోనే యుద్ధం వచ్చింది. మాట్లాడవేం?" అని గ్రుచ్చి గ్రుచ్చి హెచ్చరించాడు. అంగదుడాడిన ఒక్కొక్క మాట నరాంతకునికి కర్ణంలో శూలాలు నాటినట్లైంది. పెదవులను రదాలతో కొరుకుతూ, పదంతో త్రాచువలె [illegible]తూ, "ఏమి సాహసం? ఎంత పౌరుషం? ఇంద్రాది దిక్పతులు నా ఎదుటకు రాలేక జంకారు. పన్నగులు నా రాక వినే పారిపోయారు. ఒంటరివాడు. వానరుడు. నిరాయుధుడు. నన్ను బెదిరించి భయపెట్ట వచ్చాడా? నిజంగా అంత శక్తి సాహసుడా? వీడి పేరు విన్నాను. నా తండ్రి వద్దకు రాయబారిగా వచ్చి, అంగరక్షకుల చంపి, ప్రాసాదం కూల్చిపోయినవాడు వీడేకావచ్చు. అప్పుడూ ఆయుధరహితుడై ఒంటరిగానే వచ్చాడు. వీడికి అవకాశం ముందుగా ఇస్తే నన్ను చంపలేడు. ముందే వీడిని బలిగొంటే పీడ విరగడైపోతుంది" అని ఆలోచించి "మర్కటాధమా! ఎంత ఆత్మస్తుతి చేసుకున్నావు? నరాంతకుడంటే పిల్లి, బల్లి అనుకున్నావా? ఇంత సైన్యం మట్టిలో కలిస్తే ఎక్కడ నిద్రించావు? నీ వన్నెమాటలీదనే నిలబడు. నా నా ప్రాసాహతికి తట్టుకుని నిలిస్తే అప్పుడు నీకవకాశం సంగతి ఆలోచించవచ్చు" నంటూ మాటల్లో మరపించి ప్రాసము విసరాడు. అంగదుడు శత్రు మర్మం ముందే గ్రహించాడు. తండ్రిని స్మరించాడు. వాయువు పూరించాడు. శరీరం పెంచాడు. వచ్చే ప్రాసాగ్రానికి రొమ్మిచ్చాడు. తండ్రి స్మరణంతో ఇంద్రుడు మనుమణ్ణి వజ్రకల్యాణిగా మార్చాడు. అడ్డంలేకుండా వేగంగా వచ్చి అంగదుని వక్షాన్ని తాకి ఛిన్నాభిన్నమై చెదరిపడిపోయింది. వెంటనే అవ్వాయి చువ్వవలె రివ్వున పైకి దూకి గుర్రం నెత్తిపై పిడికిలితో ఒక్క పెట్టు పెట్టాడు. ముక్కులవెంట నెత్తురు ఓడుస్తూ, నాల్క తెగి, గ్రుడ్లూడిపోయి, విశీర్ణమూర్ధమై, విగతప్రాణమై పడిపోయింది. పెనుకొండలాగా కూలిన గుర్రాన్ని చూచి గుండెలు చెదరగా, నిబ్బరించుకుని క్రోధ ఘూర్ణిత నేత్రాలతో అంగదుణ్ణి వెన్ను పై ముష్టితో గ్రుద్దాడు. నరాంతక ముష్టి ఘాతానికి వేడి రక్తం చూపులు కనపడకుండా కళ్ళల్లోనుంచి కారసాగినా, మూర్ఛలో మునిగినా, వెంటనే తెలివి తెచ్చుకుని, పరబలానికి

విస్మితుడవుతున్న పంక్తిముఖు పట్టిపై దూకి రొమ్ము పగిలేట్లు గ్రుద్ది గోళ్ళతో చీల్చి పొట్టలో ప్రేవులు మెడలో వేసుకున్నాడు. అచ్చరలు ఆడారు. గంధర్వులు పాడారు. దేవ పృక్షాలు పూలు కురిసినై. దేవతలు స్తుతించారు. మహర్షులు ఆశీర్వదించారు. లంకలో రక్త వర్షం కురిసింది. వానరుల విజయ కోలాహలం, రాక్షసుల ఆర్తరవం రణరంగం అంతా నిండిపోయింది. అసాధ్యకార్యాన్ని సాధించిన అంగదుణ్ణి సుగ్రీవుడు హర్షోత్ఫుల్ల నయనాలతో ఆలింగనం చేసుకుని "తండ్రీ! నా పరువు దక్కించావు. నీ మాట నిలుపుకున్నావు. తండ్రిని మించిన తనయుడవని పించుకున్నావు. ఇక భయంలేదు. వీడు చచ్చాడు కనుక తక్కినవాళ్లూ చస్తారు. వ్యూహం నిర్మించాను. వచ్చినవాళ్ళు మళ్ళీ లంకలోకి పోరు. నీవు కొంత విశ్రాంతి తీసుకో" అని అన్నాడు. రాముడు తన తమ్ముడు సౌమిత్రివలెనే అంగదుణ్ణి ఆలింగనం చేసుకుని, పావనహస్తంతో శరీరం నిమిరి, "నాయనా! శత్రువ్యూహ హారంలో కొలికి పూస తప్పించి ఎడం కల్పించావు. నీ సాహసం నాకెంతో ముచ్చట కూర్చింది. తండ్రి చెప్పినట్లు కొంతకాలం శ్రమ తీర్చుకో" అని అమృత వాక్కులతో హర్షాన్ని వెలిబుచ్చాడు.

## అంగదుడు దేవాంతక మహోదర త్రిశిరులతో పోరుట

అంగదుడు రామ రవిపుత్రుల ప్రశంసలు ఆశీర్వాదాలు పొంది "తండ్రీ! నా విధి నేను నిర్వర్తించాను. నన్నింత కొనియాడటం దేనికి? ఎవరికంటె గొప్పకార్యం నేను చేశాను? ప్రహస్తుణ్ణి నీలుడు చంపలేదా? పావని ధూమ్రాక్షుణ్ణి వధించలేదా? అకంపనుణ్ణి అంతం చేయలేదా? నీవు రావణుని తలదన్ని రాలేదా? రామప్రభువు కుంభకర్ణుని కూల్చ లేదా! సౌమిత్రి అతికాయుని హరించలేదా? ఏమంత కష్టపడ్డానని శ్రమ తీర్చుకోవాలె? ఇంకా ప్రమాదం కలిగించేవాళ్లు వున్నారు. వాళ్ళను మన వాళ్ళు నిగ్రహించలేరు. నేను నిలిస్తే, ఇప్పటి ఉత్సాహంలో నా వెనుక నిల్చి పోయగలరు" అని అన్నాడు. ఇంతలో దేవాంతక మహోదర త్రిశిరులు భీకరంగా గర్జిస్తూ కపిసేనపై వచ్చి పడ్డారు. వారి రాకతో వానర సైన్యం కకావికలై పారిపోసాగింది. రవిపుత్రుడు పన్నిన పన్నాగం

విచ్చిపోతున్నది. "సరే. తండ్రీ! నీ ఇష్టానుసారమే చేయి. ముందు మనవాళ్ళను స్వస్థానాలను వదలకుండా వారించు" మంటూ అనుమతి ఇచ్చాడు. అంగదుడు సంగరంలో చొచ్చాడు.

నరాంతకుడు అంగదునిచే అతి వికృతంగా చావటంతో, వెంట వచ్చిన సైన్యం, ఏడ్పుతో, పెడబొబ్బలతో లంకామార్గంబట్టి తిరోగమిస్తుంటే, రథికత్రయం, వాళ్ళను వారించి, చచ్చిపడిన స్థానానికి వచ్చారు. అతని చంపిన తీరుచూచి అదరిపోయారు. సోదర మరణానికి శోకించారు. చేతకు బదులుచేత చేసి ఋణం తీర్చుకోవాలని నిశ్చయించారు. విడివిడిగాకాక కలసి శత్రువును చంపటం మంచిదనుకున్నారు. మహోదరుడు గజాన్ని అధిరోహించి, తేరులపై దేవాంతక త్రిశిరులు ఆరోహించి వానరులపైకి వచ్చారు. అంత దూరంలో వస్తున్న అంగదుడు కనుపించాడు. అతని చూచి, "వాడే, వాడే, నరాంతకుణ్ణి చంపిన క్రూరుడు. బాబో! మళ్ళీ వస్తున్నాడు. మనలను బ్రదుకనీయడు" అంటూ రాక్షససైన్యం రాత్రి గడవగా వెలవెలబోతూ నక్షత్రాలు అదృశ్యమైనట్లు ఎక్కడికక్కడ తిరోగమించసాగింది. ముగ్గురు మూడు వైపులకుపోయి సైన్యాన్ని నిలువరించి, త్రిముఖంగా వచ్చి అంగదుణ్ణి మధ్యలో బంధించి అంపవానకురిపించారు. నిరాయుధుడైన తారేయుడు శత్రువుల దురాలోచన అర్థంచేసుకుని వాళ్ళువేసే అస్త్రాలకు అందకుండా అంబరానికి ఎగిరి, అక్కడ పరిభ్రమిస్తూ, "ఓమాయావులారా! అంగదుడంటే పామరుడనుకున్నారా? మీ కుటిలమార్గం నా హృదయదర్పణంలో ముందే భాసించింది. నన్ను వంచించటం మీకు సాధ్యంకాదు. నా పినతండ్రి పన్నిన వ్యూహం మిమ్మల్ని ప్రాణాలతో మరలనీయదు. ముందే హెచ్చరిక చేస్తున్నాను. బ్రదుకుపై ఆశవుంటే, నరాంతకునికి పట్టిన గతి మీకు పట్టకముందే తిరిగిపొండి" అంటూనే సమీపంలోవున్న చెట్టును మొదలంటపీకి రివ్వున దేవాంతకునిపై రువ్వాడు. వాడువాడి శరాలతోవృక్షాన్ని భగ్నంచేసి, ఊర్ధ్వానికి బాణాలు పరిపాడు. పైకివస్తున్న బాణాలు తగలకుండా ధరణికివ్రాలి, తరుగిరులతో త్రిశిరుడితో తలపడ్డాడు. త్రిశిరుడు అవలీలగా ఛేదించి, మర్మభేదకాలైన మార్గణాలతో మర్కట నాయకుని కప్పాడు. మహోదరుడు తోమరాన్ని వేశాడు. దేవాంతకుడు గదతో

తలపై దాడి చేస్తున్నాడు. ఒక్కడిపై ముగ్గురు యోధులు తలపడి హింసిస్తున్నా, అంగదుడు ద్వాదశాదిత్య మండలంవలె దుస్సహతేజుడై శరవర్షంలో చిత్ర విచిత్ర భ్రమణాలతో తప్పుకుంటూ, తనగతిని పరిశీలిస్తున్న దేవాంతకునిపై దూకి దంతావళ కుంభస్థలంమీద కొండపై పిడుగుపడ్డట్లు సర్వశక్తి కేంద్రీకరించి గుద్దాడు. ఆ గుద్దుకు దేవాంతక సహితంగా గిరగిర తిరిగి ఘోరంగా ఘీంకరించి గుడ్లురాలగా పర్వతం పడ్డట్లు నేలకూలిపోయింది. పడిన దంతి దంతాన్ని ఫెళ్ళున విరిచి ఆయుధంగా ధరించి దేవాంతకుణ్ణి గుండెల్లో గుచ్చాడు. ఆ దంతాగ్రం వెన్ను దాకగానే, కన్నులు తిరిగి, నెత్తురుగ్రక్కుతూ నేలపడ్డాడు. వెంటనే తెప్పరించుకుని పరిఘతో తారేయుణ్ణి కొట్టాడు. సోలిపడి వాలిసుతుడు లేచే లోపల ఫాలంపై త్రిశిరుడు బాణాలు నాటి నొప్పించాడు.

## హనుమచే దేవాంతకుడు, నీలునిచే మహోదరుడు నేల కూలుట

ముగ్గురు కలిసి అంగదునిపై త్రిముఖంగా పోరటం నీలుడూ, హనుమంతుడూ చూచారు. చూడటమేమిటి, మధ్యలో దూకటమేమిటి వెంటనేజరిగిపోయింది. అంగదునిపై అస్త్రప్రయోగంచేస్తున్న త్రిశిరునిపై పడ, పర్వతం దూసుకుని వస్తోంది. దాన్ని నడుమనే దైత్యుడు త్రుంచి నీలునిపై నిశితమార్గణాలు నింపాడు. తేరుకున్న దేవాంతకుడు పావనిపై పరిఘతో వచ్చి పడ్డాడు. చేయెత్తి పొడువ వస్తున్న దనుజుని దక్షిణ హస్తాన్ని పావని వామహస్తంతో నిరోధించి దక్షిణ హస్త ముష్టితో గుండెలపై గునపం దించినట్లు గుద్దాడు. ఆ వ్రేటుతో పుక్కిలింతలుగా నెత్తురు గ్రక్కి కూతకు కూడా శక్తి లేకుండా కూలిపడ్డాడు. పడగానే తల నేల దకి ఫక్కున పగిలింది. దేవాంతకుడు దేవలోకం చేరగానే నీలుడు విజృంభించి మహోదరునిపై పడ్డాడు. అతని రక్షణకు తీవ్ర బాణాలు వేసి నీలుని బాధించాడు. మహోదరుడు కూడ క్రూర నారాచాలు నాటి నీలుణ్ణి సంధిబంధాలు సడలించాడు. ఇరువురు విడువకుండా బాణాలతో ప్రాణాలు తీయబోతుంటే దేవాంశ దేహంలో ప్రవేశించింది. ససంజ్ఞుడైన

నీలుడు తన స్థితి గుర్తించి ఇద్దరిలో ఒకరు చచ్చితీరాలని భీకరంగా గర్జించి తరుషండ మండిత ధరణీధరాన్ని గ్రహించి మహోదర మూర్ధం లక్ష్యంగా విసిరాడు. త్రిశిరుడు, మహోదరుడు శతకాండాలతో కొట్టినా ఛేదింపబడక సూటిగా లక్ష్యాన్ని దాకింది. ఆ పర్వత పాతానికి తల పప్పు పప్పుగా పగిలి మహోదరుడు మహిపై కూలి మరణించాడు. పినత్రండ్రి కూలటంతో త్రిశిరుడు బిట్టుగా గర్జించి పావమానిపై శర వర్షాన్ని ఉద్ధృతంగా వర్షించాడు. అంగదుడు స్తబ్ధచిత్తుడై హనుమన్నీలుల ఆహవాన్ని తిలకిస్తున్నాడు. "తనవారు పోరుతుంటే తాను కల్పించుకోవటం ధర్మం కాదు. తనపై ముగ్గురు తలపడటం ధర్మదూరం కనుక వారిద్దరు వచ్చారు. ఇప్పుడు పగవాడు ఒక్కడే వున్నాడు. మనవాళ్ళిద్దరున్నారు. ఇంకా నేనెందుకు? మహానుభావుడు, మర్కటలోక మహనీయ మాణిక్యం హనుమకు వేరే తోడెందుకు? ఆయనే అందరికి తోడుగా వున్నాడు. నీలుడు మెల్లగా తప్పుకుని విశ్రాంతి పొందుతున్నాడు. త్రిశిరుడు మారుతి చేతిలో మరణించటం తథ్యం" అని వాలేయుడు తనలో భావిస్తూ నీలునివైపు నడిచాడు. నీలాంగదులు జాగరూకులై యుద్ధగతి గమనిస్తున్నారు.

## త్రిశిరుడు హనుమచే చచ్చుట

తన సమ్ముఖంలోనే మహోదరుడు నీలునిచే నీల్గటం త్రిశిరునకు సిగ్గు కూర్చింది. ఎదురుగా నీలునికి బదులు మహాకపి మరణ దేవత నిల్చినట్లు నిల్చున్నాడు. అతని ఇప్పుడున్న రూపాన్ని చూచి ఆపాదమస్తకం కంపిస్తున్న త్రిశిరుడు ధైర్యం తెచ్చుకుని, పావమానిపై తీక్ష్ణ బాణాలను తీవ్రతరంగా ప్రయోగించాడు. హనుమ వాటిని ఒడిసిపట్టి విరిచి పారేస్తుంటే, రాక్షస యువకునికి భయ విస్మయాలు కలిగి శిలా ప్రతిమవలె ఒక్కక్షణం రథంపై వున్నాడు. ఈలోగా మారుతి మహా పర్వతాన్ని వాడిపైకి విసిరాడు. దానిని మధ్యలోనే భంగించాడు. తన ప్రయత్నం దానవునిచే వ్యర్థమై పోవటంతో క్రుద్ధుడై, పెనువృక్షాన్ని పీకి ప్రయోగించాడు. దాన్ని కూడా పొడవడగించి దైత్యుడు సింహధ్వానం చేశాడు.

కేసరి పుత్రుడు క్షణకాలం చింతించాడు. "వీళ్ళు అస్త్ర విద్యా ధురంధరులు. దూరంనుంచి ఎన్ని సాధనాలు ప్రయోగించినా సముద్రంలోపడ్డ అల్ప పదార్థాలవలె వ్యర్థం అవుతై. చచ్చిన వాళ్ళంతా మర్కటయోధుల సాహసంతోనే చచ్చారు. వీడిని కూడా సాహసంతో చంపాలేగాని, సాధనాలతో చంపటం సాధ్యంకాదు" అని భావించటం అరదంపై దూకటం ఒక్కసారే జరిగించాడు. ఊహించని సంఘటనతో అసురుడు తత్తరపడ్డాడు. తేరే లోపల కేసరి గజాన్ని చీల్చినట్లు హ పదు హయాలను వాడి గోళ్ళతో పొట్టలు చీల్చివేశాడు. అదిచూచి శక్తితో నేలకు దాటి పరచి సూటిగా మారుతి గుండె గురిచూచి శక్తిని విసరి వేశాడు. నిప్పులు గ్రక్కుతూ ప్రళయరుద్రుడులాగా వస్తున్న శక్తిని హస్తంచాచి అందుకుని రెండుగా ఖండించాడు. శక్తి వ్యర్థం కావటంతో ఖడ్గం ధరించి హనుమ కంఠాన్ని లక్ష్యంగా వేశాడు. ఆ ఖడ్గాన్ని ఎడమచేతపట్టి పైకి దూకి అరచేతితో గుండెపై చరచాడు. ఆ హస్తఘాతానికి విసంజ్ఞుడై పుడమిపై దొరగిలపడ్డాడు. వాడు పైబడిన ఖడ్గంతోనే శిరం నరకబోతుంటే చివాలునలేచి రాక్షసుడు మారుతివక్షంలో పొడిచాడు. ఆ పోటును లెక్క చేయక కిరీటాన్ని లీలగా లాగి పారేశాడు మణిమయ మకుటాంచితం, సకుండలం, అయిన రక్కసుని మూడు తలలు, ఇంద్రుడు విశ్వరూపుణ్ణి ఖండించినట్లు దైత్యలోకం భీతితో దద్దరిల్లిపోగా కత్తితో కరకర తరిగి వేశాడు. సుకృతఫల సంక్షయంతో సూర్యమండల మార్గంనుంచి పడేవాడిలాగా త్రిశిరుడు నేల వ్రాలాడు. నరాంతక దేవాంతక మహోదర త్రిశిరులు ఏకకాలంలో నాకలోకం చేరగానే ప్లవగ పుంగవుల సంతోషం, పట్ట పగ్గాలు, విడువ వీలు లేవన్న చందంగా వెల్లివిరిసింది ఆ ఉత్సాహంలో గుంపులు గుంపులుగా రాక్షస సైన్యం పైపువస్తూ, అర్భటిస్తూ, అదలిస్తూంటే వనాటులచూచి నిశాటులు లంకకు ఒక్క ఊపున పరుగుతీశారు. రామలక్ష్మణ రవిపుత్రుల ఆనందం అంత ఇంతకాదు.

## మత్తుడు ఋషభునిచే చచ్చుట

యుద్ధ ప్రచండులు, సురలోక భీకరులు, పంక్తిముఖుని ప్రాణాలు, నరాంతక దేవాంతక మహోదర త్రిశిరులు వానరవీరులచే ఆహవంలో

కూలటం మత్తునకు మతిభ్రమ కల్గించింది. "ఎంత పరాక్రమవంతులు ఎంత అల్పుల చేతిలో చచ్చారు? నేను ప్రాణాలతో తిరిగి లంకకుపోయి ప్రభు దర్శనం ఎలా చేసేది? ఆయన ప్రశ్నలకు ఏమని ప్రత్యుత్తరం ఇచ్చేది? జయించినట్లయితే పోవటం కీర్తి కారణం. ఐనవారిని చంపుకుని ఓటమి అంగీకరించి బ్రతుకుతీపితో మరలిపోవటం భీరునిలక్షణం. నేను వీరుడనే. వీరమరణమే పొందుతాను. అసలు ఈ యుద్ధమే విచిత్రంగా వుంది. దేవతలతో పోరు సాగిస్తే స్వర్గం లభించింది. దేవతలు పొందే సకల సుఖాలు లభించినై. ఇతరులపై ఎత్తిపోతే ఎనలేని, విలువకందని కానుకలు, గౌరవాలు, విభవములు వచ్చినై. ఇది ఏమి యుద్ధం? ఇష్టంలేని స్త్రీ కోసం ఇందరు మహావీరులు ప్రాణాలు త్యాగం చేయటమా? లంక నుంచి వచ్చేవారే కాని, పరాక్రమం చూపి విజయంతో వొచ్చేవాడే లేడు. ఇవి కోతులేనా? కొండముచ్చులేనా? తిరుగులేని దివ్యాస్త్రాల శక్తి హీనమై పోవటం, రాళ్ళూ రప్పలూ, చెట్లూచేమలూ రాక్షస వీరుల చంపటమా? కాలం కలసిరానప్పుడు తాడే పామై కాటేస్తుందన్న జన వాక్యం ఇందుకే వచ్చింది కాబోలు. నేనుమాత్రం వీళ్ళను నిర్జిస్తానా? కాని పోరి కొందరచంపి మరి చస్తాను" అని చింతించి, అధికాగ్రహాన్ని పొంది మత్తుడు, శాత్రవ మాంసరక్త ఫేనం, భృశధీశత్వం, కనకపట్టాన్వితం, మహాపద్మ సార్వభౌమ సుప్రతీకాది దిగ్గజభీప్రదం, శోణిత మాల్యాలంకృతం, దీప్తాగ్రం అయిన గదదాల్చి కల్పకాల వీతిహోత్రుడు వలె కపులపైపడి కంకులనుంచి ధాన్యంరాల్చినట్లు శిరాలను ధరణిపై రాల్చుతున్నాడు. సంతోషమత్తుడైన శాఖామృగాలను చంపుతుంటే ఋషభుడు అంబర మార్గంలో వచ్చి అడ్డగించి నిల్చాడు. మత్తుడు గదతోనూ, ఋషభుడు వృక్షశైలాలతోనూ చాలాసేపు సమంగా పోరారు. ఒకరిని మించాలని ఒకడు యత్నం చేశాడు. రక్కసుడు ఒడుపుచూపి గదతో వానర ముఖ్యుణ్ణి వేశాడు. భిన్నవక్షుడై కపి కస్సునలేచి వృక్షంతో మోదాడు. వాడు గదతో దాన్ని తప్పించి గదతో తలపై ప్రహరించటానికి ఎత్తగానే చెంగున వానరుడు పైకివాటి గదగుంజుకుని దానిచేతనే మత్తుని తలపై బాదాడు. ఆ దెబ్బతో త్రాగినమత్తూ, పేరుకోని మత్తు

వదలి ధరాలింగనం చేసుకున్నాడు. అతడి చావుతో అసురులు పలాయనం చిత్తగించారు.

## అతికాయుడు కపులను పారదోలుట

అంతకుని అపరావతారం అనదగిన అతికాయుడు అనుజాతులు, పినతండ్రులు గతించిన వార్తకు గగ్గోలుపడ్డాడు. కటములదిరినై. విషయ విమర్శనాబుద్ధి నశించింది. శరీరంవలెనే ఆగ్రహం పెరిగింది. అజ్ఞానంతో పాటు అహంకారం నిండింది. తెగిన తనవాళ్ళ సరసన శత్రువులు శయనించినట్లుగా వూహించుకున్నాడు. బ్రహ్మదత్తవరాలు, నిజపర్వతాభ కాయం, గతకాల సంపాదితయశం, స్ఫురణకు రాగా, ఇంకెంతవాడైనాడు. భానుసహస్ర సన్నిభమైన రథం ఎక్కాడు. రభసంతో చాపాన్ని సజ్యంచేశాడు. పేరువాడి గర్జలచేశాడు భుజాస్ఫాలనంచేశాడు. తేరతోలిస్తూ వానరవీరుల వెంటబడ్డాడు. వస్తున్న అసురవీరుని దేహాన్నిచూచి వానరులు "కుంభకర్ణుడు బ్రదికివచ్చాడా?" అని భావించి యుద్ధంమాని గుంపులు గుంపులుగా కూడి పారిపోయే ప్రసంగం ప్రారంభించారు. చివరకు గత్యంతరంలేక రఘువంశసోముని పాదాలపై పడ్డారు. రాముడు భీతి ఎరుగని కపివీరులు ఆర్తులై తన రక్షణ కోరటం చూచి నలుదిశల పరికించాడు. మితి చెప్పటానికి సాధ్యంకాని ప్రమాణంలో వున్న తేరెక్కి, శిరమెత్తి చూచినా చివర కానుపించని శరాసనం ధరించి, రెండవ కుంభకర్ణుడా? అన్నట్లు వచ్చిన ఆ పలలభోజిని దర్శించాడు. క్షణకాలం ఆతనిని ఎగదిగ చూచాడు. "కుంభకర్ణుడు పదాతి. సహజశక్తి సంపన్నుడు. వీడు రథారూఢుడు. అస్త్రపాటవం కలవాడు. అంత శరీరం కలవాడు. కధదం కష్టం కావచ్చు. కుంభకర్ణుని పరాక్రమం చూసిన కపులు వీడిపై యుద్ధానికి జంకుతున్నారు. ఇతని వృత్తాంతం విభీషణుని అడుగుతాను. విషయం తెలుసుకుని కర్తవ్యపాలనం చేస్తాను" అని చింతించి విభీషణుని రావించాడు. "మిత్రమా, ఎవడీతడు? కుంభకర్ణుని కంటే అధికుడు లేడన్నావుగదా? వీడు సాక్షాత్తు అతనిలాగే వున్నాడు. ఆతనికి లేని ఇతర సాధనాలు ఇతనికి వున్నై. ఈతని చూస్తుంటే మన ప్లవగ ముఖ్యులు ఎదిరించి పోరాడలేరని తోస్తుంది. భీతి నెరుగని మన

వాళ్ళు భీతి పొందుతున్నారంటే ఏదో బలవత్తర కారణం వుంటుంది. ప్రకృతి భీషణ రూపాన్ని తాలుస్తోంది. రెండు వర్గాలు ప్రాణ నష్టాన్ని పొందక తప్పదు. మనవాళ్ళకు భయం తీరేట్లుగా పరిహారం చెప్పు" మని అడిగాడు. విభీషణుడు రామునకు అభివాదం చేసి "రామ ప్రభూ! నేను వచ్చినదాది నిన్ను గమనిస్తూనే వున్నా. ఒక్కసారి కూడ నీ ఊహ వ్యర్థంకాలేదు. నీవు సత్యమూర్తివి. నీకు సత్యంగాక అసత్యం ఎందుకు స్ఫురిస్తుంది? ఎప్పుడు ఎవరితో మాటాడటం మంచిదో, ఎవరి సలహా పొందటం శ్రేయస్కరమో నీకు తెలిసినట్లు ఇంకెవరికీ తెలియదు. ఇందుకు మన మిత్రత్వమే ప్రబల సాక్ష్యం. నేను శత్రు సోదరుడనని ప్లవగ ప్రభువు ఆశ్రయం నిరాకరించుమని చెప్పినప్పుడు, ఆతనిచే అంగీకరింపచేసిన నేర్పు సామాన్యమా? ఒక వంక ప్రమాణం చేసిన ప్రాణమిత్రుడు. ఇంకొకవైపు ఘోరావమానంచూర్చిన శత్రువు తమ్ముడు. ఆతని నిగ్రహించి ముక్కు మొగ మెరుంగని నాకు అభయం ప్రసాదించావంటే నీవెంత సత్యదర్శనుడవో, ధర్మపక్షపాతివో లోకానికే వెల్లడైంది. మూర్ఖులు నేను రహస్యాలు వెల్లడించకపోతే నీవు యుద్ధంలో విజయం పొందలేవనుకుంటారు. అది తెలివి తక్కువ వూహ. వాళ్ళ చావులు నర వానరుల చేతిలోనే వున్నై అని నాకు ఏనాడో తెలుసు. నన్ను నా అన్న వెళ్ళగొట్టకపోతే నేను రాను కదా? మీకు యుద్ధం తప్పదు కదా? అప్పుడైనా అశర కులనాశం మీచేత జరిగేది. నాగపాశబంధాలు నేను విప్పలేదుగదా? ఇంద్రజిత్తు ప్రయోగిస్తాడని చెప్పలేదుగా. వైనతేయుని రమ్మని వార్త బంపలేదుగా. నా అన్నచేత మూర్ఛిల్లిన లక్ష్మణుని నేను తేర్చలేదుగా. వార్ధిబంధనం నేను చేయించలేదుగా? మా వాళ్ళల్లో ఎవరిని గూర్చి నీవు తెలుసుకుంటున్నావో వాళ్ళంతా నాకు అయినవాళ్ళు. వాళ్ళను చంపటానికి ముందు నాకు కష్టం కలుగుతుందేమో యని నన్నే అడుగుతున్నావు. రాజ నీతిలో మిత్రధర్మం సాధిస్తున్నావని ఎంతమందికి తెలుసు? ఇక నేను మర్మాలు చెప్పటం తప్పనుకుంటారు. నేను ఆయనవద్ద వున్నంతకాలం ఆయనమేలే కోరాను. వచ్చేముందుకూడ హెచ్చరించాను. నన్ను దాయాదివని నా అన్నే గుర్తుచేసి ముప్పు తెచ్చుకున్నాడు. ఇప్పుడు నేను

నిజంగా దాయాదినే. నీచేత నా అన్న హతుడవుతాడని నిర్ణయించు
కున్నాను. ఆతని అనంతరం సింహాసనం ఆశించాను. అందుకే వచ్చాను.
అందుకే అన్ని రహస్యాలు చెప్తున్నాను. అవసరమైతే యుద్ధంకూడ
చేస్తాను. నయవంచన తప్పుకాని, శత్రువుశత్రువుగా, మిత్రుడుమిత్రుడుగా
వర్తించటం న్యాయసమ్మతం. ఇంత ఎందుకు చెప్పానంటే మనమిత్రు
లకే ఈ రహస్యం తెలియదు. ముందు ముందు విన్నా నన్నూ అపా
ర్థం చేసుకోకుండా చెప్పాను. నీవడిగిన ఈ మహామూర్తి వృత్తాంతం
వివరిస్తా విను.

## రాముడు విభీషణుని అతికాయుని గూర్చి అడుగుట

రాముడు నూతనంగా యుద్ధానికివచ్చిన మహాకాయుణ్ణి గూర్చి వివ
రాలు విభీషణుని అడగటం, ఆతడు చెప్ప సంకల్పించటం జరుగంగానే,
మారుతి రవిపుత్రాంగదాదులు కూడా అక్కడికి వచ్చారు. నరాంతకాదులు
ససైన్యంగా నాశనంకావటంతో తెరపి కొంతవచ్చింది. ఊపిరి పీల్చు
కుంటున్న వనాటులకు ఈ భయంకర మూర్తి ఆగమనంతో ఎక్కడలేని
భయం వచ్చింది. రాముని, కర్తవ్యం ఏమిటని అడిగే నిమిత్తం అధి
పతులంతా సమావేశం అయినారు. రాముడది గుర్తించాడు. "పూజ్యుడా!
విభీషణా! మనవాళ్ళంతా వచ్చిన విషయం ఏమిటో నీకు మనస్సుకు వచ్చి
వుంటుంది. కుంభకర్ణుడికీ, వీడికీ చాలా పోలికలున్నై. ఆ మహాకాయం!
సింహలోచనాలు, ఆకారసౌష్ఠవం అంతా అతనిదే. మీదుమిక్కిలి, చాపా
యుధుడు. హయసహస్రకస్యందనాసీనుడు. ప్రాస తోమరశూలాది సాధన
సంపన్నుడు. శంపాలతతో కూడిన జలధరంలాగా, భూతపరివృతుడైన
భూతేశుణ్ణి పోలివున్నాడు. కాలభుజంగజిహ్వాభమైన శక్తి ధరించివున్నాడు.
కాంచనపృష్ఠంగల నవ్యచాపాలు మాలగా రథానికి శోభకూర్చుతున్నై.
రాహుచిహ్నితకేతనం ఎగురుతూ వుంది. మధ్యందిన మార్తాండునివలె తేరి
చూడరాని కాంతులతో శరాలు దొనలనిండా నిండివున్నై. చేతనున్న
చాపం త్రిణతం. జలద నిర్హ్రాదం. హేమమయం. ప్రాంచితం. రథం
సధ్వజం, సారథి చతుష్కం, సపతాకానుకర్షం, ధ్వనితం, త్రిదశసంఖ్యా
తూణీరసంవృతం, పదిమూరల పొడవు, నాల్గు మూరల వెడల్పుగల

పిడులు గల్గిన ఖడ్గాలు శతంకలిగి భయంకరంగా వుంది. రక్త పుష్ప-
మాలాంచిత గళుడు. కాలముఖుడు. కాలుడు. మేఘమధ్యస్థ తరణి సన్ని-
భుడు. ఎవరయ్యా వీడు? హాటకాంగదసద్ధ భుజాలతో హిమగిరి శృంగ-
సమంగా వున్నాడు. కుండలాలతో వెలిగే వీడు పునర్వసు నక్షత్రంలో
పొడిచే చంద్రుడువలె విరాజిల్లుతున్నాడు. వీడెవరయ్యా! విభీషణా! మన
వారంతా భీతులై పరువెత్తి వచ్చారు. ఇంద్రజి యుద్ధం తర్వాత కుంభ-
కర్ణుని యుద్ధంవరకు మదము త్రిప్పకుండా పోరి మహారథుల, సేనా-
పతుల బలిగొన్న మర్కటశ్రేష్ఠులు శక్తి మేఘంలేని పిడుగులాగా వచ్చిన
వీణ్ణిచూచి, ఇతి కర్తవ్యతా మూఢులై నీ కోసం ఎదురు చూస్తున్నారు.
వీరి భయంపోయే విధంగా విషయ వివరణం చేయమని తిరిగి విన్న-
కోరుతున్నాను" అని ప్రశ్నించాడు. రావణానుజుడు రాముడు రెండవ-
మారు ప్రశ్నించిన దానిలో మొదటి దానికంటే అర్థయుక్తంగా
వుండటం గ్రహించి, విషయం ఆమూలచూడం చెప్ప-
సాగాడు. "రామప్రభూ! నా అన్నకు ధాన్యమాలిని యందు జన్మించాడు.
తండ్రికి తగిన పుత్రుడేకాక, తండ్రిని మించినవాడు. రణరంగంలో
తిరుగులేని శూరుడు. వృద్ధుల సేవలో విద్య నేర్చిన వివేకి. అస్త్రవిత్త-
ముడు. దారుణాతి దారుణకృతి. ఉత్సాహవంతుడు. శ్రుతునెరింగినవాడు.
గుర్రంపైన, రథంపైన, దంతిపైన సమంగా పోరాడగలవాడు. చాపంతో,
శస్త్రంతో శత్రుక్షయం చేస్తాడు. మల్లయుద్ధంలో మర్మాలు పెక్కు తెలి-
సినవాడు. సామదాన భేదదండ విధుల్లో, మంత్రాంగంలో మహాపండితుడు.
ఈతని కనుచూపులో లంక దుష్ప్రవేశమై, దుస్సాధమై, నిరంతర లక్ష్మీ
విలాస భాసురంగా వుంది. అన్వర్థంగా తండ్రి అతికాయుడని నామకరణం
చేశాడు. ఇది ఇతని సహజశక్తి. భయంకర తపంచేసి బ్రహ్మదేవుణ్ణి
సాక్షాత్కరించుకున్నాడు. ఆయనచే అప్రతిహత క్రూరనారాచాలు
పొందాడు. ఎవరిచేతను చావులేని వరం పొందాడు. ఇతడెక్కి వచ్చిన
రథం, మేనధరించిన కవచం బ్రహ్మదత్తాలు. అచ్ఛేదకాలు. యుద్ధాలల్లో
తండ్రికి బాసటగా నిల్చి యక్షదానవ నిర్జరుల జయించాడు. దివ్యాస్త్ర-
మహిమతో, యముని పాశాన్ని, ఇంద్రుని వజ్రాన్ని భంగించాడు. రాక్ష-
సుల్లో మేటి. ఈతడు వానరులకు అవధ్యుడు. వీడు విజృంభించకముందే,

వానరులు క్షయం కాకముందే మీ ఇద్దరిలో ఒకరు ఎదుర్కొని ప్రతిపక్షిని వధించాలి. నేను ఆపగలనుకాని చంపలేను. అడుగో వస్తున్నాడు. రథ ఘోష విన్నావుగదా?" అని విభీషణుడనగానే "అన్నా! నేనున్నాను! నీవు విశ్రాంతి తీసుకో. నీ అనుగ్రహం నాకున్నంతవరకు అపజయం మనకు రానీయను. బ్రహ్మదత్తవరాల్లో వీడినాశనానికి మార్గం స్ఫురించక పోదు. వీడు నాచే చావటం మాత్రం తథ్యం." అని చెప్పే లోపల, జ్యాఘోషం లోక భీషణంకాగా, క్షీరవారిలో మందరంలాగా తిరుగుతూ కపిసేనను సంక్షోభపరుస్తుంటే, వానరులు నిలువలేక వైదొలగిపోతున్నారు మైంద ద్వివిద కుముదనీల శరభాదులు రేగి చుట్టూ మూగి, సాగిరాకుండా పర్వతాలతో, వృక్షాలతో వదలకుండా ప్రహరించారు. వాడు విలాసంగా అన్నింటినీ పొడిపొడిచేసి, దారుణాస్త్రాలను నాటి తనువుల నొప్పించాడు. మారుచేయలేక మర్కట నాయకులు వెనుకకు తప్పుకున్నారు. జింకలపై సింహం దూకినట్లు కపివర్గంపైబడి హల్లకల్లోలంచేస్తూ, వస్తున్న లక్ష్మణుని చూచాడు. "ఈతడు రామలక్ష్మణులలో ఒక్కడై వుంటాడు. కోతిలక్షణాలేవీ లేవు. సర్వశుభలక్షణాలు కలమానవులు వున్నట్లే వీడూ వున్నాడు" అని ఆలోచించి, గర్వాంధకారం కన్నులు కప్పగా, రాక్షసుడు కావటం, రక్తం చూస్తుండటంతోడై, సజల జలధర ధ్వానంతో రథాన్ని ముందుకు తోలించి "నాకెదురు వచ్చే మానవుడా! ఆగు. నేను నీతో కొన్ని మాటలు చెపుతాను. విని ముందుకురా" అని అన్నాడు.

## అతికాయుడు లక్ష్మణుని ఆక్షేపించి తూలనాడుట

"నా పేరు అతికాయుడు. లంకేశుని పుత్రుణ్ణి. చాప శరపాణినై సంగర రంగానికి వచ్చాను. బల విక్రమ పౌరుషాలలో హెచ్చినవాణ్ణి. ప్రాకృతులపై బాణంవేయని వ్రతం కలవాణ్ణి. రథస్థుణ్ణి. మీఇంత సేనలో నాతో సమరం చేయగల సమర్థుడుంటే ఆతడు నా ఎదుటికి రావచ్చుగాక" అని స్వోత్కర్ష ప్రదర్శించాడు. మాటలు వింటూ నిలిచిన సౌమిత్రి వెంగున ముందుకు దూకాడు. "రాత్రించరవరా! నీవు చెప్పినవన్నీ విన్నాను. నేను కొన్ని చెపుతాను. నీవు విను. తరువాత ఇద్దరం ఏమి చేయాలో నిర్ణయించుకుందాం. నీవన్నట్లు నేను మానవుణ్ణే. నా పేరు

లక్ష్మణుడు. నా అన్న పేరు రాముడు. ఈ మహా కపిసైన్యానికి సర్వాధి
కారి నా అన్న. అతని అంగరక్షణ నా కర్తవ్యం. నీవు ప్రాకృతుల
వేయనని ప్రగల్భాలు పలికావు. నా అన్నగాని, నేనుగాని ఎంత ప్రమాదం
వచ్చినా శత్రువు మాకభిముఖుడు కాకపోతే అతనిపై శరం వదలం. యుద్ధం
చేస్తూ శరచాపాలు విడిచినా, వెనుకకు ముఖం త్రిప్పినా చంపం. పారుబోతుల
విషయం మాకు పట్టనేపట్టదు. నీకు ముందు యుద్ధానికి వచ్చినవారంతా
ఇంతకంటే తక్కువ ప్రసంగం ఎవరూ చేయలేదు. చేసి మాతో పోరాడి
లంకకు ప్రాణంతో మరలిపోనూలేదు. నీవుగాని, నేనుగాని యుద్ధ
మధ్యంలో ప్రాణాలపై తీపితో వెన్ను చూపకూడదు. ఈ సమయం నీ
కిష్టమైతే నేను నీతో యుద్ధం చేస్తాను. అంగీకారంకాకపోతే ప్రాకృతుల
చంపనన్నావు కనుక సైన్యంతో తిరిగి లంకకు పో. నీ దారి కెవరూ
అడ్డంరారు. ఇవీ నే చెప్పే మాటలు. విన్నావు కనుక నీ ఇష్టం చెప్పు.
ఏమంటావు?" అని వాగ్రజ్జువుల్లో రాక్షసుణ్ణి బంధించాడు. అతనికి
హెచ్చరికగా ఆలస్యం చేయవద్దన్నాడు. "మానవా! నీవు బాలకుడవు.
తెలివికలవాడవైనా, ధైర్యశాలివైనా, తారతమ్యం తెలుసుకోకుండా
మాట్లాడావు. అంగరక్షకుని విధివేరు. ఆహవం చేయటం వేరు. అల్ప
చాపం. ఒక అంబులపొది. నా రథం వంక చూచావా? నీకే తెలియ
వస్తుంది. నీ ఆకారం నా ధనువంత లేదు. నాతో నీవు ఏ సహాయం
చూచుకుని పోరాడతానన్నావో బోధపడలేదు. ఆత్మవిశ్వాసం ఎంతవున్నా
పరశక్తి గ్రహించే నేర్పుకూడా వుండాలి. నీకది బొత్తిగాలేదు. నీ మాట
లతో జంకి మరలిపోతాననుకునివుంటావు. అమాయకుడివి. మేం మాయల
మారులం. రాక్షసులం. నా ధనువు విడిచే బాణాలకు హైమ మహీధరం
ఆగలేదు. ఆకాశ సంచారులు అసలే నిల్వలేరు. నీ లెక్కేమిటి? సుప్త
కాల భుజంగాన్ని పరిహాసానికి లేపి ప్రాణాలకు ముప్పెందుకు తెచ్చుకుం
టావు? విల్లు నేలపడవేసివెళ్ళిపో. విల్లుతో నిన్ను వెళ్ళనీయను. ఇంతవరకు
నీ ఆకారం, పౌరుషవాక్యాలై నా తంత్రీస్వనంవలె కర్ణపేయం కల్గించటం
కారణంగా నిన్ను శిక్షించలేదు. నీవు చెప్పిన వాటి కన్నింటికీ సిద్ధమే.
నీవుకూడ నీ చావుకు సిద్ధమన్నమాటేగదా? సమాధానమిచ్చి సంగరంలో

విలుస్తావా? అన్న రక్షణకు అంగలారుస్తావా? ఏదో ఒకటి తేల్చిచెప్పు" మని అతికాయుడు నవ్వాడు.

## లక్ష్మణుడు అతికాయుణ్ణి ధిక్కరించి ఆక్షేపించుట

"ఓహోహో! ఎంత చదివావు? నేను నిన్ను కోరింది రెండే రెండు మాటలు. అవి, ఇష్టం. అనిష్టం. అంతేకాని నీప్రతాపం వర్ణించి నన్ను భయపెట్టమనికాదే? నేను మానవుడనే. అల్పచాపం కలవాడనే. బాలకుడనే. పరబలం తెలియనివాడనే. అటువంటి వానితో ఇంత అధిక ప్రసంగం ఎందుకు చేశావో నాకూ బోధపడలేదు. మాటల బింకంతో కయ్యంలో పొంకంరాదు. స్వశ్లాఘతో సజ్జనుడనే కీర్తిరాదు. వృథా జల్పాలెందుకు? నా చేతిలో శరమూవుంది. శరాసనమూవుంది. చిన్నదో, పెద్దదో అంబులపొదీవుంది. నాకదిచాలు. ఊరకుక్కలు పదిపే లెందుకు? చాలదా వేటకు ఒక జాగిలం? అన్నారు పెద్దలు. బండెడు ఉప్పురాశిపై కుండెడు నీళ్లుపడితే ఏమవుతుందో నీకింకా స్వానుభవంలోకి రాలేదు. ఇప్పుడు వస్తుంది. దౌర్బల్యంచూపక దురుసు మాటలెందుకు పలుకుతావు? ఆత్మస్తుతివదలి అస్త్రధారణంచేసి ఆహవంలో నీ ఆధిక్యం చూపు. అందరు సంతోషిస్తారు. నేనూ సంతోషిస్తాను. శూరుడైనవాడు ఊరక తెగపొగడుకోడు. పోరికి తగిన అన్ని అస్త్రశస్త్రాలు పూనివున్నావు. కొండవంటి రథంపై వున్నావు. నేను పదాతిని. అల్పచాపంకలవాడను. మితశరతూణీర ధారిని. ఇంకేం. నిక్షేపంలాగా యుద్ధంచేసి నీ చావుకబురు నీ అంగరక్షకులచేత తండ్రికి పంపించు. నేను బాలుడనో, నీపాలిటి కాలుడనో నీవే నిర్ణయించుకో. నా అల్పచాపాన్ని సజ్యంచేస్తున్నాను. ఆపై నీఇష్టం" అని సౌమిత్రి కోదండంవంచి నారి తగిలించి వామ హస్తంతోపట్టి, కుడిచేత ఆకర్ణాంతం నారిలాగి వదలాడు. అసురుని వెంటవచ్చిన ఆశరసైన్యం అభిమంత్రితమైనట్లు నిశ్చలమైంది. ఆ ధ్వనికి సహస్ర హయమండిత రథం అపసవ్యంగా ముమ్మారు తిరిగి మొగ్గతిల్లింది. అతికాయుడు అపసవ్య భ్రమణంలో వున్న రథాన్ని పాద ఘట్టనంతో ఆపుతూ ఆవులించాడు కరంలో ధనువు కంపించింది.

# అతికాయ లక్ష్మణుల యుద్ధం

లక్ష్మణుడు "ఆశరవరా! ఇప్పుడు బాలుడనో, తరుణుడనో, వృద్ధుడనో. తెలుసుకో. నీవంటివాడే బలి వామనుణ్ణి బాలుడనే భ్రమించాడు. పాదం నెత్తిన పెట్టినప్పుడుకాని అతడెవరో అర్థంకాలేదు. అది నీకు అర్థం కాకముందే గతిస్తావు. అతడు జీవించాడు కనుక అర్థమైంది. నేను సిద్ధంగా వున్నాను. నీవు నాపై ఏం ప్రయోగిస్తావో ప్రయోగించు" మంటూ చాపంలో శరం తొడిగి విల్చున్నాడు. ఆ మాటలను అతికాయుడు అతి రోషవివశుడై, తీవ్రాశుగాన్ని చాకచక్యంగా చాపవిముక్తం చేశాడు. ఆ బాణం వింటినుంచి వెడలీవెడలకుండగనే ఖండితమైంది. ఆ అపూర్వ యుద్ధం తిలకించటానికి అమృతాంధసులు ఆకసంపై గుంపులుగట్టి నిల్చున్నారు. ప్రయోగ పూర్వంలోనే శరఖండనం జరగటం శిరఃఖండనంజరిగినట్లే సిగ్గుపడ్డాడు. అయినా రాక్షసుడు. అహంకారి. మళ్ళీ ఆశీవిషోపమమైన అంబకం ధూమ్యాకాశాలు నిండగా ప్రయోగించాడు. లక్ష్మణుడా శరాన్ని సమీపానికి వచ్చేదాకా వూరకున్నాడు. దివిచరులు, నిశాచరులు, వనచరులు అకంపితగాత్రులై చూస్తున్నారు. అసుర ప్రయుక్తాస్త్రం అంతలోనే అర్ధచంద్ర బాణంతో ముక్కలు ముక్కలైంది. దివిచరులు, వనచరులు హాయిగా ఊపిరి విడిచారు. నిశాచరులు, నిశాచర నాయకుడు దుఃఖం తప్పవగా అన్ని అవస్థలు పొందారు. అది వ్యర్థంకాగానే పంచశిఖాలను పంచముఖాలుగా ప్రయోగించాడు. లక్ష్మణుడు ఒకేఒక మార్గణంతో వాటిని నామరూపాలకు తప్పించాడు. ఆ శరసంధాన లక్షణం అసురులకే అంతుపట్టలేదు. అసురుడు ఆశ్చర్యాన్ని అణచుకుంటూ శరం సంధించే లోగా, సౌమిత్రి హేతిసహితానలసంకాశపృషత్కం కర్ణ స్పర్శగాలాగి జ్యాటంకారం శత్రుఫాలవిపాటనం యుగపత్క్రియగా ప్రయోగించి చిరునవ్వు నవ్వాడు.

ఆ శరఘాతానికి ఆశరముఖ్యుడు నిబ్బరించుకోలేక ఆకంపించాడు. అతికాయుని కంపంగని ఆకాశచరులు ఆనందనృత్యం చేశారు. శంకర శరహత కీనాశపుర ద్వారంలాగా చలించుతున్న రథాన్ని విలోక్క-

తన్నాశ్వసించుకుని, కర్తవ్య విమర్శనం కావించి, తన ఎదుట మంద హాసభాసుర వదనారవిందుడైన సుమిత్రానందనుణ్ణి కాంచి, పరశక్తి గ్రహణపారీణుడైన ఆ మేటి విలుకాడు, అతికాయుడు, "లక్ష్మణా! మేలు మేలు. నీవు నాకు శత్రువు అయినా, నీ బాణశక్తి లాఘవాలను మెచ్చుకుంటున్నాను" అని చేతిలోని శరం ప్రక్కనుంచి, చేతులు రథంపై మోపి శిరంవంచి గౌరవించాడు. లక్ష్మణుడు అతని కుటిలత లేని వీరుడుగా గుర్తించి, తన చాపాన్ని అడ్డంగా పట్టుకుని శరం నొసలుకు తాకించి, ప్రతి గౌరవంచేశాడు. ఉభయులు గౌరవాలందుకుని తిరిగి యుద్ధానికి సిద్ధపడ్డారు. అతికాయుడు క్రమంగా వేగం హెచ్చించి, రెండు, మూడు, అయిదు, పది, నూరుగా అస్త్రాలు చిత్ర విచిత్ర రీతులతో సంధించాడు. శత్రువునకు శ్రమ మిగిలేలాగా సౌమిత్రి ఒక్కటీ వదలకుండా అన్నీ వ్యర్థం చేశాడు. శతందాటి సహస్రంలోపడినా సౌమిత్రి చెదరక బెదరక చదరంగంలో పావుల చంపినట్లు శత్రు ప్రయుక్త విశిఖాలను చెండి వేశాడు. అతికాయుని అస్త్రపాటవం సౌమిత్రికి ఆటగా వుందికాని, అలసటకాని, ఆగ్రహం పెరగటంకాని కల్పించలేదు. అసురుడు తన విద్యపై, తనపై తానే అసహ్యించుకున్నాడు. అవమానం ఆకందంగా భావించి అమోఘాస్త్రాన్ని లాగి ధనుర్విముక్తంచేసి సౌమిత్రి స్తనాంతర్భాగంలో నాటాడు. ఆ శరంతాకగానే సౌమిత్రి గుండెనుంచి రక్తం చిమ్మన గ్రోవిలాగా చిమ్మింది. మత్తేభం మదజలాన్ని స్రవిస్తూ మనోహరంగా వున్నట్లు రక్తసిక్త దేహంతో లక్ష్మణుడు వర్ణాధిక్యం పొందాడు. అస్త్రబాధ ఓర్చుకుంటూ బాణాన్ని ధనువులో తొడిగి పావక మంత్రంలో ప్రజ్వలింపచేసి ప్రయోగిస్తే, రాక్షసుడు సౌరాస్త్రాన్ని సంధించాడు. అవి ఒకదాన్ని ఒకటితాకి క్రుద్ధ సర్పాల్లాగా ఆకాశంలో పోరిపోరి రెండూ భస్మమైపోయినై. అసురుడు తన బాణం ప్రత్యర్థి బాణంతో హతమైపోగానే మరో అస్త్రం వెంటనే వేశాడు. దాన్ని ఐంద్రాస్త్రంతో వారించి, వైరివేసే అలుగుకోసం లక్ష్మణుడు ఎదురుచూస్తూ నిల్చున్నాడు. ప్రతిశరం వ్యర్థం అవుతుంటే క్రుద్ధుడైన నిశాచరుడు యామ్యాస్త్రం తెగ దిగిచి వదిలాడు. వాయవ్య శరంతో దాన్ని భంగించి, తెరిపిలేకుండా సౌమిత్రి శరవర్షం కురిశాడు.

పలలభోజి ప్రతి శరాలను ప్రయోగించక మిన్నకున్నాడు. అవిలక్ష్యమైన వక్షాన్ని తాకి మిట్టి మిడిసిపడి నేల దొరగుతున్నై. అక్షయ తూణీరంలోని అస్త్రాలన్నీ అనుసరించినా అవధ్యవర్మని శరీరం కసుగందలేదు.

## లక్ష్మణునిచే అతికాయుడు చచ్చుట

ఆశరుని సర్వాస్త్రాలు అపహృతంకాగానే ప్రతిక్రియమాని అజుడిచ్చిన అవధ్యకవచాన్ని ఆయుధంగా అతికాయుడు ఉపయోగించుకుంటున్నాడు. కోపం తీవ్రతతో రహస్యం గమనింపక చంపాలనే పట్టుదలతో సౌమిత్రి శిలీముఖ వర్షం కురుస్తున్నాడు. శక్తి సంపన్నాలైన అస్త్రాలు నిరర్థకమైపోతున్నై. అంతకంతకు ఆగ్రహం పెరిగి ఇంకా - ఇంకా ఎన్నో-ఎన్నో-ఇషీకాలు-ఇంతలో ప్రళయంగా గాలి వీచింది. ఆ పవనం పవనుడుగా లక్ష్మణుని చెవుల్లో పరిహారం పలికింది. "సౌమిత్రీ! వీడు అవధ్య తనుత్రాణుడు. అజుడిచ్చిన వరం అది. వీడు ఇతర దివ్యాస్త్రాలు ఎన్ని వేసినా చావడు. బ్రహ్మాస్త్రం ఒక్కటే వీడిపై పని చేస్తుంది. వీడు వరలబ్ధ కవచుడన్న విషయం విని కూడ కోపంలో మరచావు. పరమాస్త్ర సంవేది. అతడు ప్రతిహింసకు దిగకముందే ప్రాణాలు కొను" మని. ఆ రహస్యం ఆ లక్ష్మణునికి మాత్రమే వివిపించింది. తక్కిన లోకానికి గాలి వీపరీతంగా వీస్తునటే వుంది. పవనుని ప్రబోధం లక్ష్మణునకు ఆకలికొన్నవానికి అమృతం లభించినటైంది. తత్‌క్షణం సామాన్య శరం తీసి ధనువు తొడిగి బ్రహ్మధ్యానంతో అభిమంత్రించి బ్రహ్మాస్త్రంగా మారుస్తుంటే దిఙ్నభోంతరాళాలు కాంతితో నిండినై. సూర్యచంద్రాది గ్రహాల గమనం స్తంభించింది. యమకింకర సదృశమై, అమలపుంఖమై, అతిక్రమిత సర్వశక్తిమంతమై, ఆకర్ణాంత ధనుర్గుణ ముక్తమై, పరమ పతివ్రతామ తల్లులు, మహాయోగినులైన భార్యా మాతృ దేవతలు ఊర్మిళా సుమిత్రల ధ్యానమగ్నుడైన లక్ష్మణప్రయుక్తమై వస్తున్న అస్త్రానికి రొమ్మియక, దారుణాస్త్రాల నెన్నింటినో ప్రయోగించాడు. అవి అన్నీ బ్రహ్మాస్త్రంతో పరిహరింపబడ్డై. సమీపించిన కొద్దీ శక్తి గదా కుఠారశూలాది సాధనాలను చిమ్మాడు. వాటి

న్నింటినీ భస్మ సాత్కృతం చేసి బహ్మాస్త్రం మణి కిరీట మండిత శిరాన్ని సశిరస్త్రంగా త్రెంచి అంతర్థానమైపోయింది. హిమనగశృంగం విరిగిపడ్డట్లు అసుర శ్రేష్ఠుడైన అతికాయుని శిరం పిడుగులాగా పుడమి పడింది. నిహతశేషులైన నిశాచరులు నాయకుడు మరణించగానే లజ్జవీడి ఏడుస్తూ, వనచరులు వచ్చి చంపుతారనే భయంతో లంకాభిముఖులై పారి పోయారు. వికసిత పద్మాలవలె ప్రసన్నవదనులై ప్లవగులు పరుగు పరుగున వచ్చి సౌమిత్రిని పరమ హర్ష హృదయంతో పాదపూజ చేసి ప్రార్థనలు సలిపారు.

## అతికాయాదుల మరణం విని రావణుడు దుఃఖించుట

అతికాయుని వెంటపోయిన అసురులు ఏడుస్తూ వచ్చి లక్ష్మణుని చేత మృతుడైన సంగతి చెప్పారు. ఆ వార్త విని అసురేశ్వరుడు మొదలు నరికిన వృక్షం వలె మూర్ఛపోయాడు. శీతలోపచారాలవల్ల సేదతేరి "అయ్యో! కుమారా! నీవు కూడ నన్ను వీడిపోయావా? ఎవరు మానుష్య రత్నమో? ఎవరు దారుణ కోపుడో, ఆ ధూమ్రాక్షుడు కూలి పోయాడు. నిస్తుల వీర్యప్రశస్తుడు ప్రహస్తుడు కాలుని నోటికి కబళం అయ్యాడు. సముత్తుంగ బాహుప్రభావిష్ణ దిక్కరి కుంభుడు కుంభకర్ణుడు దిక్కుమాలి పోయాడు. దేవ దానవ యక్ష సైన్య వికంపనుడు అకంపనుడు అయ్యయ్యో! హతుడైనాడు. అక్కటా! వీరంతా అసమాన వీర్యవంతులు, దోర్యుగవిపాటిత శత్రువక్షస్స్థలులు, ఆహవదోహలులు, శాత్రవధర్షణులు, సాహసికులు. చివరకు ఒక్కడైనా నాకు దక్కలేదుగా? వీరేమిటి? వారేమిటి? నాకై యుద్ధంలో మరణించినవారంతా మహాయోధులే. మదమ త్రిప్పని శూరులే. మహాత్ములే. పరమాస్త్ర శస్త్ర విద్యా విశారదులే. పర చిత్త శల్యాలే. దేవ దైత్య దానవ నిషూదనులే. నా పాపం పండి అయ్యో! వీరలోకం చేరారు. జగద్వీరలోక వినుతుడు నా పట్టి ఇంద్రజి. బ్రహ్మదత్త శరాలతో భ్రాతలను బంధించాడు. ఆ బంధాలు త్రెంచటం ఎవరికీ సాధ్యంకాదు. యక్ష గంధర్వ కిన్నరామరులుకూడ శక్తి హీనులై లొంగిపోవటమో, మరణించటమో చేశారు. అట్టి నాగ పాశ బంధాలు, రామ రామానుజులు విప్పుకున్నారు. ఇది కలో, మాయో?

తెలియకుండా వుంది. ఇది వంచనమా? వాళ్ళ స్వీయ ప్రభావమా? ఏమైనా బంధముక్తులు కావటం జరిగింది. నేను పొమ్మన్న వారంతా అటెపోకే కాని తిరిగి రాకేలేము. ఇది ఎంత విడ్డూరం? సహజ సాత్త్విక ప్రవర్తనతో సంపాదించుకున్న శక్తులు పదారు వన్నెబంగారు కణికలు. పాశవ తపస్సువల్ల బలవంతంగా తెచ్చుకున్న వరబలాలు, కాకి బంగారు కడ్డీలు. ఎంత తెలివైనవారైనా, వరాలు కోరేటప్పుడు ఏదో శక్తి ఎక్కడో తెలియకుండా రంధ్రం వుంచనే వుంచుతుంది. అందుకు హిరణ్యాక్ష హిరణ్యకశిపులే ఉదాహరణ. నేను ప్రత్యక్ష సాక్ష్యం. నరవానరులగూర్చి నిర్లక్ష్యం ఎందుకు చేశాను? అక్కడే అతీతశక్తి వున్నట్లు భావించాల్సిన అవసరం వచ్చింది. కాలగర్భంలో కలియని ప్రాణి ఇంతవరకు ఎక్కడా కనుపించలేదు. ఎవరైనా కొంతవరకే వూహిస్తారు. అనంతకాలంలో వచ్చే ప్రకృతిలోని మార్పులన్నీ ముందే వూహించటం ఎవరికితరం? అది మహర్షులకే సాధ్యమైంది. వాళ్లు శాసించిన విధి నిషేధాలు సృష్టి కొనసాగినంతకాలం సత్యంగా జరుగుతై. అవి అనుసరించి మహాశక్తిమంతుడనయ్యాను. అవి తిరస్కరించి అధోగతి పాలవుతున్నాను. చేతులు కాలినై. ఇంక ఆకులెందుకు? ఇప్పుడు రామలక్ష్మణులను, వానరేశ్వరుణ్ణి, పావని విభీషణులను గెలిచే వీరుణ్ణి శోధించికూడా ఒక్కణ్ణీ చూడలేను. ఏమా రాముని పరాక్రమం? ఏమా అస్త్రబలం? సర్వలోక విదారణ సమర్థులైన నావారంతా పేరులేకుండా పోయారు? ఇంతటివాడు కనుకనే సీత నన్ను తృణీకరించింది. యోధవరులైన నావారంతా ఆయోధనంలో ఎవని చేత హతులైనారో అతడు మానవుడుగా వచ్చిన ఆదినారాయణుడే. శ్రీ మహావిష్ణువే అని నేననుకుంటాను. ఎన్నడు ఎరుగని అంతర్హిత్వారాల మాయుటం అతని భయంచేతనే కదా? విధ్వంసమైన లంకను ఇంకా హెచ్చరికతో కాపుంచాలి. మీరంతా అప్రమత్తులై శత్రువులను ప్రవేశించకుండా నిరోధించాలి. నా ఆజ్ఞలేకుండా అశోకవనానికి రాకపోకలు చేయవద్దు. ఇది కఠిన శాసనం. వైరుల సేనల ఎక్కడెక్కడ విడిసారో, మీరు అక్కడక్కడ తగిన బలాన్ని వుంచండి. అది పగలుకాని, ఉదయంకాని, సంజకాని, అర్ధరాత్రికాని, తెల్లవారు సమయమైనా కాని జాగరూకులై వానరుల రాకపోకలు, ప్రయత్నాలు పరికించండి. ఏమాత్రం

అగచరులపట్ల అలక్ష్యం చేయకండి. వాళ్లు సమర సన్నద్ధులుగావున్నారో, విశ్రాంతి తీసుకుంటున్నారో, మనమీదికి ఎత్తి వస్తున్నారో ఎప్పటి కప్పుడు వేగుతీయండి. ఇకపొండి. చెప్పినట్లు చేయండి. మీమీద నగర రక్షణం ఆధారపడివుంది" అని నిర్దేశించాడు. ప్రభువు చెప్పినట్లు లంకను దళపతులు కట్టుదిట్టం చేశారు. పరివారం నిష్క్రమించగానే పంక్తిముఖుడు మందిరానికి పోయాడు. అతికాయాది మహావీరుల మర ణానికి అతి వేలంగా శోకించాడు. కర్తవ్యతా మూఢుడై కలతలో మునిగాడు.

## ఇంద్రజిత్తు రావణుని ఓదార్చుట

ప్రయోజకులు, ప్రబుద్ధులు, ప్రతిలేనిశూరులు తనయులూ, తమ్ముళ్ళూ రామలక్ష్మణ వానర ప్రముఖులచే ఆహవంలో హతులుకాగా, దారుణ శోక భారాన్ని భరించలేక దిగులుతోశయనంపై దిక్కులుచూస్తూ కూర్చున్న తన తండ్రి స్థితి తెలిసి, ఇంద్రజిత్తు సరాసరి జనకుని సన్ని ధానానికి పోయాడు. జీవితంలో వెలితి ఏమిటో, కష్టం ఏమిటో, కడుపు శోకం ఏమిటో ఎరుగక, స్వీయ సింహాసనంపై అధివసించి ముక్కోటి దేవతల అనుశాసిస్తూ, మ్రొక్కులుకొంటూ, గ్రీష్మకాల రవిబింబంవలె తీక్ష్ణుడై, శరత్కాల చంద్రునివలె సుప్రసన్న తేజోవిరాజితుడై, విశ్వ స్రష్టకు ప్రతిగా వెలుగుతున్న తండ్రి, దీనుడై, దుఃఖితుడై, కర్తవ్యతా మూఢుడై, శయనమందిరంలో శయ్యపై పడివుండటం చూచి, ఇంద్ర జిత్తు నిలువు నిస్తారం కంపించిపోయాడు. క్షణకాలం నోటమాటరాలేదు. క్రమంగా నిగ్రహించుకుని "తండ్రీ! సుర దానవ దర్పవిహంత ఇంద్ర జిత్తు నీ దర్శనార్థం వచ్చాడు. నేనుండగా నిబ్బరం కోలుపోవటం నీకు ధర్మమా? ఇంతవరకు జరిగిన పరిణామం సహించరానిదే. అయినా నీవంటివాడు ఈవిధంగా విచారిస్తూ, శూన్యాన్ని చింతిస్తూంటే ముందు కాగల కార్యం ఎలా జరుగుతుంది? పోయినవారికంటే నేనధికుణ్ణి కాక పోయినా, వాళ్ళకులేని, మాయావిద్య నాకువుంది. మరణించిన మన వాళ్ళంతా వాళ్ళతో కలియబడి పోరాడారు. సాహసమే తప్ప శత్రువుల యుక్తిప్రయుక్తులు తెలిసి యుద్ధం ఎవ్వరూ చేయలేదు. వాళ్ళ కళ్ళకు

కనుపిస్తూ పోరితే జయించటం సాధ్యంకాదని తేలిపోయింది. ఇంద్రజి యుద్ధానికి పోతున్నాడంటేనే మాయాదేవి పూర్ణస్వరూపంతో పోతున్నట్టే యని నీకు తెలుసు. పొందిన నష్టాన్ని నేను పూరిస్తాను. నామొదటి సారి యుద్ధానికే రామలక్ష్మణులతోకూడి వానర సైన్యం అల్లకల్లోలమై పోయిందని కూడ నీవు ఎరిగిన విషయమే. నేను వచ్చానని తెలిస్తే వానరులు పంచబంగాళంగా పారిపోతారు. రవిపుత్రాంగదులు నన్ను సమీపించనేలేరు. ఇక దాశరథులున్నారు. వాళ్ళ దృష్టిలో నేను పడను. పడేవన్నీ ప్రాణాలతీసే బాణాలే. నీ విరోధులైన రామలక్ష్మణులభూశయనుల చేయించి నీకు చూపుతాను. తండ్రీ! నేప్రతినచేసి పలుకుతున్నాను. దైవ పౌరుష శక్తులు రెండూ నాకు సమంగావున్నై. నా విషధరకాండాలతో నీ విద్విషద్వయాన్ని సంగరాంగణానికి సంతర్పిస్తాను. ఇంద్రవిష్ణు దిననాధ కృశాను చంద్ర యమాశ్వినులు నా ఉద్ధతి వీక్షించి "రసాతలాన్నుంచి విష్ణువే వచ్చాడా" అని భావించేట్లు చేస్తాను. నాకు అనుజ్ఞ దయచేయి. నీవు శోకించవద్దు. మనచేత యుద్ధంలో మరణించలేదు? జయాపజయాలు నిర్ణయాతీతాలు" అని అనుజ్ఞనంది గృహానికి వచ్చాడు. దశవాయులకు కబురుపెట్టాడు. రథాన్ని అలంకరించి తెమ్మని సారథికి త్వరగా పంపాడు. అంతా సర్వసన్నద్ధంగా వచ్చారు.

## ఇంద్రజి ప్రథమ యుద్ధం

వాయువేగ మనో వేగాలతో సమంగా జవంగల రాసభాలను కట్టి, సకల రణసాధనాలను సంతరించి సారథి రథం తోలుకుని వచ్చాడు. పొడుపు కొండపైకివచ్చే పద్మినీ బాంధవుడులాగా రథాన్ని ఇంద్రజి అధిరోహించాడు. భేరీ శంఖరావాలు బ్రహ్మాండ కటాహం బ్రద్దలుకాగా మ్రోగిస్తూ, సూర్యరశ్ముల నిజకాంతులతో అపహ్నుతం చేస్తూ, శూల ముద్గరగదాది సాధనాలు ప్రకాశించగా రాక్షస సైన్యం వెంటరాగా, శంఖ శశివర్ణ విచిత్రచ్ఛత్రాల నీడను శారదా పూర్ణ నిశేశుడిలాగా రావణి రథంపై భాసించాడు. చామరధారులలో సరిలేని మేటియైన మందోదరీపుత్రునకు బంగారు పిడులు కల్గిన చామరాలు రాక్షస యువకులు వీచారు.

సూర్యునిచే ఆకాశం శోభించినట్లు రావణి రణసన్నాహం లంకను శోభింప
చేసింది. జయజయధ్వానాలతో సమరక్షేత్రం ప్రవేశించి నాల్గుదిశల నక్తం
చర వీరుల బలంగా కాపుంచి హోమకుండం నిర్మించి అగ్ని ప్రజ్వలింప
చేసి, లాజలు, గంధమాల్యాలు హవిస్సుతో అర్పించి శస్త్రాస్త్రాలను
సమిధలుగా చేర్చి, ఎర్రని వస్త్రాలుగట్టి, ఇనుప స్రువంతో శరపత్ర
మధ్యంలో నల్ల మేకను బలిఇచ్చి హోతంచేశాడు. ఆ అభిచారహోమానికి
ఆనందించి తృప్తితో అగ్ని పొగలేని మంటలతో విజయ లక్షణాలను
వెలికిచూపిస్తూ, ప్రదక్షిణంగా జ్వాల ఎగచిమ్మాడు. సర్వాభరణభూషితుడై
కుండం మధ్యనుంచి హుతవహుడు సాక్షాత్కరించి హవిస్సు గ్రహిం
చాడు. అనంతరం స్వీయ రథచాప బ్రహ్మాస్త్రాది సర్వమారణాయుధాలను
సమంత్రంగా ఆజ్యంవలె అగ్నిలో దహించాడు. రావణి చేస్తున్న
బ్రహోత్రహుతానికి సేందుగ్రహ నక్షత్రంగా బృందారక పథం సంచలించి
పోయింది. సంతృప్తుడైన జ్వలనుడు, సైంధవచాప మార్గణ రథసారథు
లను తిరిగి ప్రసాదించాడు. వెంటనే రథారూఢుడై అదృశ్యుడైనాడు.
తన సైన్యాన్ని రామున్న వైపుకు రప్పించి సమరం సాగించాడు.

## ఇంద్రజి మాయాబలంతో కపిసేనల చంపుట

ఉభయ సైన్యాలు ఉత్సాహంతో ముందుకురికినై. మొదటిపోటు
లోనే నిశాటుల వనాటులు లెక్కకుమీరి బలిగొన్నారు. తారాపథంలో
నక్షత్రాలవలె గణన కందని కపి సేన కురిసే రాళ్ళవానకు, ప్రయోగించే
వృక్ష సందోహానికి, రక్కసి గుంపు గుట్టలు గుట్టలుగా నేల కూలిపో
యింది. పోలేక, పోరలేక, నిస్తేజులై నిలిచిన అసురుల చూచి
ఇంద్రుని జయించినవీరుడు ఎలుగెత్తి "వీరులారా! వెనుకంజ వేయకండి.
నేనుండగా భయమెందుకు? మీరు నిమిత్తమాత్రంగా నిలవండి. క్రోతులు
పదేపాటు కుక్కలు కూడా పడవు. ముందుకురికి ముద్గర గదాది సాధన
సంతానంతో శత్రుశ్రేణి చక్కబెట్టండి. మనకు జయం తథ్యం" అని
హెచ్చరించాడు. సైన్యం ఒకవంక, తానొక వంక కపిసేనను వివిధా
యుధాలతో అపారంగా సంహరించాడు. లయ కాలరుద్రుడు లాగా
సైన్యాన్ని సంహరిస్తుంటే, సహించక కీశముఖ్యులు ప్రాణాలను పణంగా

పెట్టి భయంకర ఖండనం చేశాడు. రాక్షస సైన్యం రక్తసిక్తాంగాలతో
తెగిన చేతులు, కాళ్ళు, కంఠాలు, తరిగిన శిరాలతో బీభత్సంగా మారి
పోయింది. రావణి తనవారి భంగపాటుకు ప్రతికృతిగా దళపతుల కరకు
టమ్ములతో శక్తిహీనుల చేశాడు. అంగాలు భంగమైనా, ఉత్తమాంగాలు
ఛిద్రమైనా, ద్రుమచరులు ధృతిమంతులై సీతాపతి విజయంకోసం చివరి
శ్వాస వదలేదాకా పోరి గతాసులైనారు. మహాసేనానులు ఇంద్రజిత్తును
పరివేషించి చుట్టి విభివిరామంలేకుండా వృక్ష శైల శిలా ఖండాలు కురి
పించి విలవరించారు. మర్కట మూర్ధన్యుల కర్కశఘాతాలకు ప్రక్కన
ఇంద్రజిత్ గంధమాదనుణ్ణి పదునెనిమిది బాణాలతోనూ, నలుని తొమ్మిది
నారాచాలతోనూ, మైందుని సప్త మార్గణాలతోనూ, పంచ శిలీముఖాలతో
జాంబవంతుని, పదింట నీలుని, ముప్పదింట సుగ్రీవుని, అంగద ఋషభ
ద్వివిదుల పరబద్ధ తీవ్ర బాణాలతో నొంచి, కీశవాహినిని బహు కాండా
లతో నిగ్రహించాడు. ఖరకర విభవిశిఖ పరంపరలతో శత్రుసేన నిశ్శేషం
గావించాడు. శాత్రవసేనల పొంగు చల్లారగానే రథంతో అదృశ్యుడై
కురిసే శరాలు, పడిపోయే వానవలె తప్ప తన వునికి తెలియకుండా సంచ
రించాడు. హతమైన సైన్యంపోగా, అంతకు శతగుణితంగా అగచరసేన
ఆయోధన రంగంలో ప్రత్యక్షమై అరివీరుల మర్దించసాగింది. ఇంద్రజిత్
కోపంతో పరాక్రమించాడు. కన్నెత్తి చూస్తే రెండు కళ్ళల్లో బాణాలు.
తల వంచితే తలమీద పిడుగువంటి బాణాలు. డాలు ధరిస్తే కేలు
ఖండనం. పర్వతం పైకెత్తితే దాని క్రిందనే మరణం. అర్పించటానికి
నోరువిప్పితే నోటినిండ బాణాలు. అగపడనన్నవాడు అతని శరపాతానికి
ఆహుతి కావటం తప్ప చేసేది ఏమీ లేకుండా చేశాడు. ప్రభావంతు
లైన హనుమత్సుగ్రీవాంగద గంధమాదన గవయ గవాక్ష
మైంద ద్వివిద హరిలోమ నీల గోముఖ వేగదర్శి సుషేణ దధిముఖ
గజజ్యోతిర్ముఖ సూర్యానన వహ్నినయన కేసరి నల కుముద జాంబ
వంతాది అజేయ మహాపరాక్రమవంతుల మంత్ర సహిత క్రూరమార్గణ
ప్రాస గదా ముద్గర శూలాది ముఖ్యసాధన వితానంతో బాధించి, బలపు
వెరచి నిర్వ్యవసాయులనుగా చేశాడు. అంతలో తృప్తిపడక పోరాటి

ఘోరాస్త్రాలతో రామలక్ష్మణుల ముంచి ఎత్తాడు. అసురుల అరుపులు, అగచరుల ఆక్రందనాలు దిక్కులు నిండినై.

## రాముడు లక్ష్మణునకు బ్రహ్మవరం మన్నించమని చెప్పుట

పరమాద్భుత ధైర్యశ్రీ నిరతుడైన రాముడు జడివానవలె వచ్చి పడుతున్న శరసందోహాన్ని సహిస్తూ, "సోదరా! ఆగ్రహానికి ఇది అదను గాదు. అనువుగానివేళ అధికులమని పొంగటం అనర్థానికి కారణం అవుతుంది. దీనికి ప్రతిక్రియ లేకపోలేదు. కాని, నేను చేయను. రావణి ఇతరాస్త్రాలతో మనలను మార్కొనజాలక బ్రహ్మాస్త్రాన్ని ఆశ్రయించాడు. అందుచేతనే అప్రతిహత వీరులైన మనవారంతా స్మృతిహీనులై పడివున్నారు. అగణితంగా హరి సైన్యం నాశం పొందింది. బ్రహ్మదత్త వరబలంతో అదృశ్యుడై మాయాయుద్ధం చేస్తున్నాడు. స్వభువు, భగవంతుడైన అజుని అస్త్రం ఇది. దీని మహిమ అచింత్యం. పరిణామం ఏమైనా ప్రతిక్రియ ఆలోచించవద్దు. నావలెనే నీవూ సహించు. బాణాలతో భూమ్యంతరిక్షాలు కప్పాడు. ఈ యస్త్రం ప్రయోగించిన తర్వాత ఇతరాస్త్రాలేవీ పనిచేయవు. మన యత్నాభావంవల్లా, మనవాళ్ళ ప్రతిఘటన లేకపోవటంవల్లా విజయలక్ష్మితో పురానికి తిరిగిపోతాడు. ఏమైనా, మనం తాత్కాలిక ప్రమాదంలో మునిగినా విజయం మనకే లభిస్తుందని అంతరాత్మ చెపుతూంది" అని చెప్తూండగానే అవ్యాహతంగా అస్త్రవర్షం రావణి రామలక్ష్మణులపై వర్షించాడు. ఆ తీవ్ర శరవేదన భరించలేక దాశరథులు మూర్ఛపోయారు.

## విభీషణాంజనేయులు జాంబవంతుని వెదకుట

అగచరసైన్యంలో హాహాకారాలు మిన్నుముట్టినై. రవిసుతాంగద జాంబవంతాది సైన్యాధిపతులు రావణి ఏటులపోటు తరిగి చేటులో మునిగారు. ఆ బ్రహ్మాస్త్రశక్తికి ఇద్దరే ఇద్దరు తెలివితో వున్నారు. వారు విభీషణ హనుమంతులు. విభీషణుడు మర్కట సైన్యం అపారంగా మరణించటం, మహా సేనావరులు శక్తిహీనులై పడివుండటం చూచి

ఘోరంగా దుఃఖించాడు. చావక మిగిలిన సైన్యాన్నీ, కొంచెం స్మృతి
కలిగివున్నవారినీ చూచి, "కపులారా! ఇప్పుడు శోకించటం కార్యమా?
దాశరథులు అవశులై పడివున్నంతమాత్రాన కర్తవ్యం వదలుకుంటామా?
వారికి వచ్చిన ప్రాణభయం ఏమీలేదు. త్వరలో కోలుకుంటారు. శత్రువు
బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. దానికి ప్రతిగా మన రామచంద్రుడు తాను
బ్రహ్మాస్త్రం ప్రయోగించవచ్చు. ఆ పనిచేయటం ఇష్టంలేక గౌరవభావంతో
ఆ శక్తికి కట్టుబడి పడి వున్నారు. అది అమోఘాస్త్రం. దానిని శక్తి
కలిగి వుండికూడ గౌరవించినవారికి అశుభాలూ, అపాయాలురావు. మీరు
విచారం మానండి. త్వరలో అన్ని కార్యాలూ చక్కబడగలవు" అని
ఆశ్వాసిస్తూంటే, హనుమ, తానొకమాటు గౌరవించి బద్ధుడై, స్వేచ్ఛను
పొందినవాడైనా, మళ్ళీ భక్తితో సమ్మానించి, సంభావించి, విభీషణుడితో
"పూజ్యుడా! మరణించిన వారిలో ఇంకా ఎవరైనా సజీవంగా వున్నా
రేమో వాళ్ళనుచేరి ఊరడించటం మన ధర్మం. ఆవిధంగా చేద్దామా?"
అని అడిగాడు. "ఔనౌను. అది మంచి పనే. తప్పకుండా వెదకుదాం"
అంటూ, కరదీపాలు ధరించి, కటిక చీకటిలో కనుచూపుమేర హతులై
పడిన కపుల కంకాళాలలో కదనక్షేత్రం కలయ తిరుగుతూ పరిశీలించ
సాగారు. భిన్నలాంగూలురు, ఛిన్నబాహాశయులు, కృత్తాంగుళులు,
వికృత్తపదులు, ఖండితమస్తకులై, రక్తపు రొంపిలో దొరలాడుతూ
కొండల్లాగా పడివున్న కపులను చూచారు. అస్త్రాలు బాధింపగా,
శస్త్రాలు భేదింపగా, ఒడలు ఛేదింపగా, స్మారకం లేకుండా పడివున్న
గంధమాదనాంగద నీలసుగ్రీవ ద్వివిద సుషేణ వేగదర్శి, నల పనస
జ్యోతిర్ముఖ మైందగవాక్ష, ఆహుకులను ఆలోకించారు. ఆ మహావీరుల
పాటుకు హనుమ విభీషణులు గాఢంగా శోకించారు. అరవైయేడుకోట్ల
వానరులు, భీమబలులు ఐదవ దినం యుద్ధంలో అజ్ఞాసుని ప్రీతికి
పాత్రులైనారు. ఇంతవరకు జరిగిన సంగరంలో ఉభయపక్షాలల్లో సైన్య
నష్టం జరిగినా కపులింతమంది కాలధర్మం చెందలేదు. తండ్రిని తృప్తి
పరచదలచి ఇంద్రజిత్తు శత్రుశేషం లేకుండ చేయాలని సములపై ప్రయో
గించదగిన బ్రహ్మాస్త్రం అనములమీద ప్రయోగించి సముద్రంవలె అపా

రంగా వున్న కీశసైన్యాన్ని నాశనం చేశాడు. ప్రధాన వ్యక్తులందరు కనుపించారు. కాని, జాంబవంతుని జాడ తెలియలేదు.

## జాంబవంతుడు హనుమ కుశలం విభీషణుని అడుగుట

ఆ కాళరాత్రిలో, ఆ అనంత ఘోరకళేబరాలను విమర్శగాచూస్తూ పోయి పోయి, మండిమండి చల్లారిన అగ్నివలె శరీరంనిండా శరాలు గ్రుచ్చబడి, చైతన్య రహితుడై పడివున్న వృద్ధు, విధాతృనందనుడు, జాంబవంతుని ఎట్టకేలకు పోల్చుకుని సమీపించారు. వెంటనే విభీషణుడు "ఓ మహాగుణశీలా! ఆ కరకు రక్కసుని శరాలు నిన్ను ప్రాణహీనునిగా చేయలేదుగా? మా అదృష్టంమేరకు నీవైనా జీవించావా? మహావీరులతో కపిసైన్య మంతా ఇంద్రజిత్తుచే మరణించింది. జీవంతో ఎవరైనా వున్నారా? అని అన్వేషిస్తున్నాం. నీవుగాక తక్కిన వారంతా కనుపించారు. నీవేమయినావో అని వెదకుతు వచ్చాం" అని బొంగురుపోయిన కుతుకతో, నీరునిండిన నేత్రాలతో ప్రశ్నించాడు. ఆ స్వరాన్ని పోల్చుకుని, ఎంతో శ్రమమీద శక్తి తెచ్చుకుని, "రాక్షసేంద్రా! కంఠధ్వనితో నిన్ను పోల్చుకున్నాను కన్నులతో చూచికాదు. శరపీడనంవల్ల శక్తిపోవటంతో చూపు మందగించింది. నా బ్రదుకునకేమి కాని, అంజనా గర్భ శుక్తిముక్తాఫలం హనుమ జీవించి వున్నాడా? ముందు నాకీ సంగతి చెప్పు"మని అడిగాడు. "వీరవరా! అడగదగినవారు దాశరథులు కదా? వారిని వదలి మారుతి క్షేమం కోరావు. ఆయనమీద వున్న ప్రేమ రాఘవుల మీద నీకులేదా? అంగదునిపైనగాని, సుగ్రీవునిపైనకాని అసలేలేదా?" అని విభీషణుడన్నాడు. "కారణం చెపుతా విను. ఇప్పుడు కావలసింది గౌరవ మర్యాదలు కావు. కార్యసిద్ధి. అందుకు హనుమను అడిగాను. ఒక్క హనుమ జీవించివుంటే మన సైన్యం, మన పెద్దవారు మరణించినా బ్రదికివున్నట్లే. అతడే లేకపోతే అందరం బ్రదికివున్నా చచ్చినట్లే. ధృతిమంతుడూ, మతిమంతుడూ అయిన హనుమంతుడు మనస్సువలె సర్వశక్తి వ్యాపకత్వాలు కలవాడు. తండ్రి పవనునివలె వేగంకలవాడు. వైనతేయునివలె భుజవీర్య పరాక్రమాలు కలవాడు. అగ్నివలె పరిశుద్ధ తేజస్వి. కనుక ఆయన జీవించివుంటే బ్రదుకుతానవే

ఆశ నన్ను బాధించింది. అందుకని అడిగాను. నన్ను అపార్థం చేసు
కున్నా మంచిదే" అని అన్నాడు. ఆ మాటలువిన్న హనుమ ఆ వృద్ధు
అంఘ్రులపై వ్రాలి "మహాత్మా! నేనే హనుమను. జీవించే వున్నాను.
నన్ను ఇంద్రజిత్తుగాదు, పితామహుడు కూడా చంపలేడు. ఆయన తన
అస్త్రాన్ని ఒక్కసారి మాత్రం ఆదరించు. అంతే. ఆపై నిన్నేమీ చేయ
లేదు. అప్పుడు కూడా నీకు మరణంలేదు. స్మృతిపోదు. సప్త ఘటికాకాలం
నీవు బద్ధుడవలె వుంటావు అని అనుగ్రహించాడు. ఐనా నేను రెండవ
సారి ఇంద్రజిత్తు ప్రయోగించినా సమ్మానించి సంభావించాను. ఇక ఆ
అస్త్రంతో నన్ను వాడేమీ చేయలేడు. నా దృష్టిపథంలోపడి బ్రదకనూ
లేడు. నిన్ను అపార్థం ఎవరు చేసుకుంటారు? నేనా? దైత్య ప్రభువా?
నా కుశలం అడిగింది నీ స్వార్థంకోసం కాదనీ, సకల వానర సంరక్ష
ణార్థం అనీ మాకు తెలుసు. నీ కోరిక ఏమిటో చెపితే అది తప్పక నెర
వేరుస్తాను" అని సమాధానంగా అన్నాడు. తన్ను పునర్జీవితునిగా
భావించుకుని జాంబవంతుడు, తృప్తితో నిట్టూర్చాడు.

## జాంబవంతుడు హనుమను సంజీవని తెమ్మని చెప్పుట

"తండ్రీ! హరిశార్దూలా! రావయ్యా రా. ఇకవిజయం మనదే. మన
మర్కట బలాన్ని ఉద్ధరించటానికి నీవేగతి. తండ్రికి తిలోదకాలు ఇవ్వవల
సిన రావణి తన తండ్రిఇచ్చే తిలోదకాలు అందుకుంటాడు. సందేహంలేదు.
దక్షిణభాగంస్పందించి శుభం సూచిస్తూంది. శౌర్య సాహసాల్లో నీకు సాటి
ఎవ్వరులేరు. మాకు నీకంటే ప్రాణబంధువు మరెవ్వరు లేరు. నీవే ఈ హత
వానర పుంగవులను పునర్జీవితుల చేయాలె. నీ పరాక్రమలు చూపవలసిన
అవసరం ఎంతైనా ఇప్పుడు వుంది. నీ సహాయంతో వానరులూ, రామ
లక్ష్మణాదులు సంతృప్తులై సమరం సాగించి విజయం పొందాలె. నీవు
చేయవలసిన పని చెపుతా విను. నీవు సముద్రం తరించి, శ్రమ అనుకో
కుండా హిమశైలాన్ని చేరాలె. తర్వాత స్వర్ణమయమైన ఋషభకైలాస
మహాధరాలను కనుగొనాలె. ఆ రెండు గిరులమధ్య ప్రభావంతమై, సర్వౌ
షధులచేత జానుమీరే ఓషధగిరి వుంది. దానిలో స్వప్రభతో పర్వతాన్ని

వెలిగించే ఓషధులు నాల్గువున్నై. వాటి ప్రకాశమానం ఆధారంగా మృత సంజీవని, విశల్యకరణి, సావర్ణ్యకరణి, సంధానకరణి అనే పేర్లుగల నాలుగు పరమౌషధుల గుర్తించాలె. అనంతరం సభక్తికంగా అంజలించి వాటిని విగ్రహించి కొని రావాలె. వాటి శక్తితో ప్లవగులకు, ప్లవగ శ్రేష్ఠులకు, దాశరథులకు ప్రాణభిక్ష పెట్టాలె. ఆపదుద్ధారకుడనీ, అవక్ర విక్రమ పరాక్రమశాలి అనీ, ప్రాణప్రదాత అనీ, ఆకల్పాంతం నీ నామానికి అలంకారప్రాయంగా విశేషణాలై వెలయాలె. పో తండ్రీ! వెంటనే పో. మనోజవంతో మరలివచ్చి మమ్మల్ని వుద్ధరించు. "మనోజవం, మారుత తుల్యవేగం, జితేన్ద్రియం, బుద్ధిమతాం, వరిష్ఠం, వాతాత్మజం, వానరయూధ ముఖ్యం, శ్రీరామదూతం, శిరసానమామి. శ్రీరామదూతం శిరసానమామి. శ్రీరామదూతం శిరసానమామి" అని జాంబవంతుడు దగ్గుత్తికతో స్తవించాడు.

## హనుమంతుడు సంజీవని తెచ్చుటకై పోవుట

వృద్ధుడు జాంబవంతుడు హనుమంతునికి కర్తవ్యం బోధించి, స్వశక్తి ప్రేరేపణార్థం స్తుతించాడు. ఆ స్తుతి వాక్యాలు విని హనుమ "పూజ్యుడా! భల్లూకపతీ! నీ ఆజ్ఞ ఔదల ధరిస్తున్నాను. ఈ పని చేయగలవారు మనలో ఎందరో వున్నారు. విధి వక్రించటంవల్ల ఇప్పుడు తేజోరహితులై పడివున్నారు. ఇది నాకు దక్కటం నా పూర్వపుణ్య విశేషంకాని, నాశక్తి కారణంకాదు. స్వామికార్యార్థం మహావీరులంతా ప్రాణాలనే త్యాగం చేసినప్పుడు నేనదికూడ చేయలేకపోతినే అని దుఃఖించాను. అవశేషంగా మిగిలిన ఈ నా శరీరం ఈ కార్యమైనా సాధించి చారితార్థ్యం సంగ్రహిస్తుంది. ఇందుకు నన్నింత శ్లాఘించటం ఎందుకు? తెలియలేదుకాని తెలిస్తే ఈసరికే ఆ పని చేసేవాణ్ణి. నా విధికదా?" అని వినయంతో విన్నవించాడు. తండ్రినీ, సీతారాములను ధ్యానించాడు. పిటిచే సముద్రంపూర్ణత్వం పొందినట్లు, దేహాన్ని పెంచాడు. గిరిశిఖరం ఆరోహించి తొట్రుపాటు కలిగించాడు కొండపై మరో కొండ నిల్చిందా? అన్నట్లుగోచరించే రూపంతో కుంభించేసరికి పర్వతం పాదువరకు కంపించిపోయింది. శైలశృంగాలతో, శైలస్థభూరుహాలు నేలకడినై. ఆ పర్వతంపైన వున్న

ప్లవగులు నిలువలేక చతికిలపడ్డారు. ఘూర్ణితద్వారమై, కుంఠితహర్మ్యమై, భగ్నగోపురమై పట్టణం సాధ్వసాకులమైంది. ఆ నడుమేయి, హాటక మందర నగోపమమైనదీ, ఆకుల ప్రస్రవణమైనదీ, సురాన్వితమైనదీ, బహువృక్ష లతాకీర్ణమైనదీ, నానావికసిత పుష్ప సంతానమైనదీ, అనేక మృగ కందర మునిజనాంచితమైనదీ అయిన మలయగిరిని పాదఘట్టనంతో బదలుపరచి, బడబాసదృశముఖుడై, గంభీరంగా గర్జించాడు. ఆ ఘోషకు ఘాత సమూహం భీతి పొందింది. అసురులు కదల మెదలలేక కడు భయంతో కంపనరహితులైనారు. భీమ పరాక్రముడైన మహాకపి, మళ్ళీ జనక సీతా దాశరథుల తలంచి, జపసత్త్వాల నర్థించి, రామ కార్య కర్మఠుడై, ముఖం విచ్చి వాసుకి సన్నిభమైన వాలాన్ని పైకెత్తి వీపున తానించి వంచి, శ్రవణద్వయాన్ని కుంచి, చండ వేగంతో కుప్పించి ఆకాశానికి లంఘించాడు. ఆ లంఘన జవానికి క్షుధరస్థ శిలలూ, వృక్షషండాలూ వెంటవారి వేగం తగ్గగానే అంబుధిలో పడిపోయినై. గరుడ వేగుడై, కాలసర్పసంకాశ హస్త ద్వయం చాచి, దిక్కులు కంపించగా, విష్ణుకర విముక్త చక్రంలాగా పోతూ, సంఘూర్ణిత తరంగ సందోహం, భ్రామిత సర్వసత్త్వం అయిన అంబుధి వీక్షిస్తూ, పోయి పోయి, మార్గ మధ్యంలో నదీ నద మహీజ బృంద మనోహర పట్టణాలను తిలకిస్తూ విహారనగాన్ని చేరుకున్నాడు. జాంబవంతుని గుర్తులు స్మరించాడు. ఆ గుర్తుల ఆధారంగా, బహుకందరనిర్ఝరమై, బహుళ ప్రస్రవణయుక్తమై, నానామహీజ గహ్వరమై, మహిత సితాభ్రాభ శృంగమండలమైన హిమ గిరి దర్శించి, ప్రసిద్ధ శృంగతలం, పుణ్యాశ్రమ పూర్ణం, మునిజన సంయుతం, అయిన ప్రదేశాలు పరమానందంతో పరికించి, బ్రహ్మకోశం, రజతాద్రీ, హరిహయాలయం, ఉగ్రబాణ ప్రమోక్షం, హయముఖ సందీప్త బ్రహ్మశిరం, యమకింకర వజ్రాలయం, అబ్జహిత తేజస్సంబంధి కుబేర నిలయం, అర్కబంధనతలం, బ్రహ్మాసనం, వసుపతివాటీ, కైలాస సమీపస్థ హిమవచ్ఛిలా, ఋషభధరం, సర్వౌషధి సందీప్తం, సకలౌషధి నగం, సూర్యసన్నిభం అయిన హిమగిరిని విలోకించి సంభ్రమాశ్చర్యాలు రామదూత ఏక కాలంలో పొందాడు.

# హనుమ సంజీవని తెచ్చుట

అనంతరం ఓషధుల అన్వేషణ నిమిత్తం వేయి యోజనాలు తిరిగాడు. నిజ సంగ్రహణంకోసం ఎవడో వచ్చాడని ఆలోచించి ఓషధులు ప్రకాశాలను ఉపసంహరించుకున్నై. ఎంత వెదకినా వాటి వునికి తెలియటంలేదు. కాలం గడుస్తూంది. ఆంజనేయునికి ఆగ్రహం అధికమవుతూంది. సాత్త్వికం వ్యర్థమైంది. తన రాక నిరర్థకం కాబోతున్నది. ప్రమాదం పరిధి హెచ్చుతూంది. నేత్రాలు తామ్ర వర్ణం సంతరించుకున్నై. పర్వతాన్ని ఉద్దేశించి "ఏమయ్యా పర్వతరాజా! అరుదెంచినవాడు అంజనాపుత్రుడనీ, కార్యం రామసంబంధమైందనీ, కరుణించి కార్యసిద్ధి కలిగించటం క్షేమం, అవసరం అనీ ఆలోచనలోకే రాలేదా? ఏ కారణంచేత ఓషధిప్రకాశం ఉపసంహరించావు? స్వరలోక హితశరథి అయిన దాశరథి నీకు అల్పుడుగా కనపడ్డాడా? చిన్నవాడు కేవలం క్రోతి అనుకున్నావా? దుష్టశిక్షణకు, శిష్టరక్షణకు మునులచేత, మహర్షులచేత, యోగులచేత, సిద్ధులచేత ప్రార్థితుడైన రాముడు నీకు పూజనీయుడు కాలేదా? ఇదే నీ మనోనిశ్చయమైతే గ్రుడ్డివాడు లోకం శూన్యమని భావించిన చందమే అవుతుంది. గుండ్రాయి దాచుకుంటే పెండ్లి ఆగిపోతుందా? అవమానంతో, ఆగ్రహంతో ఉడికిపోతున్న నాముష్టిఘాతంతో భుజ ప్రపీడనంతో ఏమవుతావో ఇంతైనా ఆలోచించావా? అయినా టదువితో నాకు పనేముంది? ఈతని అనుగ్రహం ఎవరికి కావాలె? ఏంచేస్తాడో నేనూ చూస్తానంటూ, సకాంచనం, సనాగం, సధాతుసహస్రం, సఘనతరశృంగం, సరవితేజం, అయిన శైలాన్ని పాతుతో పెల్లగించి జందార్ధ్వంమీదికి ఉద్గమించాడు. వామభారరహితుడై, వామపాణిని పర్వతం, దక్షిణపాణిని గదభుజస్పర్శిగా ధరించి లంకాముఖుడై సంకల్పమాత్రంగా సమీపిస్తుంటే ఖేచరులంతా 'అహో' అని స్తుతులు చేస్తూ అమందానందభరితులైనారు. భాస్కర మార్గంలో, భాస్కర శిష్యుడు, భాస్కర సంకాశమైన పర్వతాన్ని ధరించి, భాస్కర సమీపవర్తిగా ప్రయాణిస్తుంటే రెండో భాస్కరుడువలె తీవ్రభాస్కరుడై వెలిగాడు. పర్వతధారి అయిన పావని సహస్రధారకల చక్రం ధరించిన విష్ణువులాగా

రాక్షసులు భీతిల్లగా రాజిల్లాడు. అతని గమనానికి వైనతేయ వాయు దేవులు ఆనందం పొందారు.

## సంజీవనిచే వానరాదులు పునర్జీవితులగుట

విధిచోదిత కర్మరతుడై అహస్కరుడు కరకరమంటూ ఉదయగిరి చేరవచ్చినట్లు హనుమ ఓషధీసహిత హిమవత్పర్వతాన్ని పాణిధరించి సమరక్షేత్రం సమీపిస్తూంటే ఆ ఓషధుల కాంతి కోటి సూర్యరుచులతో గాఢతిమిరావృత కాళరాత్రిని పట్టపగలుగా మార్చుతూంది. పవమానుడు ఆ పర్వతస్థ పుష్పవితాన సౌరభంతో ఓషధుల సువాసనలుగొని మృతప్రాయంగా వున్న వానర సస్యక్షేత్రంపై విహరించాడు. ఆ వాయుసంస్పర్శతో, ఆఘ్రాణంతో నిర్జీవ వానరసైన్యం సజీవమైంది. గాఢ సుషుప్తి పొందిన జీవి హాయిగా మేల్కొన్నట్లు మేల్కొన్నకపులు ప్రఫుల్ల వదనారవిందులై, కాంతితో వెలుగుతున్న కదలిపైపు చూచారు. ఆ మహాకపిరాక అనిదంపూర్వంగా, అద్భుతంగా అగచరులకు కానుపించింది. పలుకులు పలుకలేని బ్రహ్మానంద పారవశ్యంతో కృతజ్ఞతా పురస్కృత కోలాహలం చేశారు. ఆ ధ్వానంవిన్న హనుమ తన యత్నం ఫలించినందుకు సంతోషంతో పొంగిపోయి ప్రతిధ్వానం చేశాడు. హనుమచేసిన గర్జకు అసురులు అత్యంత భీతులై ఆక్రోశించారు. క్షణమాత్రంలో రణక్షేత్ర మధ్యంలో పర్వతందించి పావమాని పెద్దలకు అభివాదం చేసి, విభీషణుని ఆలింగనం చేసుకున్నాడు. అంతలో మూలికలతెచ్చి సోదరులకు ఘ్రాణతర్పణం కావించారు. ఆ మూలికా ప్రభావంవల్ల రామలక్ష్మణులు తేరుకున్నారు. శరీరంపై శరఘాతంచేత ఏర్పడిన వ్రణాలు మానటమేం గొప్ప? మచ్చలు కూడా మాయమైనై. సహజ సౌందర్య సంపన్నులైన రాఘవులు సహస్రాక్షునకే అసూయ కలిగేట్లు ప్రకాశించారు. సహజ శక్తిసంపన్నులైన దాశరథులు దిగ్దంతులకే కోపకారణమయ్యారు. ఏ తన్మూలికా ప్రభావంచేత వనాటులు సప్రాణులైనారు; కాని, నిశాటులు మాత్రం జీవితులు కాలేదు. ఆక్షేపణాశ్చర్యాలకు తావు లేదు. ఏమంటే, ఓషధులకు పక్షపాతం లేదు. రావణుని పాపకర్మఫలం బుద్ధి జాడ్యం కల్పించి, స్వీయ గౌరవార్థం చచ్చినవాళ్ళను సాగరంలో

పారేయమనే లంకేశుని ఆజ్ఞగా రూపుదిద్దుకుంది. స్వయంకృతాపరాధానికి ఎవరు మాత్రం ఏం చేస్తారు? పని ముగిసింది. పర్వత ప్రయోజనం తీరింది. హనుమ సత్వరుడై అచలాన్ని కొనిపోయి యథాస్థానంలో వుంచి రామదర్శనార్థం తిరిగి ప్రయాణించాడు.

## సుగ్రీవుడు లంక కాల్చమని కపులకు చెప్పుట

భల్లూకపతి సందేశం, హనుమ అద్భుత కార్యసాధనం రావణి కృత ఘోరపీడా నివారణం కావించినై. మళ్ళీ మర్కట సైన్యం యుద్ధసన్నద్ధమైంది. పరిపంథివేత పొందిన అవమానం భరించలేని సుగ్రీవుడు పట్టరాని దురాగ్రహంతో ప్లవగవీరుల అవలోకించి "రామకార్య ధురంధరులారా! కపి వీరులారా! పావని అపారకరుణా ప్రవాహం ప్రవహించి మనం పునర్జీవితులమైనాం. ఇప్పుడు చేయవలసిన గొప్ప కార్యం ఒకటి వుంది. మన శత్రువు రావణుడు, తమ్ములు చచ్చినా, కొడుకులు చచ్చినా, సేనాపతి మంత్రులు చచ్చినా, సైన్యం చచ్చినా, శోకిస్తూ యుద్ధానికి రాకుండా గృహంలోనే వున్నాడు. ఎలాగైనా వాడిని సమరంలోకి ఈడ్వాలి. అందుకే నేనొక ఆలోచన చేశాను. మీలో, ధృఢశక్తిమంతులు లాఘవ వేగాలుకలవారూ, లేక ఉత్సాహంకలవారంతా కొరవులు కొనిపోయి లంకను తగులపెట్టండి. మీ ఆగడాన్ని నిరోధించటానికి లంకలో ఇంకా ఎవ్వరులేరు. ఉన్నవారంతా యుద్ధంలో మనచేతిలో మరణించారు. కనుక వాడే వస్తాడు. రాగానే మేమంతా అక్కడికి వస్తాం. రామచంద్రుడు రావణుని చంపుతాడు. రాకుండా వుంటే లంకతోపాటు వాడూ మాడి బూడిద అయిపోతాడు. రెండూ మనకు మంచివే. మీరంతా మీ మీ శౌర్యాన్ని ప్రదర్శించి ఇంద్రజివలె శత్రు నిశ్శేషం సలపండి. మీకందరకూ పావని రక్షగా వస్తాడు. ఆయన ఆదేశానుసారం వర్తించండి" అని ఆదేశం ఇచ్చాడు. ఆదేశం అందుకున్న అగచారులు ఉచ్చైర్నాదంతో "జయరవిపుత్రా! జయవీరహనుమా! జయరామచంద్రా" అని కోలాహలం చేస్తూ, కొరవులువాల్చి, రౌద్రనిశాముఖంలో దుష్కరంధులై పగబట్టిన పన్నగాలవలె ఊరుస్తూ, లంకలో నిరాతంకంగా చొచ్చి కావలి

వాళ్ళను కాలని పురిపంపి నగరం ఆక్రమించుకున్నారు. అప్పటికి నిశ్శబ్దంగా వున్న లంకాపురి క్రోతుల గోలతో, కేకలతో నిండిపోయింది.

## లంకాపురీ పునర్దహనం

ఆశరుల అవరోధం లేదు. పట్టణం నిద్రాసమాలింగితం. జీవకోటి చైతన్యరహితం. పంక్తిముఖుడు పరివేదనాదోదూయమాన మానసుడు. రావణి విజయ గర్వోన్మత్త విచిత్ర స్వప్నావస్థాముద్రితుడు. కాళరాత్రి. మూడవయామం. ప్రవేశకులు వానరులు. కార్యం లంకాదహనం. చెప్ప వలసిందేముంది? చేసేపని నల్లేరుపై బండినడకలాగా సాగింది. ప్రాసాద గేహాలు, గోపురాట్టాల ప్రతోళికలు, కూటాలు, అగ్ని సంతర్పణం కావించబడినై. పర్వతసదృశాలైన ప్రాసాదాలు డబడబ ధ్వనులతో కూలి పడుతున్నై. గంధపు చెక్కలు, హరిచందన బృందాలు మండుతుంటే ఘుమ్మని కమ్మని పరిమళాలు ప్రసారితమైనై. ముత్యాలు, వజ్రాది మణులు, ప్రవాళాలు, శంఖాలు కాలి భస్మరాసులైనై. కౌశేయరాసులు, క్షౌమసంతానాలు, మడతలతోనే మాయమైనై. కంబళాలు, కాంచన కుంభాలు, లాజభాండాలు రూపుమాసినై. ఏనుగుల, రథాల హయాల అలంకారాలన్నీ ఆహుతి అయినై. కవచాలు, గజవాజులపై కప్పే చర్మ చేలాలు, ఖడ్గాలు, ధనుస్సులు, మౌర్వులు, ఆయుధాలు, శూలాలు, శక్తులు చూర్ణమైనై. వాలజరోమ జవ్యాఘ్ర చర్మజ బహుకాంత జవికార పరికరాలు పాడై పోయినై. ముత్యాలు కూర్చిన చిత్రవిచిత్ర గవాక్షాలు, ద్వారబంధాలు, మేడలు, అస్త్రమందిరాలు, అదృశ్యమైనై. వేలకు మించిన రాక్షస సౌధాలు భస్మీపటలమైనై. దామహారాంబరధారులు, మధుపాన చలన్నేత్రులు, జాతక్రోధులు, భర్తృసమాలింగిత మానినీమణులు, నిద్రార్తులు, త్రాగేవారు, తినేవారు, భీతిల్లేవారు, పారిపోయేవారు, ఆయుధ హస్తులు, జూదగాళ్ళు, రేద్రిమ్మరులు అంతా అగ్నిహోత్రుని ఆగ్రహానికి పాత్రులైనారు. భార్యలు కొంగు పట్టుకుంటే పరికించకుండా గుడ్డజారినా పారిపోయేవారు, పొగలుక్రమ్మి దిక్కుతోచనివారు, చంకల్లోనున్న బిడ్డలతో జలదరించేవారు, పడుగెత్తుతూ పడేవారు, తమవారి రక్షణకుపోయి తాము కాలేవారు, తొలగిపోయేవారిని పిలిచేవారు, "కొడుకా! కోడలా!

బిడ్డా! అత్తా! మామా! తండ్రీ!" అంటూ ఆక్రోశించేవారు, స్వర్ణ విరచిత పూర్ణార్ధచంద్ర రూపాలుగల చంద్రశాలలు, మణిగవాక్షాలు, రత్నవిద్రుమాంచితాలు, బహువిధ పక్షిసంతాన మందిరాలు ప్రజ్వల ద్వహ్నికీలల్లో భస్మసాత్కృతాలైనై. అగ్ని దగ్ధాలవుతున్న హర్మ్యాలు వార్షుక చంచలాసహితజలధరాల్లాగావున్నై. కాలి కూలిపడే శాలలు కులిశాహతి త్రెళ్ళిపడే శైలశృంగాలవలె తోచినై. ఆ పడుతున్న చప్పుళ్ళు శ్రవణ విదారణం చేస్తున్నై. మిద్దెలమీదా, మేడలమీదా, ఒడళ్ళుమరచి నిద్రించే మగువలు మంటలసోకి విగతభూషలై "అయ్యో! అయ్యో!" అంటూ హాహాకారాలు చేస్తున్నారు. జ్వలనజ్వాలామాలికలతో దగ్ధమవుతున్న సౌధాలు ఓషధి ప్రయుక్త మిహికాచల శిఖరాల్లాగా దూరదర్శులకు గోచరించుతున్నై. శిఖరాగ్రాలపై వ్యాపించిన అగ్నికీలాపంక్తులునిండా పూచిన మోదుగుచెట్లవలె చూచేవాళ్ళకు భ్రాంతి కల్పిస్తున్నై. కట్లు త్రెంచుకున్న కరులు, హయాలు సంచరించే లంక విలయవేలా సముద్భ్రాంత వివిధ నక్ర తిమింగిల ఫణి కమఠాది జలజంతుప్రయుక్త జలనిధివలె తోచింది. బెదరి పారిపోయే గుర్రాన్ని చూచి ఒక్కొక్కచోట ఏనుగు తప్పుకుంటూంది. ఏనుగు పరిగెత్తి వస్తుంటే మరోచోట గుర్రం తప్పుకుంటుంది. లంకానగరం దహించే అగ్నిహోత్రుని దుస్సహ జ్వాలలు జలంతో ప్రతిఫలించి సముద్రం రక్తసముద్రంగా భావుకుని ఊహకు ఉపమానమైంది. శాఖామృగ నిక్షిప్తజ్వలనాభీలమైన లంకానగరం ప్రళయ సమయదహ్యమానధాత్రిలాగా చూపరులకు చూపట్టింది. పొగకన్నులు కప్పి, తప్పుకోలేక తగులబడుతున్న తరుణుల ఆక్రందనాలు దశయోజనాలు వినిపించినై. మంటల గృహాల్లోనుంచి బయటికి వచ్చే రాక్షసులతో వనాటులు పెనగుతుంటే, ఉభయులు చేసే ఆర్భటులు దిక్కులు నిండినై. నిరామయులైన రామలక్ష్మణులు సంభ్రాంత రహితులై చాపాలను ధరించి మౌర్వీటంకారం చేశారు. ఆ ఘోరనినాదానికి నిశాచరులు కలగుండు పడ్డారు. వేదమయమైన మౌర్విని శంకరుడుమీటితే విశ్వం కంపించినట్లు శ్రీరాముడు గుణం సారించిన శబ్దం నిశాచరవనేచరకృత ఘోషణాన్ని మ్రింగింది. రామ రాక్షస వానర కల్పితారావం దిగ్దిగంతాలను నిండి ఘూర్ణిల్ల చేసింది. ఆధ్వానానికి రణక్షేత్ర సహిత

లంకానగరం కంపించటంతో ఉన్నత గోపురాట్టహర్మ్యాదులు అగ్ని ధ్వంసశేషాలు అవనిపాలై పోయినై. నగర రక్షణార్థం కాపున్న రాక్షస వీరులు సంకుల సమరానికి తారసిల్లారు. ఆ వీరవరుల ఆర్భటులతో లంకంతా నిండింది. సమరక్షేత్రంలోవున్న శాఖాచరేంద్రుడు కోపంతో రిపూనవచ్చి కపులముందు వ్రాలాడు. ఉభయసేనలు యుద్ధానికి తలపడటంతో నిశాసమయం రౌద్రమైంది. సుగ్రీవుడు ఆసన్నద్వారాన్ని చేరి "కపులారా! ఇది రావణుని నివాసం. దీన్ని ముట్టడించి, దహించండి. సర్వంపోయినా వీడు ప్రాణాశతో సోమరిగా గృహంలో దాగివున్నాడు. నేనిప్పుడే రాజశాసన ధిక్కారం చేసిన వీణ్ణి శిక్షిస్తాను" అని ఆజ్ఞ పెట్టగానే సన్నిహిత కపి సైన్యం కొరవులు ధరించి నిశాచరనాథుని నివాసాన్ని నిర్బంధించారు. అది చూచి ఆగ్రహోదగ్ర రూపుడై, రూపు కైకొన్న రుద్ర కోపంలాగా మంటలు క్రక్కుతూ లేచి, తన సన్నిధానంలో వున్న కుంభకర్ణ పుత్రుల కుంభనికుంభుల, యూపాక్ష శోణితాక్ష కంపన ప్రజంఘుల చటుల సేనా సమేతంగా శత్రువులపైకి పంపాడు.

## కుంభనికుంభులు యుద్ధానికి వచ్చుట

పెద్దతండ్రి ఆజ్ఞానువర్తులైన కౌంభకర్ణులు తీవ్రవేగులై, సహ సైన్యులై, శత్రు వరూథినీ భయంకరులై, అలంకృతులై, సముజ్జ్వల చిత్తులై సమరభూమి ప్రవేశిస్తుంటే, ఆయుధకాంతులు, అలంకారరోచులు ఆ నిశాసమయంలో ఆకాశానికి వింతద్యుతులు కూర్చినై. వానరార్పిత హవ్య వాహన జ్వాలలతో రక్షో వానరాలంకృత భూషణ ప్రభలతో ఉభయ సైన్యాలు విస్పష్టంగా గోచరించినై. సౌధ శిఖరాలు దావ పావకునిచే దగ్ధమవుతుంటే ఆ కాంతులు సముద్రంలో ప్రతిఫలించి చల దూర్మికా కాండాలకు వింత శోభ ప్రసాదించినై. అశ్వమాతంగ శతాంగ సంకలితం, పదాతి నికురుంబ సంబాధితం, జ్వలత్తోమర ప్రాసకార్ముక గదా శూల కృపాణ సంశోభితం, జ్వలితవర్మం, కనక వికార భూషా జాలాంచితాంగం, కంకణ కింకిణీ శత సహస్ర సంకులం, శరపూర్ణచాపం, వ్యాఘూర్ణిత సాంద్రశస్త్రం, గంధమాల్య మధుమోదిత మారుతం, మేఘ ఘోషం, శూరవీరనికర సమ్మర్దం, కాలకింకర సన్నిభం అయిన అసుర

వాహిని, వర్షాకాల సముజ్జృంభిత గమన వేగ సంఘట్టితోభయ తట ప్రవాహంలాగా రావటం చూచి మర్కట మహా సైన్య సాగరం సింహనాదం చేసింది. జ్వలనుణ్ణి చేరబోయే శలభాలవలె శాఖాచరులు తరులతో, గిరులతో తలపడి రక్షస్సైన్యాన్ని భారంగా బాధిస్తుంటే, నిశాటులు వనాటుల కృపాణ ధారలతో తలలు ఛేదించారు. ఆత్మ సైన్యం హతమై పోతుంటే నగచరులు నిశాచరులపై దూకి చెట్లు కదల్చి ఫలాలు రాల్చినట్లు, పండ్లురాల మూతులపై గ్రుద్ది, కపోల కర్ణాంతం చపేటాలు తల తిరిగేలాగా ప్రహరించి, ముష్టి ఘాతాలతో తలలు బ్రద్దలుకొట్టి, రాళ్ళతో తనువులు ముద్ద ముద్దగా చేసి చంపి పగదీర్చుకుంటున్నారు. భటులు సంకుల సమరం చేస్తుంటే, పైవారు పరస్పరం దూషించుకుంటూ పోరి ప్రాణాలు హరిస్తున్నారు కొట్టబోయేవాణ్ణి కొట్టి పోయేవాడొకడైతే, త్రోసేవాణ్ణి పడద్రోసిపోయేవాడొకడు. ఒకడు చంపబోతుంటే ఇంకొకడు వాడినే చంపాడు. కొరికేవాణ్ణి కొరుకుతూ, తిట్టేవాణ్ణి తిట్టుతూ, గ్రుద్దేవాణ్ణి గ్రుద్దుతూ, పదాతులు చిత్రవిచిత్ర యుద్ధం కొంతకాలం చేశారు. "బలహీనులపై పౌరుషం చూపటం గాదు. నాతో పోరి బ్రదికి పోరా" అంటూ కలియబడి, కాళ్ళతో, చేతులతో తన్నుకుంటూ, కొట్టుకుంటూ కొందరు పోరాడారు. పై పంచజారగా, సాధనాలు పడిపోగా, కవచాలు బ్రద్దలుకాగా, ఒడళ్ళుమరచి అసురయూథం, శూలాలతో, గదలతో కత్తులతో కపివీరుల కసిమసంగారు. కాగా, కీశసైన్యంకూడా ఆశర సైన్యాన్ని అణమటింప చేసింది. అస్త్రశస్త్రాలతో పదులు వందలుగా ప్లవగుల రాక్షసులు చంపితే, వందలు, వేలుగా అసురుల వెన్నాడి హతమార్చారు అగచరులు. దృశ్యం బీభత్సమైంది.

## అంగదుడు కంపనుని చంపుట

కంపనుడు వీరజన క్షయం తన పక్షంలో జరగటం చూచికోపంతో రణంలో దూకి కపులను మట్టుబెట్టసాగాడు. కపుల నష్టంచూచి అంగదుడు అసురునితో తలపడ్డాడు. "రా. వచ్చావా? చావుసుకోరి తెచ్చావా?" అంటూ గదతో వాలిపుత్రుని బలంగా కొట్టాడు. దెబ్బ తగిలినా, బాధ పెట్టినా భరించి తారేయుడు ఆ గదలాగి దానితోనే అసురుని మోదాడు.

వాడు సొమ్మసిల్లి, తెలివితెచ్చుకుని చేతితో చెంపపై కొట్టాడు. పక్క వాని చేతిలో వున్న పర్వతం గ్రహించి కంపనుని శిరంపై విసిరాడు. దాన్ని అపుగోలేక దానవుడు ఆక్రోశిస్తూ అసువులు వదిలాడు. కంపనుడు కూలిపోగానే శోణితాక్షుడు శరవర్షం కురుస్తూ వాలేయునిపై తారసిల్లాడు. అంగదుడు ఆగ్రహించి పట్టుకొనకుండా రథంపైకి లంఘించి, చాపాన్ని, రథాన్ని, గుర్రాలను ధ్వంసం చేశాడు. ఒకచేత ఖేటం, ఒకచేత ఖడ్గం ధరించి ఆకాశానికి ఎగిరాడు. వాడి వెంటనే అంగదుడు ఉద్గమించి హస్తంలో వున్న కత్తి బలాత్కారంగా లాగి అంసఫలకాన్ని కసుక్కున నరికాడు. ఆ ఖడ్గంతోనే అసురసేనపై పడి ఊచకోత కోశాడు. దెబ్బ తిన్న దెబ్బలివరె శోణితాక్షుడు గదగొని దూకాడు. వాడితో యూపాక్షుడు తోడైనాడు. ఇద్దరు రాక్షసులమధ్య కిష్కింధా యువరాజు విశాఖ నడిమి పూర్ణచంద్రునిలాగా పొలుపు మీరాడు. ఇంతలో ప్రజంఘుడు మరోవైపు తాకాడు. ఒక్కడిగా పోరుతున్న అంగదునిపై ముగ్గురు మోహరించుకోవటం చూచి మైందద్వివిద సోదరులు సాయంగా సమరంలో చొరబడి వచ్చిన ఇద్దరినీ చుట్టుముట్టారు. ఉభయులకు పోరు ఘోరంగా సాగింది. వానర వీరులు కొండలు చెట్లు తెచ్చి కుమ్మరిస్తుంటే రథికులైన రాక్షసులు బాణాలతో వాటిని మట్టుపెట్టారు. గదతోనూ ఖడ్గంతోనూ ప్రజంఘుడు వాలి సుతునిమీదికి దూకాడు. దూకినదూకుతో గదతో నెత్తిపై బాదాడు. అనాయాసంగా ఆ ప్రహారాన్ని అంగదుడు తప్పుకున్నాడు. తన చేతిలో వున్న ఖడ్గం విసరి మణికట్టు తెగనరికాడు. దానితో గద నేలపడి పొరలాడింది.

## అంగదుడు ప్రజంఘుని హతమార్చుట

గద పడిపోయినా, మణికట్టు తెగినా ప్రజంఘుడు వెనుదగ్గలేదు. ఖడ్గం వామహస్తంలో పట్టి అంగదుని మీదికి దాటి బలంగా ప్రహరించాడు. చతురత కన్న శాఖాచర యువక ప్రభువు తప్పుకున్నా తగిలి గాయం కల్పించింది. ఆ క్షణం అశ్వకర్ణ నామంగల అవనీజాతంతో తిరిగి శత్రువును ప్రహరించాడు. పాపం! దైవోపహతుడైన దైత్యుని చేతి కర

వాలం జారి దూరంగా పడిపోయింది. పిడికిలి బిగించి ముఖంపై గుద్దాడు. ఆ దెబ్బకు అంగదుడు అల్లాడిపోయాడు. పడిన కత్తిని క్షిప్రకాలంలో గ్రహించి తారేయుడు కంఠం ఛేదించాడు. తల పది బారల దూరంలో పడింది. మొండెం నేల అదిరేలాగా భూపాతమైంది. పినతండ్రి చావటం చూచిన యూపాక్షుడు కన్నీరుగారగా, చేతిలో శరచాపాది సాధనాలు లేకపోయినా కరవాలం ఆధారం చేసుకుని కపి నాయకుని కలిశాడు. ప్రజంఘుడు అంగదునిపై పడగానే ద్వివిదుడు దూకి రాక్షసుణ్ణి రొమ్ము పగిలేట్లు పెద్దగా గుద్దాడు. సొమ్మసిల్లిన వాడిని రెండు బాహువుల్లో బంధించాడు. శత్రువు చేతిలో చిక్కి చావనున్న సోదరుణ్ణి రక్షించటానికి శోణితాక్షుడు ద్వివిదుణ్ణి తలపై గదతో పెట్టుపెట్టాడు. దెబ్బతిని పడి బంతివలె లేచి, వాడి చేతిలో గద లాగి రూక్షశక్తి సంపన్నుడు ద్వివిదుడు రెండు ముండేలుగా ఫెళ్ళున విరిచి చేతికొలది చెంపపై కొట్టాడు. మహా బలవంతుడు మైందుడు యూపాక్షుణ్ణి ఇంతలో గుండెపై తన్ని కూలద్రోశాడు. ఇటు రాక్షసులూ, అటు వానరులూ మళ్ళీ తెప్పరిల్లి ఘోరంగా పోరు సాగించారు. ఆ దొమ్మి కయ్యంలో ద్వివిదుడు శోణితాక్షుణ్ణి గుండెల్లో గుద్ది పడద్రోసి రొమ్మును కాలితో త్రొక్కి వాడిగోళ్ళతో వాడిముఖాన్ని చీల్చి, కుత్తుకను నలిపి పంచత్వం ప్రసాదించాడు. అదే సమయంలో అంగదుడు తన వారితో కలిసి దనుజుల తాకాడు. మైందుడు యూపాక్షుణ్ణి మృత్యుకబళంగా చేశాడు.

## కుంభుడు ఘోరంగా యుద్ధం చేయుట

హతవీరమైన సైన్యం వెలవెలబోయి కుంభుని ఆశ్రయించింది. కుంభుడు వాళ్ళను ఓదార్చి కులిశాన్ని తలపించే చాపాన్ని, విషజ్వాలలు గ్రక్కే పాములవంటి శరాలనూ ధరించి సరోవరంలో దిగిన మాతంగం లాగా కపిసేనను కలచివేయసాగాడు. ఆ వేగాటోపంలో ద్వివిదుణ్ణి ఆశ్రవణాకృష్ట శరజాలం పరపి మర్మభేదనం చేశాడు. ద్వివిదుడు విహ్వలించి కొండలాగా పడ్డాడు. తమ్ముని పాటుకు తాళలేక పెమ్మ పెరిగిన కోపంతో పెను శిల తెచ్చి కుంభుని పైకి విసరి వేశాడు. అయిన బాణాలతో అచలాన్ని బద్దలుకొట్టి కాల సర్పాల

వంటి వాడిబాణాలు తనువు తూలగా నాటాడు. ఆ ప్రహరణానికి నిలవలేక మైందుడు మహిపై మహీధరంవలె పడ్డాడు. మేనమామలు రక్కసునిచే స్రుక్కంగానే తెంపుచేసి ఎదిరించి నిల్చాడు. ఆటోపంతో వస్తున్న అంగదుణ్ణి బాణపంచకంతో నిరోధించి, శరత్రయంతో స్రుక్కించాడు. అయినా అంగదుడు ఆగక వానకాలంలో ముసురువలె శిలావర్షం కురిసాడు. ఆ శిలాపాతాన్ని శరసందోహంతో విదళించి అసురుడు వాలేయుని నొసలిపై తీవ్ర శిలీముఖాలు చిమ్మాడు. రక్తస్రావంతో కనులు కానరాక టక్కరిబిక్కరి అయి ఎడమచేత నయనాలు మూసి ఒక వృక్షాన్ని కుడిచేత్తో బట్టి గుండెతో కుదిపి చివరంట పెరికి దాన్ని దర్పంతో వాలేయుడు దనుజునిపై చిమ్మాడు. మందరతుల్యం, శతమన్యుధనుః ప్రతిభం అయిన ఆ వృక్షాన్ని విశిఖాలతో విచ్ఛిన్నంచేసి, వాతశర ప్రయోగంతో కుంభుడు అంగదుని అంగాంగ సంధులు భంగించాడు. సహించరాని వేదన సర్వం హరించగా అరచి, మూర్తివహించిన శౌర్యవంతుడు మూర్ఛ మునిగాడు. ఆ ఘోర సంఘటనచూచి అగచరులు రభసంగా పోయి రామునితో అంగదుని అవస్థ చెప్పారు. ఆతనికి తోడుపడే నిమిత్తం జాంబవంతుని రాముడు పంపాడు. సముద్రతీరంలో తెలివి తప్పి పడియున్న యువరాజు చెంతకు జాంబవంతుడు చేరబోయాడు. అంగదుడు మూర్ఛిల్లగానే కొందరు కపులు చేతనైనంత యుద్ధంచేసి కొంత అసుర సైన్యాన్ని ఆహుతి గొన్నారు. ఇంతలో జాంబవంతుడు వేగదర్శి, సుషేణుని వెంట పెట్టుకుని ప్రవాహంలాగావచ్చి పడబోతుంటే, నదిని, రాళ్ళచేత, చెట్లచేత గట్టున నిరోధం చేసినట్లు దూరంగానే వాళ్ళను కుంభుడు ఆపాడు. వెలివాటలేని సముద్రంలాగా, వాడి బాణాలను నిగ్రహించి ముందుకుపోలేక అగచర నాయకులు ఆగిపోయారు. కుంభుని ధాటికి అన్న పుత్రుడు మూర్ఛపోవటం, జాంబవంతుడు, వేగదర్శి, సుషేణుడు దరిలేక శిలీముఖ వర్షంలో చిక్కుకొనటం రవి సూనునికి ఆగ్రహ కారణమైంది. ఏనుగు బెబ్బులి తరిమినట్లు, తనవారిని వెనుక వేసుకుని వచ్చి దైత్యుని తరిమాడు. వృక్ష శైలాలతో గుణపాఠం నేర్పాడు. కుంభుడు చాప నైపుణ్యం చూపి అన్నీ ఖండించాడు.

## సుగ్రీవుడు కుంభుని దెప్పి పొడుచుట

తన చేతకు దానవుడు ప్రతిచేయటం, పై పెచ్చు ఇషీకాలతో బాధించటం సుగ్రీవునికి అవమానకారణం అయింది. ఆ అవమాన జాత రోషంతో ఒక్క గంతులో అరదంపై దూకి ధనువు విరిచి దవడపై పండ్లూడేట్లు బాదాడు. దంత భగ్నమైన దంతిచందంగా వున్న కుంభుణ్ణి "కుంభా! నీవు శౌర్యంలో రావణునంతవాడివి. బలిప్రహ్లాద బలవైశ్రవ బాదులకు శక్తిలో సాటివస్తావు. నీతండ్రికి నీ వొక్కడివే సముడవు. నైజ బలంలోనూ, దేహతేజోబలాల్లోనూ నిర్జరులుకూడ నిన్ను మీరలేరు. ఆధి సంతానం ఇంద్రియజేతను దరిచేరలేనట్లు పరిపంథులు నిన్ను సమీపించ లేరు. ఓ బుద్ధిమంతుడా! నీ సర్వ శక్తులు చూడాలనే సంకల్పంతో వచ్చాను. దాచకుండ నాకు చూపించు. నీ పెత్తండ్రి రావణుడు నిరుపమ వరశక్తితో, నీ తండ్రి కుంభకర్ణుడు సహజశక్తితో నిర్జరులను నిర్జిం చారు. నీవు ధనుర్విద్యలో దానవనేత యంతటి దిట్టవు. రాక్షసలోకంలో నిన్ను గాదని చెప్పే యోధుడే లేడు. అందుచేత నీవూ నేనూ పోరు కుందాం. మన బలాబలాలు భూతకోటి గుర్తిస్తుంది. అస్త్రాధికారంతో మా వాళ్ళను చాలామందిని చంపావు. నీ ధైర్యం ఎంత గొప్పదో? నిరా యుధుడవై, నిస్సహాయుడవై వున్న నిన్ను చంపితే నా గౌరవానికి భంగం. అవివేకులు అపనిందలు వేస్తారు. ఆయాసం అపనీతం చేసుకో. కోరినంత విశ్రాంతికొను. కావలసిన ఆయుధాలను సిద్ధపరచుకో. అప్పుడు నీ బలం నేను చూస్తాను. నా బలం నీవు చూడవచ్చు" అని నిండా గర్వితగౌరవ వాక్యాలు వనాటపతి పలికాడు. ఆ వాక్యాంతం అవుతుండ గానే రవిసూనుణ్ణి రాక్షసుడు బాహువుల్లో బంధించి నవ్వాడు.

## సుగ్రీవుడు కుంభుని చంపుట

దానవుడి పట్టు తప్పించుకుని తరణిసూతి దంతి వృక్షాన్ని తుండంతో పట్టినట్లు పట్టి విసరివేశాడు. వాడా పాటుకు పడకుండ నిబ్బ రించుకుని పాదాలు రెండూ పట్టుకుని పడలాగాడు. వంగి లాగుతున్న నిశాటుణ్ణి నడుం చేతులతో బిగించి తలక్రిందుగా ఎత్తి వెన్నుపై తన్ని

వనాటపతి కూలద్రోశాడు. వాడు పడి లేచి సుగ్రీవునిపైబడి ముష్టితో డొక్కలో పొడిచి వెల్లకిల పడేశాడు. ఈ విధంగా అన్యోన్యం తీసిపోకుండా సమంగా వృషభద్వయం ఢీకొన్నట్లు, పొటేళ్ళు పోరినట్లు చాలాకాలం పోట్లాడారు. క్షణక్షణం నిట్టూరుస్తూ, మళ్ళీ తలపడుతూ, తాచు పేనినట్లు పెనవేసుకుని దొర్లుతూ, కొట్టుకుంటూ, తిట్టుకుంటూ, నెట్టుకుంటూ, పొడుచుకుంటూ, ఈడ్చుకుంటూ, సొక్కుతూ, సోలుతూ, పొగలేని కీలలు విడుస్తూ, పొంచుతూ, బవలిపట్లు త్రెంచుతూ, చేతులతో కంఠాలనూ, కాళ్ళతో కాళ్ళను బిగించి మహాక్రూరంగా మల్లయుద్ధ నైపుణ్యం చూపారు. అంత జాగ్రత్తలోనూ అదను చూచుకుని అంత బలశాలిని వడిసెల త్రిప్పినట్లు త్రిప్పి సుగ్రీవుడు సముద్రంలోకి విసిరాడు. సముద్రంలో పడ్డ కుంభుడు వింధ్యపర్వతం పెందవ ఒప్పు కల్పించినట్లు కల్పించాడు. అసురుడు కోపం రూపంగొన్నట్లు అంబుధినుంచి అమాంతం అంబరానికి ఉద్గమించి సుగ్రీవుని ముందు వ్రాలి పర్వతంపై పవిపాతం లాగా గుండెలపై గుద్దాడు. ఆ దెబ్బకు గుండె చిట్లి రక్తం ప్రవాహంగా పారింది. వజ్రసన్నిభాలైన అస్థులు చావకుండా సంరక్షించినై. పిడికిటితో ఇంద్రుడు కొండరెక్కలు కూల్చేటప్పుడు పొడసూపిన విస్ఫులింగాలవలె కీశపతికి తగిలిన ఘాతం శరీరానికి వింతశోభ చేకూర్చింది. పట్టరేలప సర్వశక్తులు కూడదీసుకుని వాసవలంభుడు వజ్రసంకాశం, మేరుసగ దుర్భరం, భానుసహస్రసుందర ప్రభాభాసమానం అయిన దక్షిణహస్త ముష్టితో తంత్రిని ధ్యానించి దైత్యుని వక్షంపై గుద్దాడు. ఆ దెబ్బకు కుంభుడు విహ్వలించి కూలిపోయాడు. కూలి తిరస్కృతలోకకర మాలి వలె వనచరపతి మర్దితుడై కుంభుడు ఆకాశం నుంచి పడిన ఉల్కాజాలం వలె సమరక్షేత్రంలో సమసిపోవటంతో అసురసైన్యం రోదిస్తూ విరోధం లేకుండా పారిపోసాగింది.

## నికుంభుడు మర్కటసైన్యాబ్ధి మథించుట

కీశపతితో పోరి అసురప్రముఖుడు మరణించగానే సైన్యం బెదరి లంకాముఖం పట్టింది. నికుంభుడు అన్నపాటు చూచి, రోషసంరంభ విజృంభితుడై మంటలు గ్రక్కుతున్న నేత్రాలతో రాక్షస సైన్యాన్ని

లపి ఆహవరంగంలో దూకాడు. కాంచనగంధమాల్య కలితం, ఉత్తుంగగిరి శృంగతుల్యం, అంగుళీపంచకాబద్ధం, యమదండనిభం, రక్షోలోకభయనాశకం అయిన పరిఘం పైకెత్తి సూర్యమండలంగా భ్రమ కూడ్స్తూ, శంపాలతాయుత జలధరంచందంగా గిరగిర త్రిప్పుతూ వానర కాననానికి వహ్నిగా తలపడ్డాడు. అసురుని పరిఘా పరిభ్రమణం చేత పుట్టిన మహా వాయువులు మంటల్లాగా సోకినై. గ్రహ తారకా రవి చంద్రులు, భువనసప్తకం, ఇంద్రపురంతో కంపించినై. పరిఘా సంజాత భయంకరజ్వాలజ్వాలన కీలామాలికలు నలుదిక్కుల వ్యాపించి, సహించటానికి సాధ్యంకాక మండిస్తుంటే వానరులు పోరుమాని దూరదూరంగా పోసాగారు. రక్కసులు కూడా ఆ వేడిమికి తాళలేక పెదవులు ఎండి, కదలలేక, మెదలలేక వెరపుతో మదం తరిగి నిలబడ్డారు. ఆ దుర్భర స్థితిలో హనుమ కనుగందకుండ నికుంభుని ఎదుటికి వచ్చి కయ్యానికి రమ్మని గద్దించాడు.

## హనుమ నికుంభుని చంపుట

ప్రాణికోటి దుస్సహవేదనతో బాధపడుతుంటే, చీమకుట్టినమాత్రం కూడా భావించక అభిముఖంగానిల్చి ఆహవానికి ఆహ్వానిస్తున్న హనుమ తెంపరితనానికి అసురుడు దిగ్భ్రమచెందాడు. అంతలోనే ఆగ్రహం తెచ్చుకుని పరిఘ త్రిప్పుతూనే గుండెను గురిచూచి కొట్టాడు. అది పావని వక్షంపై తునాతునకలై పోయింది. అయినా అంజనాసుతుడు ఆ దెబ్బకు కంపించి, భూకంపంతో శైలం చలించిన విధంగా సామ్యం పొందాడు. వెంటనే ఒక్క దూకుదూకి దవడపగిలేట్లు తాచాడు. దెబ్బ తిన్నా జంకక అడుగు కదలకుండా చేతుల్లో బిగించి నలపసాగాడు. రాక్షసులు పెద్దగా కేకలు వేశారు. బాహు పంజరంలో బంధించబడినా గుండెల్లో గుద్ది హనుమ పట్టుతప్పించుకుని తట్టుకోలేని దెబ్బకొట్టి నేలకూలత్రోశాడు. పడినవానిపైబడి మోకాలితో గుండెలు నొక్కి రెండుచేతులతో మెడ బిగబట్టి కేకలు పెడుతున్నా వినకుండా మెలితిప్పి లేచి కాలితో నులిమి క్షణంలో మృత్యుగృహానికి మూటాముల్లె సవరించాడు. నికుంభుడు నేల

కూలటం, రక్కసులు పారిపోవటం, వానరులు ఉత్సాహంతో ఉప్పొంగి కేరింతలు కొట్టటం ఏకకాలంలో జరిగినై.

## మకరాక్షుడు యుద్ధానికి వెడలుట

హతశేషులైన నిశాచరులు రణభూమిలో క్షణంకూడ నిలవలేక రావణుని చేరి కుంభనికుంభులు, కంపన ప్రజంఘులు కుంభుని పాలుగావటం చెప్పి ఘోరంగా రోదించారు. క్రోధశోకాలతో పంక్తిముఖుడు బాధితుడై, మంటలు మండి, మూర్ఛిల్లి లేచి, ఖరపుత్రుడు మకరాక్షుణ్ణి గాంచి, "నాయనా! నా యాజ్ఞతో ప్రబల సైన్యం పరివేష్టింపగా భండన భూమికిపోయి, వానరులనూ, రామలక్ష్మణులను వధించి నా ఆత్రుతకు శాంతి కల్పించు"మని చెప్పాడు. పాతపగ, ప్రభువు ఆజ్ఞ ప్రేరేదా నమస్కరించి సైన్యాధిపతికి సైన్యాన్ని ఆయత్తం చేయమనీ, రథాన్ని సిద్ధం చేసి తెమ్మనమనీ చెప్పి అవసర విధులన్నీ ముహూర్త కాలంలో ముగించి అలంకృతమై వచ్చిన రథానికి ప్రదక్షిణించి ఆసీనుడై "సారథీ! సముగ్రజవంతో స్యందనాన్ని సమరభూమికి నడుపు. చమూపతీ! సైన్యంతో నాకు ముందుగా వుండి యుద్ధం చేయండి. నేను రాజాజ్ఞ చొప్పున రామలక్ష్మణ వానరవీరులను ఖడ్గ బాణశూలాది సాధనాలను ప్రయోగించి దావాగ్ని శుష్కకాననంవలె నిర్దహిస్తాను. మహాసేనాపతి ఆజ్ఞనంది మాంసభోజులు సునిశితనానా యుద్ధాలు శోభించగా కపుల ఓంకారంవలె గర్జిస్తూ, కామరూపధరులై, ఖరకమము విరవిర గగనాన్ని ఆక్రమిస్తూ పైకి వస్తున్నట్లు శంఖభేరీపణవ ఢక్కాహుడుక్కాది వాద్యవిశేషాలను మ్రోగిస్తూ చాపగుణటంకార సంరంభంగా మొనలుతీరి క్రమబద్ధంగా కదనరంగానికి కదిలి వెళ్ళారు. అత్యుత్సాహంతో రామాది శత్రువుల గడ్డివలె మార్చి నీళ్ళల్లో కలిపి త్రాగుదామన్నట్లు బయలు దేరిన మకరాక్షుడు లంకాప్రాకారం దాటి కదనభూమిలోకి ప్రవేశిస్తుంటే నిర్నిమిత్తంగా తేరిపై టెక్కెం విరిగి ధరణి దొరలింది. గుర్రాలను అదలిస్తుంటే చేతిలో చబుకు సారథి గుర్తించకుండానే జారిపోయింది. గుర్రాల కాళ్ళు తొట్రుపడ్డై. కన్నుల నీరు కార్చినై. ముఖాలు శోభ తక్కినై. ప్రతికూల వాయువులు సపాంసులై ప్రచండగా వీచసాగినై.

బహువిధదుశ్శకునాలు పొడగట్టినా సహించి మేఘ గజాహి సపవ
అపుడు అహమహమికతో దుస్సహ విక్రముడైన దాశరథి
ప్రదేశానికి జయనాదాలు చేసుకుంటూ ప్రయాణించారు.

ఇది యుద్ధకాండ, మిందున
వదలిరి ప్రాణాలు రెండు వర్గంబులలో
బ్రదుకుల తీపిని వదలుచు
సదసుల చిత్తమ్ముతోడ సమరమునందున్.

వారి యాత్మలు శాంతి నొందులుగాక ।
వారి యాప్తుల దుఃఖముల్ బాయుగాక ।
ఏరితలకు వచ్చు బాధలు బాసిపోయి
బహుళ శుభకార్య సంతతి ప్రబలుగాక ।

నిష్ఠ పాటించి నిష్ఠతో నిరతమేను
నీకు మాదుగ వ్రాసెడి నాకు కూడ
సర్వ విఘ్నంబులడగించి సర్వభద్ర
ములనొసంగుము పావని । మోత్తకరము.

"సహనావవతు సహనౌభునక్తు సహవీర్యం కరవావహై
తేజస్వినావధీతమస్తు మావిద్విషావహై. ఓం శాంతి శ్శాంతి శ

నమోస్తు రామాయ సలక్ష్మణాయ, నమోస్తుదేవ్యై జనకా:
[illegible]ఘువేవరాయ, నమోస్తు వల్మీకభవాయ:

శ్రీకృష్ణచంద్రార్పణమస్తు.



# ఎమెస్కో వచన రామాయణం

శతావధాని కోట వీరాంజనేయ శర్మ



Volume Ten

Price Rs. 5/-

cover printed at nandini art printers, hyderabad-29

